# చతుర

ఆగస్టు 2011
రూ. 10/-




★ కాశీ విశ్వనాథ్

తాజా హాస్యనవల

**ఈ రాక నీకోసమే ..6**

# కాప్షన్ మీదే - 32



ఈనాడు కార్టూనిస్ట్, ప్రముఖ చిత్రకారుడు శ్రీధర్ వేసిన పై కార్టూన్‌కు నవ్వొచ్చే కాప్షన్ రాయండి. చక్కని బహుమతి అందుకోండి!
బాగున్న మరో నాలుగు ఎంపిక చేసి, పంపినవారి పేర్లను ప్రచురిస్తాం.

మీ కాప్షన్లు అందాల్సిన చివరి తేదీ ఈ నెల 18

చిరునామా: సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 082
e-mail : vipula.chatura@eenadu.net

ఉత్తమ వ్యాఖ్య :

ఇప్పుడు శపించు చూద్దాం..!

-వై. గైనేరు,
మాదాపూర్, హైదరాబాద్





## కాప్షన్ మీదే -31

బాగున్న మరికొన్ని కాప్షన్లు :

క్షమించండి సామీ!
ఏదో మత్తు వాసన వస్తే .. పరీక్షిస్తున్నా
- బి. అప్పారావు, తుని

స్వామీ! నువ్వు చూసుకో ధ్యానం సంగతి!
నేను చూసుకుంటా దాహం సంగతి!!
- బి. చెర్రి, కరీంనగర్

(పా) వనవాటిక యందునూ
గంగాపహరణమా!
- ఎస్. అబ్దుల్ అజీజ్,
పెద్దమందడి, మహబూబ్‌నగర్ జిల్లా

మనుషులున్న చోట
మహర్షులుంటే ఇంతే!!
- కె.వి. లక్ష్మణరావు,
మానేపల్లి, తూ. గో. జిల్లా

సంపుటి -34, సంచిక - 7
403వ సంచిక, పేజీలు : 132
ఆగస్టు 2011

# చతుర



'భార్యాభర్తలిద్దరికీ ఒకేసారి టైం దగ్గర పడింది' అన్నాడు సిద్ధాంతి.
'మావాళ్ల గురించీ మాటలేంటి?' గుడ్లురిమింది కొండమ్మ.
'టైం అంటే దశ తిరిగిపోయే టైం' సర్దుకున్నాడు సిద్ధాంతి.
'అదెలా?' అడిగింది కొండమ్మ కోడలు పద్మావతి.
'మీకు పరిచయమయ్యే ఓ కొత్త వ్యక్తి ద్వారా' అన్నాడు సిద్ధాంతి.
'ఆ కొత్తవ్యక్తి ఆడా? మగా?' అడిగాడు పద్మావతి భర్త.
'ఆ వ్యక్తి ముందెవరికి పరిచయ మవుతారు?' అంది పద్మావతి.
'ఎవరికి పరిచయమైనా మీ జీవితాలు పరుగులు పెడతాయ్' అన్నాడు సిద్ధాంతి.
'ఇంతకీ ఆ సిద్ధాంతి మాటలు నిజమయ్యాయా? వారి జీవితాలు పరుగులు పెట్టాయా? ఆద్యంతం కడుపుబ్బ నవ్విస్తూ సాగే సుప్రసిద్ధ సినీరచయిత **కాశీ విశ్వనాథ్** తాజా హాస్య నవల

**ఈ రాక నీ కోసమే**

పేజీ ...6

బొమ్మలు, కవర్ పేజి : రాకేశ్



పుస్తకాలంకరణ : రాజుయాట



# 2011లో ఇంప్రింట్‌వారి
# భారతదేశంలోని తీర్థయాత్రలు
# పుణ్యభూముల సందర్శనం



## శృంగేరి యాత్ర
గోకర్ణము, మురుదేశ్వర్, మూకాంబిక,
ఉడిపి, ధర్మస్థల, హోరనాడు, శృంగేరి
4 రోజుల యాత్ర , రూ. 4000/- బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 21/1,11/2,11/3,8/4,13/5,10/6, 8/7,12/8,9/9,7/10,11/11,9/12

## తమిళనాడు దర్శన్
వెల్లూర్, తిరుత్తని, కంచి, పాండిచ్చేరి, నవగ్రహ దేవాలయాలు, తిరువెంకాడ్,
తిరుచ్చి, మధురై, కుర్తాళం, రామేశ్వరం, కన్యాకుమారి, శుచేంద్రం, త్రివేంద్రం.
7 రోజుల యాత్ర , రూ.11500/- రైలు, బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 21/1, 18/2, 18/3, 15/4, 20/5, 17/6, 19/8,16/9,14/10,18/11,16/12

## మహారాష్ట్రా దర్శన్ అష్ట గణపతులు
షిరిడి, తుల్జాపూర్, కొల్హాపూర్, అక్కల్‌కోట్, 4 జ్యోతిర్లింగాలు
7 రోజుల యాత్ర , బస్సు ప్రయాణం. ఖర్చు రూ. 12500/-
యాత్ర తేదీలు : 21/1, 24/2, 25/3, 22/4, 27/5, 24/6, 22/7, 26/8, 23/9, 21/10, 26/11, 22/12

## హిమాలయ దర్శన్
బాగేశ్వర్, బైద్యనాథ్, పాతాళభువనేశ్వర్, బేరీనాగ్, జాగేశ్వర్, రాణీకేత్,
నైనితాల్. ఈ క్షేత్రముల యందు సాక్షాత్తు దేవతలు ప్రత్యక్షమగును.
రైలు, బస్సు, 10 రోజుల యాత్ర, ఖర్చు రూ. 16000/-
యాత్ర తేదీలు : 11/1, 18/2, 18/3, 15/4, 20/4,17/5,15/6, 19/7, 16/8,23/9,21/10,26/11,16/12

## గుజరాత్ దర్శన్ సోమనాథ్, నాగేశ్వర్
పంచద్వారకలు, గోపితలాప, మాతృగయ, జామ్‌నగర్, పోరుబందర్
7 రోజుల యాత్ర , బస్సు ప్రయాణం. ఖర్చు రూ. 11000/-
రాజ్‌కోట్ వరకు రైలు అక్కడ నుండి బస్సు, యాత్ర తేదీలు :
11/1,25/1,22/2,8/3,22/3,5/4,19/4,10/5,24/5,7/6,21/6,5/7, 19/7,9/8,23/8,6/9,20/9,4/10,18/10,8/11,22/11,6/12,20/12

## కేరళ యాత్ర
కాలడి, చోటాకినారా, రామలక్ష్మణ భరత శత్రుఘ్నుల దేవాలయాలు
గురువాయూరు, అలిపి, మున్నార్, త్రివేంద్రం, కన్యాకుమారి
9 రోజుల యాత్ర , రైలు, బస్సు ఖర్చు రూ. 18000/-
యాత్ర తేదీలు : 28/1, 25/2, 25/3, 21/4, 26/5,28/6,28/7, 28/8, 28/9,19/10,23/11,22/12

## ఉజ్జయిని ఓంకారేశ్వర్ యాత్ర
ఉజ్జయిని, హర్షవర్ధినిదేవి (శక్తిపీఠం), ఓంకారేశ్వర్, మహేశ్వర్, జ్యోతి
ర్లింగములు, ఆంజనేయస్వామి దేవాలయం, పార్వతి దేవాలయం
4 రోజుల యాత్ర , రైలు, బస్సు ప్రయాణం. ఖర్చు రూ. 5500/-
యాత్ర తేదీలు : 22/1,12/2,26/2,12/3,26/3,9/4,23/4,14/5,28/5,11/6,25/6,9/7, 23/7,13/8,27/8,10/9,24/9,8/10,22/10,12/11,26/11,18/12,24/12

## సంపూర్ణ నేపాల్ యాత్ర
లుంబిని, పోక్రా, ముక్తినాథ్, మనోకామ్న, పశుపతినాథ్,
దక్షిణకాశీ, జనక్‌పురి, చిన్నమస్త, కోసిదామ్, ఖాట్మండ్,
రూ. 42,000/- ఒక్కరికి
(ప్రయాణ భోజన వసతులతో సహా)

## ఒరిస్సా, బెంగాల్, అస్సాం దర్శన్
పూరీ, సాక్షిగోపాలం, కటక్, భువనేశ్వర్, గిరిజాదేవి, కాళీమాత దేవాలయం,
గంగాసాగర్, చందాసాగర్, తారకేశ్వర్, పక్షేశ్వర్, శాంతినికేతన్, బ్రహ్మపుత్రానది,
ఉమానందా దేవాలయం, పీకాక్ ఐలాండ్ , కామాఖ్యా దేవాలయం.
12 రోజుల యాత్ర, రూ. 18000/- , రైలు, బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 21/1,25/2,25/3,22/4,27/5,24/6, 22/7,26/8,23/9,21/10,25/11,23/12

## కాశీ, గయ, ప్రయాగ
కాశీయందు పిండప్రదానం చేయు వారికి ఆంధ్రప్రదేశ్ తూర్పుగోదావరి
జిల్లాకు చెందిన ఋత్వికులచే తీర్థ కార్యక్రమాలు జరుపుకొనే సౌకర్యం
కల్పించబడును. 6 రోజుల యాత్ర. రూ. 5,500/- (భోజనములు కాక)
రైలు, బస్సు ప్రయాణం. యాత్ర తేదీలు : ప్రతీరోజు

## చార్‌ధామ్ యాత్ర
హరిద్వార్, హృషీకేశ్, యమునోత్రి, గంగోత్రి, కేదార్‌నాథ్, బదరీనాథ్.
13 రోజుల యాత్ర, రూ. 20000/- రైలు, బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 3/5,20/5,27/5,3/6,17/6,24/6,1/7,22/7, 29/7,5/8,19/8,26/8,2/9,16/9,30/9

## ద్వాదశ జ్యోతిర్లింగ యాత్ర
శ్రీరామేశ్వరం, శ్రీశైలం, భీమాశంకర్, శ్రీ త్రయంబకేశ్వర్, ఘృష్ణేశ్వర్,
పర్లీవైద్యనాథ్, శ్రీనాగేశ్వర్, శ్రీసోమనాథ్, ఉజ్జయిని, శ్రీ ఓంకారేశ్వర్,
శ్రీ కేదార్‌నాథ్, వారణాసి. 23 రోజుల యాత్ర. రైలు, బస్సు ప్రయాణం.
రూ. 32000/- యాత్ర తేదీలు : 27/1,24/2,24/3,26/4, 23/5,21/6,25/7,22/8,20/924/10,24/11,22/12

వివరాలకు :





**దంటు నాగార్జున శర్మ, వేద నిలయం. ఇంప్రింట్ ట్రావెల్స్ & టూర్స్**
ఫ్లాట్ నెం. 504, సంయుక్తా అపార్ట్‌మెంట్స్, అంబాలికా ఫర్నిచర్ పైన, రాజా డీలక్స్ ఎదురుగా, ముషీరాబాద్,
హైదరాబాద్ - 20. ఫోన్ : 040 – 2754 7708 / 2754 7709, సెల్ : 98850 89092

హఠాత్తుగా తననో షాపింగ్‌మాల్‌లో కలిసిన ప్రియాంక చిన్నప్పుడు తన తండ్రివద్ద పనిచేసిన జకరయ్య కూతురని పద్మావతికి తెలిసింది. బాల్యంలో తనకు ఊడిగం చేసిన ప్రియాంక తనకంటే సిరిసంపదలతో తులతూగుతున్న విషయం పద్మావతికి ఏమాత్రం మింగుడుపడలేదు. ఆ క్షణం నుంచి ఆమె మనశ్శాంతి కోల్పోయింది. ప్రియాంక ఎదురుగా తాను సైతం దర్పాన్ని ప్రదర్శించాలని నిర్ణయించుకుంది.

కానీ ఆ తర్వాత ఏమైంది?

అనుక్షణం ఇతరులతో పోల్చుకుంటూ తల్లడిల్లే మహిళల మనస్తత్వాన్ని మహాద్భుతంగా చిత్రించిన సినీ రచయిత కాశీ విశ్వనాథ్ తాజా హాస్యనవల

**ఈ రాక నీకోసమే**

చతుర ఆగస్టు కానుక!



"మా ఆవిడ చాలా తెలివయింది. ఇది నా అభిప్రాయం మాత్రమే కాదు. మా ఆవిడ అభిప్రాయమూ అదే"

-ఇది సురకత్తుల సుబ్బారాయుడి అభిప్రాయం.

"మా ఆయన జీవితం తెరిచిన పుస్తకమే! కాకపోతే అందులోని ఒక్కముక్కా అర్థమై చావదు"

-ఇది పద్మావతి అభిప్రాయం.

పద్మావతి, సుబ్బారాయుడు దంపతులే!

ఈ సృష్టిలో సూర్యుడి రాకతో వెలుగొస్తుంది, చంద్రుడి రాకతో వెన్నెలొస్తుంది. మబ్బుల రాకతో వర్షం వస్తుంది.

జీవితంలో.. ప్రియమైన వారితో శుభాలొస్తాయి. శత్రువుల రాకతో కష్టాలొస్తాయి. ఇవి కూడా ఫిక్స్ అని ఆ దంపతులకి తెలుసు! కానీ వారి జీవితాల్లోకి ప్రియమైన శత్రువు రాకతో ఏం వస్తాయి? ఏం వచ్చాయి?

★ ★ ★

గ్రేటర్ విశాఖపట్నంలో, మరీ గ్రేట్‌గా లేని ఇంట్లో అద్దెకుంటున్నాడు రాయుడు. అతని తల్లి కొండమ్మ గం.భా.స. (గంగా భాగీరథీ సమానురాలు) వర్గంలో జాయినైపోయి చాలా కాలమయింది. ఈమధ్య కొన్ని సంవత్సరాలుగా కొండమ్మ లాంటి తల్లి కేరక్టర్లు మధ్యతరగతి కొంపల్లో కనబడటం తగ్గింది గానీ, కొన్నేళ్ల క్రితంవరకు కొంపకో కొండమ్మ కనిపించేది. అలాంటి వారిలో పోయినవారు పోగా, ఓల్డేజ్ హోమ్‌కి చేరుకున్నవారు చేరుకోగా, ఇంకా బేలన్స్ ఉండిపోయిన ఒకానొక తెలుగింటి మధ్యతరగతి తల్లి ఈ కొండమ్మ! ఇలాంటి తల్లుల్లో ముఖ్యంగా మూడు రకాలవారుంటారు.

నోరు ఎక్కువ, బుర్ర తక్కువ వుండే వాళ్లు.. ఒకటోరకం!

బుర్రెక్కువ, నోరు తక్కువ వున్న వాళ్లు... రెండోరకం!

బుర్రలో సరుకు, బాడీలో చురుకు, మాటల్లో కరకు వున్నవాళ్లు... మూడో రకం!

రాయుడు తల్లి కొండమ్మ ఆ మూడో రకం మనిషే! ఈ కాలంలోని కోడళ్లు కొంతమంది వాళ్ల అత్తల్ని దుత్తల్లాగా, మావల్ని దోమల్లాగా చూస్తున్నారని ఒకానొక తల్లి, ఎలియాస్ అత్తగారు ఓ పత్రికలవారి ఇంటర్వ్యూలో చెప్పారు. అత్తగార్లకి ఇటీవల కొంతమంది కోడళ్లు నిక్‌నేమ్‌లు కూడా పెడుతున్నారని అత్తస్థానంలోకి ఎదిగిన ఒకానొక తల్లిగారి ఆవేదనకి బాక్స్ కట్టి మరీ ప్రచురించింది ఓ ప్రముఖ దిన పత్రిక. అయితే అత్తలకి నిక్‌నేమ్‌లు పెట్టినా, ఆ పేర్లని ఎవరితోనో మాట్లాడినప్పుడు ఉపయోగిస్తారు తప్ప, డైరెక్టుగా అత్తగారితో మాట్లాడినప్పుడు వాడరు. కానీ, పద్మావతి చాలాసార్లు కొండమ్మతోనే ఆ పేరు గురించి చెప్పింది.

"కె.కె. ఈగ" ఇది ఆ నిక్‌నేమ్ అయితే, దానికి ఎబ్రివేషన్ పూర్తి సారాంశం- కదిలిస్తే కందిరీగ!

రాయుడి వయస్సు ప్రస్తుతం నలభైకి తక్కువుండదు. అతనో ప్రైవేట్ కంపెనీలో ఆఫీస్ సూపర్నెంట్ పోస్టులో ఉద్యోగం చేస్తున్నాడు. త్వరలో బ్రాంచ్ మేనేజర్ అవుతాడు. కానీ ఇంకా అవలేదు. అతనికి తల్లన్నా, తల్లి మాటలన్నా మహా గౌరవం. కాకపోతే అతను ఆచరించేది మాత్రం భార్య మాటల్నే. దేశంలోని పోలీసులు, గవర్నమెంట్ ఆఫీసర్లు రూలింగ్‌లో ఎవరుంటే వాళ్ల మాటల్నే వింటారు తప్ప అపోజిషన్‌వాళ్ల మాట వినరు. ఆ ఇంట్లో పద్మావతి రూలింగ్ పార్టీ. రాయుడి పెళ్లి జరిగిన దగ్గర్నుంచీ కొండమ్మ అపోజిషన్ పార్టీగా మిగిలిపోయింది. 'నేనే రూలింగ్ పార్టీని' అని పద్మావతి ఏనాడూ ప్రకటించ

లేదు. నలుగురూ వచ్చి దండాలు పెడితే, నల్లరాతి విగ్రహం కూడా దేవుడి రూపంగా గౌరవాలు అందుకున్నట్టు.. రాయుడు ఎప్పుడైతే పద్మావతి మాటమీద నడుచుకోవడం ఆరంభించాడో, అప్పుడే ఆవిడ రూలింగ్ పార్టీగా మారిపోయింది. అతను అనేక విషయాల్లో సొంతబుర్ర ఉపయోగించకుండా, భార్య బుర్రమీదే ఆధారపడ్డం ఆరంభించి చాన్నాళ్లయింది.

రాయుడికి 'శంభు' అనే కొడుకున్నాడు. గ్లాసుకంటే ఎక్కువ, చెంబుకంటే తక్కువగా ఉండే శంభు టింపనీ స్కూల్లో చదువుతున్నాడు. ఆ చిరంజీవి వయసు తొమ్మిది సంవత్సరాలు. కోతకి వచ్చిన చేనులా నిండుగా, అందంగా కనిపించే కాంచన.. రాయుడి చెల్లెలు. కాలేజీలో ఫైనలియర్ చదువుతోంది. ఇంక పద్మావతి.. అంతకు ముందెప్పుడో స్టేట్ గవర్నమెంట్‌లో క్లాస్ ఒన్ ఆఫీసరుగా పనిచేసిన ఆనందరావు కూతురు! పద్మావతి చిన్నతనంలో ఆమె ఇల్లు భూలోకస్వర్గంలా వుండేదట. ఇంటిముందు సొంత కారు, గవర్నమెంటు కారు, ఇంటిలోపల నౌఖర్లు, ఆనందరావుకి లంచాలివ్వడానికి వచ్చే కంట్రాక్టర్లు, వాళ్ళు తెచ్చే కానుకలు, ఇచ్చే మర్యాదలతో ఇల్లంతా కోలాహలంగా వుండేది. ఒక్క మాటలో చెప్పాలంటే... పద్మావతి బాల్యంనించి యవ్వనం వరకు రాయల్‌గా, రాజసంగానే గడిచిపోయింది. ఈ మాటలు ఇతరులు చెప్పే అవకాశం ఇవ్వకుండా పద్మావతే, తన పెళ్లైన దగ్గర్నించి ప్రతి ఒక్కరికీ చెప్పుకొస్తోంది. ఇప్పుడు.. అంటే, పెళ్ళైన దగ్గర్నించీ వుండేది ఆ అద్దింట్లోనే!

★ ★ ★

ఉదయం ఆరున్నరకి పద్మావతి నిద్రలేచింది.

లేవగానే చేతికి అందే దూరంలో వుంచుకున్న హ్యాండ్ మిర్రర్ అందుకుని అందులో తన ముఖాన్ని చూసుకున్నాక, ఎదురుగా గోడమీదున్న వెంకటేశ్వరుడి ఫొటోని చూస్తుంది. చూశాక హాల్లోకి వెళ్ళి టీవీ ఆన్‌చేసి ఉదయాన్నే చాలా ఛానెల్స్‌లో వచ్చే రాశిఫలాలు, శుభలగ్నం మొదలైన కార్యక్రమాలు చూస్తూ, ఆ రోజు తన దినఫలం ఎలా వుందో శ్రద్ధగా వింటుంది.

పద్మావతి లేచి, హాల్లోకొచ్చి, టీవీ ఆన్ చెయ్యగానే వంటగదిలో కాఫీ కలుపుతున్న కొండమ్మ స్వగతాలు పలుక్కోవడం ఆరంభిస్తుంది. ఆవిడలా స్వగతాలు పలుక్కోవడం పద్మావతికి తెలుసు. 'ఈవిడగారికి కంటికి కనపడని గ్రహాల మీదున్న నమ్మకం ఇంట్లో ఉండే మనుషుల మీద ఉండదు. ఈవిడ దశ ఎప్పటికైనా తిరిగిపోయి, మాయానగరం మహారాణిలా చక్రం తిప్పుతాదట. ఆ దశ తిరిగిపోయే టైమ్ ఎప్పుడొస్తుందా? అని ప్రతిరోజూ దినఫలాలు, ఆదివారంనాడు వారఫలాలు చూస్తుంది' ఇదంతా కొండమ్మగారి సణుగుడు సారాంశం.

పద్మావతి కూడా కళ్ళతో టీవీ చూస్తూనే నోటితో సణుగుతుంది, "పొలిటికల్ లీడర్లకి కంటిముందు జనం, నోటి దగ్గర మైకు లేకపోతే మాటలు రావంటారు. కానీ మా కేకేఈగా గారికి మాత్రం జనం, మైకు లేకపోయినా మాటలొస్తాయి'

కొండమ్మ కప్పుతో కాఫీ తీసుకొచ్చి పద్మావతికి అందించి, చీపురు పట్టుకుని హాలంతా తుడవడం ఆరంభించింది.

"అత్తయ్యా! నీ రాశిఫలం వింటావా?" అంది పద్మావతి.

కొండమ్మ తుడుస్తూనే సమాధానం చెప్పింది. "నాది మీనరాశి. మీనం అంటే చేపన్న మాట. ఆ చేప ఎలాగైతే పుట్టిందగ్గర్నుంచి చచ్చిందాకా నీట్లోనే వుంటాదో,

నేను కూడా పుట్టిందగ్గర్నించి చచ్చేదాకా యింట్లోనే తగలడాలి. దాని బతుకులోనూ, నా బతుకులోనూ ఏ మార్పు లేనప్పుడు నాకెందుకీ రాశిఫలాలు? నేను కోడలిగా వున్నప్పుడు అత్తకి సేవలు చేశాను. అత్త పోస్టులోకి వచ్చాక కోడలికి సేవ చేస్తు న్నాను. నా చేత చాకిరీ చేయించుకునే మనుషులు మారారు తప్ప, నాకు మాత్రం చాకిరీ తప్పలేదు.."

కొండమ్మ సణుగుతుండగానే పద్మావతి టీవీ ఆఫ్ చేసి ఛర్రుమంటూ లేచింది. "వద్దు.. అని ఒక్క మాటలో చెప్పేదానికి ఇంత సణుగుడెందుకు? నువ్వు నాకు సేవలు చేస్తున్నట్టే, రేపు నేనూ నీకు

## కొత్తగాలి...

**ప్రతినిధులకు**
**స్థలాభావం**
**ప్రతి'నిధి'కీ**
**రహస్యస్థలం!**

– జి. హరితశ్రీ, బెంగళూరు

సేవలు చేస్తాను కదా!"

"ఎప్పుడూ? నేను చచ్చినప్పుడా?"

"అంతదాకా ఎందుకాగుతాను? రేపెప్పు డైనా నీకు ఏ ఎయిడ్సో కేన్సరో వస్తే, అప్పుణ్ణేను డే అండ్ నైట్ ఎంత సేవ చేస్తానో నువ్వే చూస్తావుగా!"

కొండమ్మ చీపురు విసిరేసి గంయ్ మంటూ లేచి "నువ్వెప్పుడో చేసే సేవలు చూడ్డానికి నేను ఎయిడ్సూ కేన్సర్లూ తెచ్చు కోవాలా?" అంటూ బిగ్గరగా ప్రశ్నించింది.

ఆ ప్రశ్నకు సమాధానం చెప్పక్కర్లేద న్నట్టుగా ఫీలై పద్మావతి తన సెకెండ్ షిఫ్ట్ నిద్రకి బెడ్‌రూమ్‌లోకి వెళ్లిపోయింది. రాశి ఫలాల గురించి వినేశాక మళ్లీ పడుకుని తొమ్మిదింపావుకి లేవడం ఆమెకి అలవాటే! అలా ఎక్కువ భాగం నిద్రలోనే గడిపే బదులు, ఎక్కడైనా చదువుకి తగ్గ ఉద్యోగం చేస్తే నాలుగు రూపాయలొస్తాయి కదా అని కొండమ్మ చెప్పినా ఆమె వినలేదు.

పద్మావతి గదిలోకి వెళ్లి తలుపులు గడి యపెట్టి మంచంమీద వాలింది.

ఆమె తీవ్రంగా ఆలోచిస్తున్నది.. అంత వరకు విన్న వారఫలాల గురించే!

"ఈ వారంలో మీకో నూతన వ్యక్తి పరి చయమవుతారు. ఆ తర్వాత ఇంతవరకు నేలమీద నిదానంగా నడుస్తున్న మీ జీవితం పరుగులు తీయడం ఆరంభి స్తుంది"

వారఫలాల్లో సింహరాశికి ఈ మాటే చెప్పారు. ఈ మాట ఎప్పుడు చెప్తారా? అని ఆమె గత పదేళ్లుగా ఎదురుచూ స్తోంది. ఎందుకంటే, పెళ్లికి ముందు ఆమె జాతకాన్ని ఓ ప్రముఖ జ్యోతిష్యుడికి చూపించాడు తండ్రి. అతను సినీ ప్రము ఖులకి ఎక్కువగా జాతకాలు చూసి, జోస్యం చెప్తుంటాడు. వీలున్నంత ఎక్కు వగా సినిమా ఫంక్షన్స్‌లో పాల్గొంటూ, టీవీ కెమెరాల ఎదురు, ఎక్కువగా నిలబ డుతూ, ప్రేక్షకులకి పరిచితమైన ఫేస్‌గా, ప్రసిద్ధ జ్యోతిష్యుడిగా ఆడియన్స్ దృష్టిలో ఎస్టాబ్లిష్ అయ్యాడు. అందువల్ల ఆయన ముఖం చూడగానే ఈయనగారు సినిమా జ్యోతిష్యుడనే గుర్తింపు లభించింది. అదే కాకుండా టీవీలో యాడ్స్ కూడా ఇచ్చాడు 'ఉత్తరాంధ్రాని ఊపేసి, దక్షిణాంధ్రాని దంచేసిన ప్రఖ్యాత జ్యోతిషరత్న' అని ప్రచారం చేయగా, అది చూసిన ఆమె తండ్రి ఆనందరావు ఆగమేఘాల మీద ఆయన్ని రప్పించి, ఆయన అడిగిన పారి తోషికం ఇచ్చి అమ్మాయి జాతకాన్ని చూపించాడు జ్యోతిషరత్నం గారికి. ఆయ




## నాకెప్పుడూ సంతోషమే!

బ్రిటిష్ పరిపాలనా కాలంలో ఇండియాలో గార్డులు, స్టేషన్ మాస్టర్లు రైల్వేశాఖలోని అత్యంత ప్రముఖ వ్యక్తులుగా పరిగణించబడేవారు. వైస్రాయి పదవీ బాధ్యతల నుండి తప్పుకున్న తర్వాత లార్డ్ హాలీఫాక్సు న్యూఢిల్లీ వదిలి వెళ్లిపోతున్నప్పుడు ఇండియాలో ఉన్న ఐదేళ్లకాలంలో తనపట్ల చూపిన మర్యాదకు స్టేషన్‌మాస్టరుకు ధన్యవాదాలు తెలియజేశాడు.



అప్పుడు అక్కడి స్టేషన్ మాస్టరు ఆయనతో ఇలా అన్నాడు, "మీరు చెప్పవలసిన అవసరం లేదు యువర్ ఎక్సలెన్సీ! మిమ్మలను సాగనంపటం నాకెప్పుడూ సంతోష కారణంగానే ఉంటుంది"

దాంతో మొదట తెల్లబోయి, తర్వాత హాయిగా నవ్వుకున్నారాయన.

## సమయం చూస్తే అంతే !

ఒకసారి ఓ పెద్దమనిషి థామస్ ఆల్వా ఎడిసన్‌ను ఓ పార్కులో కలుసుకుని చాలా విషయాల గురించి మాట్లాడాడు. తర్వాత 'వ్యాపారంలో ప్రవేశించబోతున్న నా కుమారుడికి మీరు ఓ మంచి సలహా ఇవ్వండి?' అని ఎంతో నమ్రతతో కోరాడు.



దానికి ఆ మహా విజ్ఞాని ఏమాత్రం తడుముకోకుండా వెంటనే, 'అయితే సరే, మీ కుమారుడికి ఎప్పుడూ గడియారం వైపు చూడకు అనే మాటల్ని ఆదర్శంగా తీసుకుని శ్రమించమన్నానని నా సలహాగా చెప్పండి' అని జవాబిచ్చాడు.

## సలహా పాటిస్తే జైలుపాలే!

సర్ పాట్రిక్ హేస్టింగ్స్ బ్రిటన్‌లో ప్రసిద్ధిగాంచిన బారిస్టర్, రాజకీయ వేత్త, రచయిత కూడా. ఒకప్పుడు ఆయన తన కక్షిదారుడైన వ్యక్తిని క్రాస్ ఎగ్జామిన్ చేస్తున్నాడు. అతనేమో ఏదేదో సమాధానం చెప్పేసి తెగ ఇబ్బంది పెడుతున్నాడు లాయర్‌గారిని.



దాంతో విసిగి వేసారిన హేస్టింగ్స్, 'నా సలహా వినదల్చుకుంటే, నువ్వు ఈ విధంగా జవాబులు చెప్పవు' అన్నాడు దృఢంగా.

దానికి ఆ కక్షిదారు కూడా అంతే దృఢంగా, 'మీ సలహా చచ్చినా తీసుకోను. ఒకసారి మీ సలహా తీసుకోవడం వల్లనే నేను ఏడాదిపాటు జైలు శిక్ష అనుభవించాను' అన్నాడు.

## దొరకని కారు!



ఓసారి రోల్స్‌రాయిస్ కారులో ప్రయాణం చేసి హెన్రీఫోర్డ్ 5వ జార్జి చక్రవర్తిని కలుసుకున్నాడు. అతని స్వంత ఉత్పత్తి, చౌక అయిన ఫోర్డ్ కారుకు బదులు రోల్స్‌రాయిస్‌లో ఎందుకు ప్రయాణించవలసి వచ్చిందని జార్జి చక్రవర్తి అడిగారు.

దానికి ఫోర్డ్, 'మహాప్రభూ! నేను ఎప్పుడు ఫోర్డ్‌కారు కోసం మా మేనేజరును అడిగినా తయారుకాగానే ఇస్తానని చెబుతుంటాడు. ఆ కారు తయారుకాగానే ఎవరో ఒకరు దాన్ని చేజిక్కించుకుంటారు. అందువల్ల నేను ఆ తర్వాత ఉత్తమ శ్రేణికారు అయిన రోల్స్ రాయిస్‌లోనే ప్రయాణం చేయవలసి వస్తోంది' అని చెప్పారు.

న సినిమా నీళ్ళు ఎక్కువగా తాగడం వల్ల ఆయన మాటల్లో కూడా ఎక్కువగా సినిమా సౌండ్ వినిపిస్తుంది.

"మీ అమ్మాయి జీవితంలోని ఫస్టాఫ్ అంతా జస్ట్ ఏవరేజ్ సినిమాలాగే నడుస్తుంది. కానీ, సెకండాఫ్ వుంది చూశారూ.. సూపర్‌హిట్ సిల్వర్ జూబ్లీ సినిమాయే అనుకోండి. ఫస్టాఫ్ ఆర్ట్ ఫిల్మ్‌లా స్లోగా నడుస్తూ, అమ్మాయికే బోర్ కొట్టేస్తుంది. కానీ, ఆఫ్టర్ ఇంటర్వెల్ పక్కా మసాలా సినిమాలాగా ఉత్కంఠభరితంగా నడిచి, మీ అమ్మాయి జీవితాన్ని చూసే ప్రేక్షకులచేత చప్పట్లు కొట్టిస్తుంది" ఇదీ ఆయన చెప్పిన జ్యోతిష సారాంశం. ఆనందరావు తనకున్న కొన్ని సందేహాల గురించి కొన్ని ప్రశ్నలు వేశాడు. అన్నింటికీ కలిపి 'కాలమే సమాధానం చెప్తుంది' అనే ఒకే ఒక్కమాట చెప్పి హడావుడిగా వెళ్లిపోయాడు జ్యోతిషరత్న.

"ఫస్టాఫ్ అంటే ఎప్పట్నించి? సెకండాఫ్ అనేది ఎప్పుడు ప్రారంభమవుతుంది? ఆడదాని జీవితానికి ఫస్టాఫ్ అంటే, పెళ్లి కాక ముందు అని అర్థం చెప్పుకోవచ్చా? " అని ఆనందరావు అడిగిన ప్రశ్నకి మాత్రం జవాబిచ్చాడు.

"కొన్ని సినిమాలకి టైటిల్స్ ముందు కూడా కొంత కథ నడుస్తుంది. దాన్ని కూడా కొంతమంది విషయంలో ఫస్టాఫ్ అనుకోవచ్చు. కొంతమంది ఆడపిల్లలకి పెళ్లవక ముందు భాగమంతా ఫస్టాఫ్ అనుకోవచ్చు. కానీ, నీ కూతురు విషయంలో నేన్చెప్పిన ఫస్టాఫ్, సెకండాఫ్ రెండూ అమ్మాయి పెళ్లి తర్వాత నడిచే భాగాలే" అని జవాబిచ్చాడు.

ఆ తర్వాత పరిస్థితులు ఉల్టా పల్టా అయిపోయాయి. పద్మావతిని అమెరికాలో మెడిసిన్ చదువుతున్న మేనల్లుడు రత్నాకర్‌కిచ్చి పెళ్లి చెయ్యాలనే ఆనందరావు ఆశించాడు. రత్నాకర్‌కి అమెరికా వెళ్ళి చదువుకోవడానికి కావాల్సిన డబ్బంతా అతనే ఏర్పాటు చేశాడు. ఆ ఏర్పాటు చేస్కోడానికే తన ఉద్యోగంలో లంచాలు తీసుకునే పద్ధతిని ఆచరణలో పెట్టాడు. పంపిస్తున్న డబ్బు చాలడంలేదని రత్నాకర్ ఫోన్ చేసిన ప్రతిసారీ లంచాలకి రేటు పెంచేవాడు. కానీ, పెళ్ళి ముహూర్తాలు ఎప్పుడు పెట్టుకుందామని అడిగినప్పుడు, 'సారీ, నాకు మేనరికాలు చేస్కోవడం ఇష్టంలేదు' అని రత్నాకర్ ఒకే ఒక్క అభ్యంతరాన్ని ఒకే ఒక్క వాక్యంలో చెప్పిన క్షణం నుంచే కష్టాలు ఆరంభమయ్యాయి.

తత్సంబంధమైన గొడవలు, ఘర్షణలు జరిగాక, "ఇన్నాళ్లూ నీ కోసం ఖర్చుపెట్టిన లక్షలన్నీ నాకిచ్చెయ్" అని ఆనందరావు అడిగాడు.

"అలాగే ఇచ్చేస్తాను. నేను నీ దగ్గర అప్పు తీసుకున్నప్పుడు రాసిచ్చిన ప్రామిసరీ నోట్లు తీసుకురా" అని రత్నాకర్ చెప్పాడు.

అతను స్వయానా మేనల్లుడు కాబట్టి, అల్లుణ్ని చేస్కోవాలనే ఆశతో ఇంత డబ్బు ఖర్చు చేశాడు తప్ప.. ఇస్తున్నది అప్పు అని ఏనాడూ భావించలేదు కాబట్టి ఎలాంటి పత్రాలూ రాయించలేదు. ఆనందరావు గత్యంతరం లేక మౌనం వహించాడు. రత్నాకర్ చేసిన తిరస్కారం ఆనందరావు పాలిట అశనిపాతమే అయింది. ఆ వారంలోనే అతను ఎప్పుడూ తీసుకునే విధంగా లంచం తీసుకుంటుండగా, ఎప్పుడూ లేని విధంగా ఏసీబీ అధికారులు రెడ్‌హ్యాండెడ్‌గా పట్టుకున్నారు. ఏసీబీ పట్టుకున్న చాలామందిలో కొంతమంది కేసుల్నించి పాదరసం జారినట్టు జారిపోయారు. కానీ, ఆనందరావు మాత్రం జారలేకపోవడం వలన ఉద్యోగం నుంచి డిస్మిస్ అయ్యాడు. డిస్మిస్ అవడం వల్ల

కుటుంబానికి గ్రాట్యుటీ, పెన్షన్లేవీ రాలేదు. పైగా, అతనికి కారాగారశిక్ష విధించడం వలన జైలుజీవితం గడుపుతూనే మరణించాడు. ఉన్న వైభవాలు కరిగిపోయి, ఆ జ్ఞాపకాలు మాత్రం మిగిలిపోయాయి. అప్పట్లోనే.. ముప్ఫై ఏళ్లు వచ్చినా సంబంధాలు కుదరడంలేదని కుంగిపోతున్న సుబ్బారాయుడి విషయం తెలిసి.. గంతకి తగిన బొంత అని ఇరుపక్షాలవారూ భావించడం వలన.. పెళ్లి కోసం రాయబారాలు, బేరసారాలు, కాళ్ల బేరాలు లాంటివేవీ అక్కర్లేకుండానే పెళ్లి జరిగిపోయింది. ఇదీ పద్మావతిగారి పాత చరిత్ర.

పెళ్లై అత్తవారింటికి వచ్చిన దగ్గర్నించి, జ్యోతిష్యుడు చెప్పిన సెకండాఫ్ ఎప్పుడు ప్రారంభమవుతుందాని ప్రతిరోజూ ఎదురు చూస్తూనే ఉంది. అయితే.. ఎప్పట్నించి సెకండాఫ్ స్టార్టవుతుందో మాత్రం ఆమెకి అర్థం కాలేదు. అన్ని సంవత్సరాల తర్వాత యిన్నాళ్లకి 'నీ దశ తిరిగే టైము దగ్గర పడింద'ని వారఫలాల్లో చెప్పారు.

భూమ్మీద బతికే మనుషులందర్నీ నడిపించి, కంట్రోల్ చేసే రిమోట్, గ్రహాల చేతిలో వుంటుందని పద్మావతి ప్రగాఢ విశ్వాసం. రాబోయే అదృష్టాన్ని అందుకోడానికి రెడీగానే ఉంది. కానీ, ఈ వారంలో ఓ కొత్త వ్యక్తి పరిచయమవుతారని చెప్పారు. ఎవరా వ్యక్తి? వ్యక్తి.. అంటే ఆడా? మగా? ఆ విషయం క్లియర్‌గా చెప్పలేదు. తనకి రాబోయే అదృష్టానికీ, ఆ వ్యక్తికీ ముడిపడి ఉందనే విషయం మాత్రం స్పష్టంగా తెలుస్తోంది.

తొమ్మిదిన్నరకి డైనింగ్ టేబిల్ దగ్గర రాయుడితో, ఆడపడుచు కాంచనతో కలిసి టిఫిన్ తింటూ ఈ విషయమే ప్రస్తావిస్తోంది. సాయంకాలం జగన్నాథం పంతు

లుగార్ని పిలిపించి, ఓసారి మన జాత కాలు చూపిద్దామని రాయుడితో చెప్పింది. అంతవరకు మౌనంగా వడ్డిస్తున్న కొండమ్మ తన ధోరణిలో సమాధానం చెప్పింది.

"ఎవరో కొత్త మనిషి పరిచయమై, నీ జీవితాన్ని మలుపు తిప్పేస్తుందని నీ సింహరాశి వాళ్లకి చెప్పుండొచ్చు. కానీ, అది నీ ఒక్కదానికే చెప్పినట్టు నువ్వెం దుకు గింజుకుపోతున్నావో నాకు అర్థం కావడంలేదు. ఈ దేశంలో ఆ రాశిలో, ఆ నక్షత్రంలో నువ్వొక్కదానివే కాదు.. కొన్ని లక్షల మంది పుట్టుంటారు. ఆ సిద్ధాంతులు జనరల్‌గా రాస్తారే తప్ప, నీ ఒక్కదాని కోసం ప్రత్యేకంగా రాసెయ్యరు. అసలే నీకు డబ్బు విషయంలో చెయ్యి జోరెక్కువ. దానికితోడు ప్రతి రెండు నెల లకోసారి జగన్నాథంపంతులుగార్ని పిలిచి, మీ ఇద్దరి జాతకాలు చూపిస్తుంటావు. అత నికో రెండు వందలో, మూడు వందలో ముడుపుకట్టి పంపేస్తుంటావు. మన చేతి చమురు వదిలిపోవడం తప్ప మన పరిస్థి తిలో ఏమైనా మార్పొచ్చిందా? "

అసెంబ్లీలో అపోజిషన్ పార్టీవాళ్లు ఎన్ని గొడవలు పెట్టి, ఎన్నిసార్లు వాకౌట్లు చేసినా, రూలింగ్ పార్టీవాళ్లు తాము అను కున్న పనే చేసుకుపోయినట్లు, కొండమ్మ ఎంత సణిగినా పద్మావతి పట్టించు కోకుండా ఆ సాయంత్రం జగన్నాథం పంతుల్ని పిలిపించి తన జాతకాన్ని, రాయుడి జాతకాన్ని చూపించింది.

జగన్నాథంపంతులికి డబుల్ మీనిం గుల పంతులుగారనే లోకల్ టాక్ కూడా వుంది. అతను జాతకాన్ని చూసి ఏ ఫలి తాన్నీ తిన్నగా చెప్పడు. డబుల్ మీనింగులోనే చెప్తాడు. ఓ పది నిమిషాల పాటు రెండు జాతకాల్నీ ఎగాదిగా చూ శాడు. తర్వాత తిరగేసి మరగేసి చూ శాక.. చాలా నిరాశగా తలాడిస్తూ "మ్చ్.. లాభంలేదు. ఇద్దరికీ ఒకేసారి టైమ్ దగ్గర పడిపోయింది" అన్నాడు.

పద్మావతి, రాయుడు కంగారుపడ్డారు. కానీ, కొండమ్మకి మాత్రం ఒళ్లు మండిపో యింది. ఆవిడకి జాతకాల మీదే పెద్దగా నమ్మకం లేదు. అంతకు మించి ఆ పంతు లుగారి మీద అస్సలు నమ్మకం లేదు. అందుకే చిరాగ్గా అడిగింది

"ఇద్దరికీ ఒకేసారి దగ్గరపడిపోడానికి, వాళ్ల వయసులెంతనుకున్నావ్? "

"అమ్మా, నేను చెప్పేది వాళ్లిద్దరి రేషన్ కార్డులు చిరిగిపోయే టైమ్ దగ్గర పడిపో యిందని కాదు. ఇద్దరికీ దశతిరిగిపోయే టైమ్ దగ్గరపడిందని! జాగ్రత్తగా వినండి. ఈ వారం పది రోజుల్లో మీకో వ్యక్తి పరి చయమవుతారు" అన్నాడు జగన్నాథం పంతులు.

పద్మ, రాయుడు ఒకర్నొకరు ఆశ్చ ర్యంగా చూస్తున్నారు. వారఫలాల్లో చెప్పిందే ఇతనూ చెప్తున్నాడు.

"వ్యక్తి అంటే.. ఆడా? మగా? "

రాయుడు ఆసక్తిగా అడిగాడు.

"ఆడయినా కావచ్చు.. తప్పితే మగ యినా కావచ్చు. వాళ్లిద్దరూ కాకుండా, మరోమనిషి పరిచయమయ్యే ఛాన్స్ లేదు ఎహ్హెహ్హెహ్హె" ఓ గొప్ప రహస్యాన్ని చెప్పే

## కొత్తగాలి...

**ఆఫీసులో అందరూ**
**నిద్రలో జోగుతున్నారు**
**బాస్ తన లేడీసెక్రటరీతో**
**టూర్‌కెళ్లాడు మరి!**

– పి.వి.ఎన్. ప్రసాద్,
నవులూరు, గుంటూరు జిల్లా

సినట్టుగా కిస్కూకిస్కూమని నవ్వాడు పంతులు.

"పోనీ, మా ఇద్దర్లో ఎవరికి పరిచయమవుతారు? " అడిగింది పద్మావతి.

"మీకు పరిచయం అవుతారు.. తప్పితే మీ ఆయనగారికి పరిచయం అవుతారు. మీ ఇద్దరికే అవుతారు తప్ప, మీ అత్తగారికో, ఆడపడుచుకో మాత్రం అవరు. ఆ వ్యక్తి పరిచయం అయ్యాక మీరు పరుగులు తీస్తారు. అలా పరుగులు తీసీ తీసీ తీసీ... చివరికి ఎక్కడికో వెళ్లిపోతారు ఎహ్హేహ్హేహ్హే"

"ఎక్కడికో.. అంటే, ఎక్కడికి? కిందకా? మీదకా? " కొండమ్మ వ్యంగ్యంగానే అడిగింది.

పంతులు దానికీ తడుముకోకుండానే చెప్పాడు "అదే గండికోట రహస్యం. వాళ్లు కిందకెళ్తారా? మీదకెళ్తారా? అనే విషయం వాళ్లు తీసుకునే నిర్ణయం మీదే ఆధారపడి వుంటాది"

అలా పంతులు ఏదీ స్పష్టంగా చెప్పకుండానే, మరో అరగంటసేపు మాట్లాడి, ఆ దంపతుల్ని మరింత సందిగ్ధంలో పడేసి, డబ్బులు తీసుకుని వెళ్లిపోయాడు.

రాబోయే అదృష్టం స్వరూప స్వభావాల గురించి రాయుడు తన అభిప్రాయాన్ని చెప్పాడు. "నాకు మేనేజర్ పోస్టు. ఎనిమిది నెలల క్రితమే వస్తుందనుకున్నాను. రాలేదు. బహుశా, అది ఈ వారంలో వచ్చేస్తుందనుకుంటాను. అదొస్తే జీతం బాగుంటుంది కాబట్టి మన ఫ్యామిలీ పొజిషన్ కూడా బాగుంటుంది"

పద్మావతి అదికాదని తల అడ్డంగా ఆడించి "కాదు కాదు! కడుపుతో ఉన్నమ్మ కనక మానేస్తుందా? రావాల్సిన ప్రమోషన్ రాకుండా పోతుందా? ఒకవేళ అదే కరక్టయితే, ఎవరో మనిషి పరిచయం కావడమంటూ ఎందుకు చెప్తారు? ఇంకా ఏదో వుంది" అంది.

ఆ మాటకు కొండమ్మ తీవ్రంగా స్పందించింది. "అది కాకపోతే మరేటి వచ్చేస్తాదంటావు? మా తరపునించి కోటానుకోట్ల ఆస్తులేవైనా కోర్టు తగవుల్లో వుంటే... అవి మనకే వచ్చేసేలా తీర్పు ఇచ్చేస్తారనుకోవచ్చు. కానీ అలాంటివేం లేవు. అలాగే, మీ తరపునుంచీ రావల్సినవీ ఏమీ లేవు. అలాంటప్పుడు ఏ వైపునుంచి ఏ అదృష్టాలు కమ్ముకొచ్చి, మన కష్టాలు గట్టెక్కి పోతాయంటావ్? మన ఇంటిల్లిపాదికీ ఆధారం రాయుడికొచ్చే జీతమే! దేవుడి దయవల్ల ఆ మేనేజర్ ప్రమోషన్ వచ్చేస్తే, జీతం పెరుగుతుంది కాబట్టి కొంతలో కొంత నయం. అలా అనుకుని, ఈ చర్చా కార్యక్రమాలు మానేయండి" అంది.

రెండు నిమిషాల మౌనం తర్వాత "మీకు ప్రమోషన్ ఎప్పుడొస్తుంది? " అని అడిగింది పద్మావతి.

"వచ్చేస్తుంది... ఆన్ ద వే"

"ఇదేమాట ఏడాదినించీ చెప్తున్నారు. ఆ పోస్ట్ ఎలాగూ మీకే రావాలి కాబట్టి, మీ జన్రల్ మేనేజర్ని కాస్త ఎర్లీగా ఇచ్చేయమని చెప్పండి" అంది పద్మ ఫైనల్‌గా.

★ ★ ★

వారానికి ఒకటి రెండుసార్లయినా, కొండమ్మకీ, పద్మావతికీ గొడవ తెచ్చిపెట్టే మరో విషయం ఉంది. వీర్నాయుడు అనే కూరగాయల బండివాడు.. ఈ వీధిలోకి బండిమీద కూరగాయలు తీసుకొచ్చి అమ్ముతుంటాడు. అతన్తో బేరమాడి కూరగాయలు కొనేది కొండమ్మే. వీర్నాయుడు ఆ వీధిలో ఎక్కువ రేట్లకి అమ్ముతాడని, రెండు వీధులు దాటాక కాస్త చవగ్గా అమ్ముతాడని కొండమ్మ ప్రతీసారి పెద్ద నోరు పెట్టుకుని గొడవకి దిగుతుంది. వ్యాపారంలో అమ్మేవాడెప్పుడూ ఎక్కువ చెప్తాడు. కొనేవాడు ఎప్పుడూ తక్కువకే

అడుగుతాడు.

కొండమ్మకి తగ్గట్టుగా వీర్నాయుడు కూడా బిగ్గరగానే అరుస్తూ "ఆ దిగువీ్వీధిలో వుండేదంతా కూలీనాలీ చేసుకునే అలగా జనం. వాళ్లు లేబర్ జనం కాబట్టి, ఓ పావలా అర్ధా చవగ్గా ఇచ్చేస్తాం. పైగా ఇక్కడ మీలాంటోళ్లంతా నదరుగా వుండే కూరగాయలు, నవనవలాడే కూరలూ తీసే స్కోగా, మిగిలిన పిసరా పిప్పీ వాళ్లకి అమ్ముతాం. మీకూ ఆ రేటుకే కావాలంటే, మీరూ ఈ ఇల్లు ఖాళీ చేసేసి, ఆ లేబర్ గూడేనికి ఎల్లిపోండి..." అంటాడు.

ఇంట్లో ఉన్న పద్మావతికి ఆ మాటలు వినిపిస్తూనే వుంటాయి. అలాంటి సమయాల్లో ఆవిడ ఒంటిమీద తేళ్లూ జెర్రెలు పాకుతున్నట్లుగా ఫీలవుతుంది. పెళ్లికి ముందు తన పుట్టింట్లో నౌఖర్లు వెళ్లి కూరగాయలు కొనుక్కొచ్చేవారు. తన తల్లి కూరగాయలు కొన్న సందర్భాలూ తక్కువే..అందులో బేరాలాడిన సందర్భమే లేదు. అందుకే కొండమ్మ బేరమాడ్డాన్ని పద్మావతి ఖండించింది. "బేరాలాడ్డం అలగా జనం చేసేపని" అని కచ్చితంగా చెప్పింది, కానీ కొండమ్మ కూడా గట్టిగానే చెప్పింది.

"చూడమ్మా! ఒకప్పుడు నువ్వెలా బతికేవు. రేపెలా బతుకుతావనే విషయాన్ని పక్కనబెట్టి, ఇప్పుడెలా బతుకుతున్నావో గుర్తుంచుకుని ఖర్చుపెట్టడం మంచిది. ఆ వీర్నాయుడు అడ్డకి పడ్డగా రేట్లు చెప్పేస్తే, మనం బేరమాడుకుని కొనుక్కోవాలి. నెల జీతాల్తో సంసారాలు చేసేవాళ్లు వంద రూపాయల దగ్గర ఓ పది రూపాయలయినా మిగల్చడానికి ప్రయత్నించాలి గానీ, రూపాయి దగ్గర పది రూపాయలు ఖర్చు చేస్తే ఆ ఇల్లు వర్ధిల్లదు. దక్షత లేని కొంపకి పదిలక్షలు వచ్చినా లాభం ఉండదని పెద్దలు ఊరకే చెప్పరు. దక్షత వుండాల్సింది ఇల్లాలికే"

కొండమ్మ చెప్పిన మాటలన్నీ కొండల మీద కురిసిన వానే అయింది.

సూరమ్మ అనే మరో మనిషి కూడా నెత్తిమీద కూరగాయల గంప మోసుకొచ్చి ఇంటింటికీ అమ్ముతుంది. ఆవిడకి వ్యాపారలౌక్యం బాగా తెలుసు. పద్మావతికి 'మేడమ్ గారూ' అని పిలిపించుకోవాలనే కోరిక వుంది. పుట్టింట్లో వుండేటప్పుడు ఆమె తల్లి సుశీలని అందరూ 'మేడమ్' అని పిలిచేవారు. అంతేకాదు, కొంతమంది.. ముఖ్యంగా ఆఫీస్ ప్యూన్ జకరయ్య వచ్చి ఇంటిపనులు చేస్తూ పద్మని కూడా 'చిన్న మేడమ్ గారూ, స్మాల్ మేడమ్ గారూ' అనే పిలిచేవాడు. తను జీవితాంతం 'మేడమ్' అని పిలిపించుకోవాలనుకుంది. తన భర్త మేనేజరయ్యాక అందరూ తనని మేడమ్ అనే పిలుస్తారు. కానీ, అంతవరకు అలా పిలిచే మనిషి ఎవరైనా కనిపిస్తే బావుణ్ణనుకుంది. ప్రస్తుతం ఇక్కడ పద్మావతిని 'మేడమ్ గారూ' అని పిలిచే ఏకైక వ్యక్తి సూరమ్మే! అందుకే ఆవిడ కూరగాయల్ని కాస్త ఎక్కువ రేటు చెప్పినా బేరమాడకుండా కొనేస్తుంది. అది తప్పని కొండమ్మ ఎన్నిసార్లు చెప్పినా ఆమె వినలేదు. అంతేకాదు.. ఆ ఇంట్లో తన మాటే చెల్లుబాటవుతుందని సూరమ్మ ముందు నిరూపించుకోడానికి ఇంట్లో కూరగాయలున్నా సూరమ్మ వచ్చి 'మేడమ్' అని పిలిచేసరికి మాట్లాడకుండా కొనడం ఆరంభించింది.

అది గమనించి కొండమ్మ "నువ్వు నన్ను సాధించడానికి ఇన్ని కూరగాయలు ఇంతింత రేటుకి కొనేస్తుంటే.. నేను వీధిలో నిలబడి, బండోడితో బేరాలాడి చవగ్గా కొన్నా ప్రయోజనం ఏముంది? పైగా, అవసరానికి మించి కొనెయ్యడానికి ఏమైనా బియ్యమా? పప్పులా? కూరగా

యలు. నిల్వ ఉంటే వాడిపోతాయి, కుళ్లి పోతాయి" అంది.

కొండమ్మ చెప్పిన హితోక్తులన్నీ సూరమ్మ పిలిచే 'మేడమ్' అనే పిలుపు ముందు అక్కరకు రాకుండాపోయాయి.

★ ★ ★

ఆ రోజు పద్మ, రాయుడు, కాంచన దుర్గగుడికి వెళ్లారు. పూజారి పూజ చేసి హారతి ఇస్తుంటే, రాయుడు రెండు రూపా యల కాయిన్ పళ్లెంలో వేశాడు.

"మేడమ్‌గారు ఈ మధ్య గుడికి రావడం మానేశారు. ఈ అమ్మవార్ని సేవిస్తాం. మీలాంటి అమ్మగార్ని దీవిస్తాం. సేవిం చినా, దీవించినా మీలాంటి మేడమ్‌గార్లు మమ్మల్ని చల్లగా చూస్తారనే గదా!"

పూజారి మాటలు వృథా కాలేదు. హార తిపళ్లెంలో ఇరవై రూపాయల నోటు వేసింది పద్మావతి.

రాయుడు గతుక్కుమన్నాడు. నెలాఖర్లో పూజారి హారతి పళ్లెంలో భార్య వేసిన ఇరవై, ప్లస్ తను వేసిన రెండు.. మొత్తం ఇరవై రెండు రూపాయలా? 'ఎందుకు వే శావ్?' అని అడగాలనే అనుకున్నాడు. కానీ, అది ధైర్యానికి సంబంధించిన విషయం! అదెలాగూ తన దగ్గరలేదు. 'మేడమ్' అనే పిలుపు పద్మావతి పాలిట 'సమ్మోహనాస్త్రం!'

గుడిమెట్లు దిగారు. అక్కడ ఆటో వుంటే "ఏవయ్యా, బిగ్‌బజార్‌కి వస్తావా?" అని అడిగింది పద్మావతి.

రాయుడు కాస్త చలించాడు. నెలాఖర్లో బిగ్‌బజార్‌లో షాపింగంటే, కరెంట్ ప్లగ్‌లో వేలుపెట్టడమే!

"బిగ్‌బజార్‌కి వెళ్లాలని ముందుగా అను కోలేదు కదా వదినా?" అంది కాంచన.

"ముందుగా అనుకుని వెళ్లడానికి ఇదేమ యినా మినిష్టర్‌గారి టూర్ ప్రోగ్రామా?" సీరియస్‌గా ఎదురు ప్రశ్నించింది పద్మ.

ఆటోవాడు మీటర్ వేసేసి 'రండి మేడమ్' అన్నాడు.

రాయుడి గుండెలు మళ్లీ గుబగుబలా డాయి. డ్రైవర్‌గూడా మేడమ్‌గారూ అనే సమ్మోహనాస్త్రం వదిలేశాడు. "అది కాదు పద్మా, ప్రస్తుతం నెలాఖరు కదా.. డబ్బులు.." నసుగుతున్నాడు రాయుడు.

పద్మావతి చూపు పదునైన కత్తిలా వుంది. "చూడండి. బిగ్‌బజార్‌లోకి వచ్చిన ప్రతీవాళ్లూ ఏదో ఒకటి కొనాలనే రూల్ ఆ షాపు వాళ్లు పెట్టలేదు. సామాన్లు చూడ్డానికి టిక్కెట్ పెట్టలేదు. చూశాక కొనకుండా వచ్చేస్తే వాళ్లు మనల్ని కొట్టరు. ప్రతిరోజూ ఉదయం మీరు ఆఫీస్‌కి వెళ్లిపో తారు, కాంచన కాలేజికి వెళ్లిపోతుంది. ఆ తర్వాత, రోజంతా నా ముఖం మీ అమ్మ, మీ అమ్మ ముఖం నేనూ చూస్తూ కూర్చుని.. కూర్చుని బోర్ కొట్టేస్తోంది. కాస్త ఛేంజ్ కోసమైనా వెళ్లాలి" ఆమెలో కచ్చితమైన నిర్ణయం కనిపించింది.

"ఆటో.. ఎంత కావాలి?" రాయుడికి అడక్క తప్పింది కాదు.

"ముప్ఫై ఇచ్చెయ్యండ్సార్" డ్రైవర్ చాలా మామూలుగా చెప్పేశాడు.

రాయుడు అతన్తో గొడవకి దిగబో యాడు.

"ఏంట్సార్, మేడమ్‌గార్లాంటి పెద్దింటి

---

## కొత్తగాలి...

**మౌనం అర్ధాంగీకారమే**
**కానీ**
**అది మగవాడి విషయంలో**
**కాదు**

– ప్రతాప వెంకట సుబ్బారాయుడు,
సికింద్రాబాద్

లేడీస్‌తో వచ్చినప్పుడు డబ్బులకోసం వెన కాడతారు? "

డ్రైవర్ మాటలకి పద్మావతి ముఖం వెండిపళ్లెంమీద పడిన సూర్య కిరణంలా జిగేల్ మని మెరిసింది.

"మేడమ్‌గారు పెద్దింటి లేడీ అని మేం చెప్పలేదుగా" రాయుడు గొణిగాడు.

"ఎవరు ఏ లెవెల్ మనుషులో? ఫేస్ లోని లైటింగ్ చూస్తే తెల్సిపోద్దండి"

అంతే! పద్మ ఆటోలో కూర్చుండిపో యింది. గత్యంతరం లేనట్టుగా రాయుడు, కాంచన కూడా కూర్చున్నారు. ఆటో ముందుకు దూసుకుపోయింది.



**2**

**బి**గ్ బజార్లోని సామాన్లు, వాటి రేట్లూ చూస్తూ ముందుకు వెళ్తున్న పద్మ, ఆమె బృందానికి "ఎక్స్క్యూజ్ మీ" అనే మధుర మైన స్త్రీ గొంతు వినిపించి అందరూ వెనక్కి చూశారు. షికారుకొచ్చిన శ్రీమహా లక్ష్మిలా అందంగా, సంస్కారవంతంగా ఉండే ఓ మహిళ కనిపించింది. ఆమె గూడా పద్మావతి వయసుదే.

"మీరు పద్మావతిగారు కదూ? " ఆమె అడిగింది.

"ఔను"

"నేనండి, మీ నాన్నగారి దగ్గర అటెండ రుగా పనిచేసిన జకరయ్య కూతుర్ని, అయామ్ ప్రియాంక"

పద్మావతి మనసు రాకెట్ కంటే వేగంగా ఇరవై ఏళ్ల క్రితానికి పరుగుతీ సింది. జకరయ్య ఆమె తండ్రి దగ్గర ప్యూన్.. అంతకుమించి నమ్మినబంటు! ఆ కుటుంబంలో అనేకసార్లు బట్టలు వుతి కాడు. చెప్పులు తుడిచాడు. పద్మావతిని పదే పదే చిన్న మేడమ్‌గారూ అని పిలి చాడు. అప్పుడప్పుడు అతని కూతురు వర హాలమ్మని తీసుకొచ్చేవాడు. ఆ అమ్మాయి కూడా యువరాణి దగ్గర బానిస బాలిక లాగే వినయవిధేయతలు ప్రదర్శిస్తూ ఓ పక్కన నిలబడేది.

పద్మావతి గతం నించి తెరుకుని "నీ పేరు వరాలమ్మ కదా! మరి ప్రియాంక గోరింక అంటూ సినిమాపేర్లు చెప్తా వేంటి? " అడిగింది రవ్వంత హేళనగా.

ప్రియాంక చాలా సంస్కారవంతంగా నవ్వి "జీవితమే మారినప్పుడు పేరు మార డానికేం వుందిలెండి" అంది.

"ఇప్పుడేం చేస్తున్నావు? "

ఆ ప్రశ్నకి సమాధానం ఆమె చెప్పలేదు. ఆమె వెనకనున్న పనిమనిషి నర్సమ్మ చెప్పింది. "ప్రియాంక యిప్పుడు సెంట్రల్ మినిష్టర్ భూపాల చంద్రగారి కోడలు. 'ఎవెక్స్ అండ్ కంపెనీ మేనేజింగ్ డైరెక్టర్ శ్రీహర్షగారి సతీమణి. డబల్ పోస్ట్‌గ్రాడ్యు యేషన్ చేసింది"

ఆమె పరిచయం వినగానే రాయుడికి, కాంచనకి ఆనందంతో కూడిన ఆశ్చర్యం కలిగింది. పద్మావతి మనసులో మాత్రం మంటలు భగ్‌భగ్‌మంటూ ఎగసి ఆ మంటల కాంతి ముఖం మీదకి ప్రసరించి ఎర్రబడింది. 'ఆఫ్టరాల్ ఓ ప్యూన్ కూతు రికి యింత అదృష్టం పడుతుందా? ' అని.

ఆ ప్రశ్నకి ఆమె సమాధానం చెప్పు కునేలోగా ప్రియాంకే చెప్పింది. "మనం కలిసి చాలా సంవత్సరాలయింది కదండి. ఇక్కడ నిలబడేం మాట్లాడతాం? అలా

పార్కుకెళ్లి మాట్లాడుకుందాం"

ఆమె మాటకి మంత్రబద్ధులయిన వారిలా ఆమె వెంట బైటకి నడుచుకెళ్లి ఆమె కారు ఎక్కారు. అది యాభై లక్షల విలువ చేసే కారు. రాయుడు పరమానం దపడుతూ కారు ఎక్కాడు. పార్కులో అందంగా, ప్రశాంతంగా వున్న ఓ స్థలంలో కూర్చుకున్నారు. ప్రియాంక తను ఎలా చదివింది, ఎలా శ్రీహర్ష చేత ప్రేమించబడిందీ, భర్తతో కలిసి నాలుగైదుసార్లు విదేశ పర్యటన ఎలా చేసిందీ.. వివరిస్తుంటే... అందరూ సస్పెన్స్ సినిమా చూస్తున్న ప్రేక్షకుల్లా ఊపిరి బిగబెట్టి వింటూ, రెప్పార్పకుండా చూస్తున్నారు.

ఎక్కడో అగాథంలో వున్న మనిషి, తర్వాత కాలంలో ఆకాశ వీధుల్లో అందలాల మీద వూరేగడం.. కొన్ని సినిమాల్లో చూశారు. సినిమాలంటే కల్పిత కథలు కాబట్టి అలా సాధ్యమయింది. కానీ, వాస్తవ జీవితంలో అలాంటి మార్పులు బహు అరుదుగా వుంటాయి. అరుదుగా కూడా కాదు అసంభవమేనని పద్మావతి ప్రగాఢ విశ్వాసం.

"మహిమలూ మంత్రదండాలు లేకుండా గూడా జీవితాలు మారుతాయని చెప్పడానికి నేనే ఓ ఉదాహరణ. అయితే, మహా విశాలమైన మర్రిచెట్టుకు కూడా భూమిలోనే వేళ్లుంటాయన్నది ఎవరూ కాదనలేరు. ఆ విషయం మర్రిచెట్టు మర్చిపోకూడదని నాకు తెలుసు" అంది ప్రియాంక.

"మీరలా మర్చిపోలేదు కాబట్టే, బిగ్‌బజార్‌లో ఈ మేడమ్‌గార్ని చూడగానే గుర్తుపట్టి, మీ అంతట మీరే పలకరించారు" అంది నర్సమ్మ తన యజమానురాల్ని పొగుడుతూ.

అసాధ్యమనుకున్న ఒకానొక విషయం ప్రియాంక విషయంలో సుసాధ్యమే అయింది. ప్రియాంక.. ఒకనాడు తన తండ్రి దగ్గర చిత్తంబత్తెం అనుకుంటూ చేతులు కట్టుకు నిలబడిన బంట్రోతు జకరయ్య కూతురు! తను రత్నాకర్‌ని వివాహమాడి అమెరికాలో ఓ ప్రముఖ కార్డియాలజిస్ట్ భార్యగా ఓ వెలుగు వెలగాలనుకుంది. కానీ, తన విషయంలో సుసాధ్యం అనుకున్నది అసాధ్యమయింది! ఈ భావనే పద్మావతికి మింగుడు పడడంలేదు.

అంత వరకు తన కథ చెప్తున్న ప్రియాంక "మీకు తెలియని నా కథ నేను చెప్పేశాను. అలాగే నాకు తెలియని మీ కథ కూడా చెప్పండి. అన్నట్టు మీ వారేం చేస్తున్నారు? " అని అడిగింది.

పద్మావతి ఇరకాటంలో పడింది. భర్త పేరు, ఆడపడుచు పేరు కారులో వచ్చేటప్పుడే చెప్పింది. ప్రియాంక ఇప్పుడు ఐశ్వర్యం అనే తెల్లరంగు వేసుకుని హంసలా కనిపిస్తున్నా ఒకప్పుడు పేదరికంలో పుట్టిపెరిగిన నల్లకాకే! తనే ఒకప్పుడు చెప్పింది.. 'నేను ఎప్పుడూ ఇతరులు అసూయ పడేస్థాయిలోనే బతుకుతాను తప్ప ఒకరు జాలిపడే స్థితిలో మాత్రం వుండను' అని. కానీ, కాలం మరో విధంగా తీర్పునిచ్చింది. తను అసూయ పడే స్థాయికి ప్రియాంక చేరుకుంది. ఆవిడ జాలిపడే స్థితికి తను చేరుకుంది. అయినా తన వాస్తవ పరిస్థితి చెప్పి ఆమె ముందు చులకన కాకూడదనుకుంది మనసులో.

ప్రియాంక ప్రశ్న విని, జవాబు చెప్పబోయాడు రాయుడు. ప్రియాంక చూడకుండా అతన్ని గిల్లు గిల్లింది పద్మావతి.

అతను బేర్‌మని అరవాలనుకున్నా భార్య చూసిన చూపుకి ఆగిపోయాడు.

"మా ఆయనగారో పెద్ద ప్రైవేట్ కంపెనీలో రీజినల్ మేనేజర్‌గా పనిచేస్తున్నారు" తొణక్కుండా బెణక్కుండా, రెండు రెళ్లు నాలుగన్నంత కచ్చితంగా చెప్పేసింది.

రాయుడి గుండె దడదడలాడింది. 'ఏ

కంపెనీలో? ' అని ఆమె అడిగితే? ఏదో ఓ కంపెనీ పేరు చెప్పెయ్యొచ్చు కానీ, తీరా చెప్పాక ఆ కంపెనీ జనరల్ మేనేజర్ మా ఆయనగారికి బెస్ట్‌ఫ్రెండ్ అనంటే? భయంతో వణుకుతున్న రాయుడి మనసు నెమ్మదించింది. ఎందుకంటే ఆమె ఆ ప్రశ్న అడగలేదు.

కాంచన మాత్రం "వదినా! అన్నయ్య రీజినల్ మేనేజరని చెప్పావు కానీ.."

అంటుంటే, ప్రియాంక చూడకుండా పద్మావతి ఆమెను ఓ పోటు పొడిచింది మోచేత్తో! ఆ పని చేస్తూనే మాటలతో మేనేజ్ చేసింది, "ఔను కాంచనా! మీ అన్నయ్యగారు జన్రల్ మేనేజరు కావడానికి మరో ఆరునెల్లో, సంవత్సరమో పడుతుందిగా! అంతవరకు ఆయన రీజినల్ మేనేజరనే చెప్తాను. ఎందుకంటే నేను సింప్లిసిటీని తప్ప పబ్లిసిటీని యిష్టపడనని నీకు తెల్సుగా.."

కొత్తగాలి...

**నిన్న**
**అవినీతిపై పోరు**
**నేడు**
**బ్లాక్‌మనీపై హోరు**
**రేపు**
**దేనిపై ఈ జోరు**

– ఎస్. హర్షవర్ధన్, సికింద్రాబాద్

ఆ సమావేశం ఎప్పుడు ముగిసిపోతుందని రాయుడు మనసులో క్షణాలు లెక్కపెడుతున్నాడు. ఎందుకంటే తనింకా గుమస్తాగానే వున్నాడు. కాకపోతే హెడ్ క్లర్క్ పోస్ట్‌లో వుంటున్నాడు. అయితే గియితే, త్వరలోనే బ్రాంచి మేనేజర్ అవుతాడు. అంతే! రీజినల్ మేనేజరు అవడమనేది తను రిటైరయ్యేలోగా జర్గపోవచ్చు కానీ, పద్మ ఇప్పుడే తనని రీజినల్ మేనేజర్ అని పరిచయం చేసేసింది.

మరో పదినిమిషాల తర్వాత సమావేశం ముగించారు. ప్రియాంక తన విజిటింగ్ కార్డ్ తీసి పద్మావతికిచ్చి "ఏ ఆదివారమయినా మీరు మా ఇంటికి లంచ్‌కి రావాలి. సన్‌డే అయితేనే మావారు యింట్లో వుంటారు. మీరు వచ్చేముందు ఫోన్‌చేస్తే కారు పంపిస్తాను" అంది.

రాయుడు గాలికొట్టిన బెలూన్‌లా పొంగిపోతూ "అంతకంటేనా? " అన్నాడు.

కానీ, ప్రియాంక చూడకుండా అతని కాలిని ఒక్క తొక్కు తొక్కింది పద్మావతి. "మీకీమధ్య వర్క్‌టెన్షన్ ఎక్కువైపోవడం వల్ల మీకేదీ గుర్తుండడం లేదు. తను కారు పంపించడానికి మనకి లేకపోతేకదా! క్లచ్‌వైర్ కాస్త లూజ్ అయిందని పొద్దుట మీరేగా కారుని గ్యారేజిలో యిచ్చారు. మర్చిపోయారా? " అంది.

తన భార్య ఫాల్స్‌ప్రిస్టేజి ప్రదర్శించడానికి అప్పుడప్పుడు గ్యాస్ కొడుతుందని అతనికి తెలుసు! మరీ యింత పెద్ద గ్యాస్‌సిలెండర్ అని మాత్రం యివాళే తెలిసింది.

ప్రియాంక కారు ఎక్కుతూ, వారూ వస్తే ఇంటిముందు డ్రాప్ చేసేస్తానని చెప్పింది. కానీ, క్షణం కూడా తడుముకోకుండా మరో గ్యాస్ సిలెండర్ ఓపెన్ చేసింది.

"నిజానికి మేం యింటినించి బయల్దేరింది మా ఆయనగారి ఫ్రెండ్ మహాపాత్రా వున్న కేర్ హాస్పిటల్ కెళ్లడానికి! షాపింగ్ చేద్దాంకదాని బిగ్‌బజార్‌కి వస్తే అక్కడ నువ్వు కనిపించావు. దాంతో యిలా వచ్చేశాం. ఇప్పుడా హాస్పటల్ కెళ్లి యింటికి వెళ్తాం. నువ్వెళ్లిరా" అన్చెప్పింది.

"తప్పకుండా రావాలి సుమండీ" అని ఒకటికి నాలుగుసార్లు చెప్పి ప్రియాంక పనిమనిషితో కారులో వెళ్ళిపోయింది.

"ఆటోవాడు దుర్గగుడి నించి బిగ్‌బజా

ర్‌కు ముప్పై రూపాయలు అడిగాడు. ఇప్పుడు యిక్కడ్నించి యింటికి యాభై అరవైకి తక్కువకి రాడు. లిఫ్ట్‌యిస్తాను రమ్మన్నప్పుడు ఆ కారులో వెళ్లిపోతే ఓయాభై మిగిలేవికదా? " అన్నాడు, రాయుడు కాస్త బాధగా.

దానికి పద్మావతి గట్టిగానే రిటార్ట్ యిచ్చింది. "మనిషికి ప్రసెన్సు లేకపోయినా కామన్‌సెన్స్ వుండాలండి. ఇప్పుడే గదా ఆ ప్రియాంక ఎలియాస్ వరాలమ్మ దగ్గర మీరో రీజినల్ మేనేజర్ అని, మనకో కారుందని గేస్‌కొట్టాను. ముష్టి యాభై రూపాయలు కలిసొస్తాయని ఆ కారుమీద మనింటికెళ్లేమనుకోండి! ఆ యిల్లెలా వుంది? అగ్గిపెట్టంత యింట్లో నాలుగు అగ్గిపుల్లల్లా మనం, సగం విరిగిపోయిన అగ్గిపుల్లలాగ మన శంభూగాడూ బతికేస్తున్నాం. ఆ యింటిని చూడగానే ఇదో రీజినల్ మేనేజర్ వుండే ఇల్లా? అనే డౌట్ దానికి రాదూ? ఇంతవరకు నేను చెప్పినవన్నీ డబ్బా కబుర్లన్న సంగతి దానికి తెల్సిపోదూ? "

ఏమైనా పద్మావతిలో మరో మనిషిని చూడగలిగింది కాంచన!

★ ★ ★

పద్మావతి పబ్లిక్ పార్కులో ఏ గోడలూ లేని బహిరంగ ప్రదేశంలో ఫాల్స్‌ప్రిస్టేజ్ కోసం వదిలిన గేస్‌కబుర్లు గాలిలో కలిసిపోకుండా యింట్లో వున్న కొండమ్మ వరకు వచ్చాయి. ఆ వివరాలు తెలియజేసిన వాయిస్ ఓవర్... కాంచనే!

రాత్రి డైనింగ్ టేబిల్ దగ్గర వడ్డన చేస్తూ తన చిరాకుని, కోపాన్ని గ్లాసుల మీద, పళ్లాల మీదా చూపిస్తూ సణుగుడు ఆరంభించింది.

"ఏటికి వరద, నోటికి దురద వస్తే ఉపద్రవాలే తప్ప ఉపయోగాలుండవని వూరికే చెప్పరు. నోట్లో నాలిక వుంది కదాని మనిష్టం వచ్చినట్టు మాట్లాడేస్తే ఎలా? నోటితో మాట్లాడే ముందు బుర్రతో ఆలోచించాల. ఇవాళ కోసిన కోతలే రేపు మనకి వాతలు పెడతాయి.. "

అత్తగారి ఆంతర్యం అర్థం చేసుకున్న పద్మ కాంచన వైపు కొరకొరా చూసింది. కాంచన తనకేమీ తెలీదన్నట్టుగా వంచిన తల ఎత్తకుండా భోంచేస్తోంది. అది గ్రహించింది కొండమ్మ.

"దానివైపెందుకూ చూడ్డం? పార్కులో నువ్వు కోసిన కోతలు, చెప్పిన మాటలు నాకు తెలిసినందుకు కళ్లలో కొరకంచులు వేసుకు చూస్తున్నావా? చేసిందానికి సిగ్గుపడకుండా.. "

"సిగ్గుపడ్డానికి నేనేం తప్పుచెయ్యలేదు. మా ప్యూన్ జకరయ్య కూతురు వరాలమ్మ ఏవేవో గొప్పలు చెప్పింది. దాని గొప్పలతో బేలన్స్ అవాలని నేనూ కొన్ని మాటలు అన్నాను. బస్.. అయిపోయింది"

"ఎలా బస్ అయిపోద్దమ్మా? నేలమీద తిరిగే సైకిల్‌కి ఎంత పెద్ద రెక్కలు పెడితే మాత్రం విమానంగా మారిపోయి ఆకాశంలో ఎగిరిపోద్దిచెప్పు"

"అదిప్పుడు రెక్కలున్న విమానంగా మారినా, ఒకప్పుడు దాని తండ్రి హక్కుల్లేని బానిసలాగ మానాన్నగారి దగ్గర బంట్రోతులాగ పనిచేశాడు. ఇదికూడా దాని తండ్రితో పాటు వచ్చి మా యింట్లో చాలాసార్లు అంట్లుతోమింది"

"ఒకప్పుడు అంట్లు తోమిందని, ఆ అమ్మాయి యింకా ఆ తోమడం దగ్గరే వుండిపోలేదుగా. ఒకప్పుడు ఆరణాల కూలీగా పనిచేసిన టంగుటూరు అంజయ్య ఆ తర్వాత కాలంలో ఆంధ్ర రాష్ట్రానికి చీఫ్ మినిష్టరుగా పనిచెయ్యలేదా? "

భోజనం ముగించి చెయ్యి కడుక్కుంటూ రాయుడు కూడా ఓ ఉదాహరణ చెప్పాడు. "అంతెందుకమ్మా! సూపర్‌స్టార్ రజనీ

కాంత్ కూడా మొదట్లో బస్‌కండక్టర్‌గా పనిచేశాడు, ఎహ్హెహ్హెహ్హె" అంటూ చిరాకు పుట్టించేలా నవ్వుతున్న రాయుడు కొండమ్మ వేసిన ఒక్క కేకతో టక్కుమని నోరుమూశాడు.

"బుద్ధిలేకపోతే సరి! నీకు చీఫ్ మినిష్టరు అంజయ్య గురించి తెలుసు. సూపర్‌స్టార్ రజనీకాంత్ గురించీ తెలుసు. తెలిసిన ప్పుడు యీ ప్రియాంక కూడా అదే టైపులో గొప్పింటి కోడలిగా మారుండొచ్చని మీ ఆవిడకి చెప్పకుండా, మీ ఆవిడ కోసే కోతలకి నువ్వు తందానతాన అంటూ వంతపాడతావా? " అంది కొండమ్మ.

సమావేశం హాల్లోకి షిఫ్ట్ అయినా, అదే టాపిక్ మీద యింకా చర్చ జరుగుతోంది.

"ఓ ప్యూన్ కూతురు దగ్గర నేను తేలి పోవడం యిష్టంలేక కావాలనే అన్నాను. ఆ ప్రియాంక ముందు నా స్టేటస్ తగ్గిపో కూడదనే కాస్త ఎక్కువగా చెప్పాను తప్పా? " పద్మావతి తను ప్రదర్శించిన ఫాల్స్‌ప్రిస్టేజీని సమర్ధించుకుంటూనే, అత్త గారితో చాలాసేపు వాదించింది.

ఆమెను తప్పుపట్టి మందలించడం కొండమ్మ వుద్దేశ్యం కాదు. కానీ, అవసరం లేని ఆడంబరాలకి పోవడం, లేని గొప్పలు ప్రదర్శిస్తూ అబద్ధాలు చెప్పడం ఎన్ని కష్టాలు తెచ్చిపెడతాయో వివరించడమే ప్రధానోద్దేశ్యంగా చెప్పింది.

"చూడమ్మా! ఎవరి అదృష్టానికి ఎవరు కర్తలు? ప్రియాంక జీవితమనే వైకుంఠపా ళీలో, కనబడిన ప్రతీనిచ్చెన ఎక్కుకుంటూ పైస్థాయికి వెళ్ళింది. ఆవిడతో సమాన స్థా యిలో నువ్వూ వున్నావని తెలియజేయడా నికి నీకు నోటికొచ్చినవన్నీ మాట్లాడేశావు. మనకో కారుందని చెప్పావు. మొదటిదా నికి మొగుడు లేడుగానీ, కడదానికి కళ్యాణం అని సామెత చెప్పినట్టు, వీడింకా బ్రాంచ్ మేనేజర్ అవలేదు. అలాంటిది ఏకంగా రీజినల్ మేనేజరు అయిపోయా డని... జనరల్ మేనేజరు పోస్ట్‌కి వెయి టింగ్ లిస్ట్‌లో వున్నాడని కోసేశావు. హమ్మయ్య.. ఆ ప్రియాంక ముందు నా గౌరవమర్యాదలు నిలబడ్డాయని సంతోష పడిపోయావు. ఒకవేళ, రేప్పొద్దుట నీకు యివేవీ లేవన్న సంగతి ఆవిడకి తెలిసిపో యిందనుకో.. అప్పుడు నీకెంత అవమా నమో ఆలోచించావా? "

పద్మావతి యిదంతా పెద్ద విషయమే కాదన్నట్టుగా చెప్పింది. "ఛాన్స్ దొరికిందని నన్ను నేరస్థురాలిని చేసి, నువ్వు ఉపదే శాలు యివ్వకు. ఆ ప్రియాంక సడన్‌గా ఎదురుపడింది. దానికి పట్టిన అదృష్టం గురించి అదీ ఏదో గొప్పగా చెప్పింది. నేనూ ఒకప్పుడు గొప్పగానే బతికాను కాబట్టి, నేనూ ఏదో అనేశాను బస్! ఆ సీన్ అక్కడితో అయిపోయింది"

"ఎలా అయిపోతుంది వదినా! ఆవిడిం టికి మనందర్నీ డిన్నర్‌కి రమ్మందిగా" అని కాంచన గుర్తుచేసింది.

"అది రమ్మంటే మాత్రం మనం పరుగె త్తుకుంటూ పోతామా? "

"ఆవిడ చూపించిన ఆప్యాయత చూశాక నాకలా అనిపించడం లేదు. నీకు పది సార్లు ఫోన్ చేసిందనుకో.. అప్పుడూ వెళ్లడం మానేస్తామా? " కాంచనే మళ్లీ ప్రశ్నించింది.

"ఎలా చేస్తుంది? పార్క్‌లో తన విజి టింగ్‌కార్డ్ నాకిచ్చిందిగానీ, నా ఫోన్ నెంబ రు దానికివ్వనూ లేదు. అది అడగనూ లేదు. అంతసేపు మాట్లాడినా, నేను నా యిల్లు ఫలానా ప్రాంతంలో వున్నట్టుగా కూడా చెప్పలేదు. ఇంకెలా చేస్తుంది? అంచేత, యివాళ జరిగిందంతా ఓ పీడక లగా భావించి యిక్కడితో మర్చిపోండి"

పద్మావతి చెప్పినట్టు ప్రియాంక ఎపి సోడ్ ఓ పీడకలయితే, అందరూ మర్చిపో

యేవారు. వారికి రాబోయే 'తొమ్మిదో కష్టం' రాకుండానే మధ్యలో ఆగిపోయేది.

ఆ రాత్రి పద్మావతి పడుకుని "నా జీవితంలో పరిచయమయ్యే కొత్త కేరక్టరు ఎవరు? ప్రియాంకా? ఆ కొత్త వ్యక్తి పరిచయమయాక నా జీవితంలో పరుగులు ఆరంభమవుతాయన్నారు. కానీ, దాని గొడవ యిప్పుడే మర్చిపోతున్నాం. అంచేత, జాతకంలోనూ, వారఫలాల్లోనూ చెప్పిన నూతన వ్యక్తి ప్రియాంక కాదు" తనకి తానే సమాధానం చెప్పుకుని నిద్రపోయింది.

మర్నాడు ఉదయం పది గంటల వేళ.. హాల్లోని లేండ్ ఫోన్ మోగుతుంటే వంట గదిలోనించి కొండమ్మ వచ్చి ఎత్తబోయింది. పద్మ తనగదిలోనించి గబగబా వచ్చి తనే ఫోన్ అందుకుని "యస్.. పద్మావతి హియర్" అంది సోఫాలో కూర్చుంటూ.

"గుడ్ మార్నింగ్ పద్మావతిగారూ"

తుళ్లిపడింది పద్మావతి. అది.. ప్రియాంక గొంతే! దానికి నా నెంబరెలా తెల్సింది. ప్రశ్న వేసుకున్నంత సులభంగా సమాధానం దొరకలేదు. ఫోన్ పెట్టేసింది. 'ఎవర'ని కొండమ్మ అడిగితే, 'ప్రియాంక' అని చెప్పి ఆలోచనలోకి జారబోయింది. కానీ, ఆమె ప్రయత్నాన్ని అడ్డగిస్తూ ఫోన్ మళ్లీ మోగింది.

"ఆవిడే అయితే, నువ్వు వూరికెళ్లేవని చెప్పేసేదా? " అంది కొండమ్మ.

"ఎలా చెప్తావ్? ఇప్పుడేగా ఫోనెత్తి పద్మావతి హియర్ అన్నాను" అంటూ చిరాగ్గానే ఫోన్ ఎత్తి మాట్లాడింది.

"నేను పద్మగారూ ప్రియాంకని మాట్లాడుతున్నాను ఫోన్ కట్ చేశారేం? "

"కట్ చెయ్యాల్సిన ఖర్మ నాకేం పట్టింది? ఇంతకీ, నా నెంబరు నీకెలా తెల్సింది? "

"మీ ఆయనగారే యిచ్చారు"

మరోసారి అదిరిపడింది పద్మ. రాయుడు నిన్న నాతోనే వచ్చాడు. నేనుండగానే మాట్లాడాడు. "ఆయనెప్పుడు యిచ్చారు? " అడక్కుండా వుండలేకపోయింది.

"నాకివ్వలేదు. నిన్న నాతో పాటు మా పనిమనిషి నర్సమ్మ కూడా వచ్చిందిగా! ఆవిడకిచ్చారు"

ఈ సమాధానం మరింత ఆశ్చర్యం కలిగినా తమాయించుకుని "ఇంతకీ దేనికి ఫోన్ చేశావ్? " కాస్త కటువుగానే అడిగింది.

"మరేం లేదండి. నేను చాలాదేశాలు తిరిగి, స్వదేశంలో, స్వరాష్ట్రంలో ప్రస్తుతానికి సెటిలయ్యాను. మరి కొన్నాళ్లు ఇక్కడే వుంటాను. ఇక్కడ నాకు కాలక్షేపం ఎలాగా? అని ఆలోచిస్తున్న టైమ్‌లో సడన్‌గా మీరు కనిపించారు..."

ప్రియాంక ఎంతో ప్రేమపూర్వకంగా మాట్లాడుతున్న మాటల్ని పద్మావతి కట్ చేస్తూ చెప్పింది. "చూడు ప్రియాంకా, నువ్వీవూరికి కొత్తగా వచ్చావు కాబట్టి, అక్కడ నేనెంత బిజీయో నీకు తెలీదు. కల్చరల్, వెల్‌ఫేర్ ఏక్టివిటీస్‌తో పొద్దున్నించి రాత్రిదాకా బిజీ బిజీగా వుంటాను. ఇప్పుడు కూడా అయిదారుగురు సెలబ్రిటీస్‌తో సీరియస్‌గా డిస్కస్ చేస్తుంటే నువ్వు ఫోన్ చేశావ్" అంది.

కోడలు అబద్ధాల్ని కూడా అంత ఆశువుగా చెప్పగలదని కొండమ్మకి ఆరోజే తెలిసి ఆశ్చర్యంతో నోరు నొక్కుకుంది.

"అయామ్ సారీ పద్మగారూ.. పోనీ, మీరు మా యింటికి ఎప్పుడొస్తారు? " ప్రియాంక వినయంగా అడిగింది.

"నేను చేసే సంఘసేవకి సెలవుండదు. ఇంత బిజీలో, నేను పనిగట్టుకుని రావడం కుదిరేపని కాదు గానీ.. ఎనీహౌ, నువ్వు మరీ యింతగా రిక్వెస్ట్ చేస్తున్నావు కాబట్టి, నేను రావడానికి ప్రయత్నిస్తాను.. ఎప్పుడని అడక్కు! నాకెప్పుడైనా తీరిక దొరికితే

నీకు ముందుగా ఫోన్‌చేసే వస్తాను" అన్చెప్పి ఫోన్ పెట్టేసింది.

ఫోన్ నెంబరు ప్రియాంకకి తెలీదనే నిన్న రాత్రంతా ధైర్యపడింది. కానీ, తెలిసిపోయింది. 'ఎప్పుడొస్తానో నాకే తెలీదు. వచ్చేముందు నేను ఫోన్ చేస్తా'నని చెప్పడంతో కొంత శాంతపడింది.

ఆఫీసుకి వెళ్లబోతున్న రాయుణ్ణి పిలిచి "మీరెందుకా నర్సమ్మకి మన ఫోన్ నెంబరిచ్చారు?" అంటూ నిగ్గదీసింది.

రెండు మూడు నిమిషాలు ఆలోచిస్తే తప్ప, తను ఎప్పుడు నర్సమ్మకి నెంబరిచ్చిందీ రాయుడికి గుర్తురాలేదు. నిన్న ప్రియాంక కారులో అందరూ పార్క్‌కి వెళ్లాక కాస్త దూరంగా ఒకడు వేరుశెనక్కాయలు అమ్ముతుంటే, నర్సమ్మని తీసుకురమ్మని చెప్పింది ప్రియాంక. అక్కడే మరో ముసలమ్మ మొక్కజొన్న పొత్తులు నిప్పుల మీద కాల్చి అమ్ముతుంటే, వాటిని కొంటానికి రాయుడు కూడా ఆమెతోపాటే బయల్దేరాడు. దార్లో ఆమెతో ఆ మాటా యీమాటా మాట్లాడుతుండగా, "మీ మేడమ్‌గార్లాంటి మనుషులు మాలాంటి వాళ్లని పిలిచి మాట్లాడ్డం మహాఅదృష్టం" అన్నాడు రాయుడు.

"మా మేడమ్‌గారు చాలా మంచివారు. ఆవిడకి ఎప్పుడైనా ఖాళీగా వున్నప్పుడు మీ ఫోన్‌కి మాట్లాడిస్తాన్లెండి" అనగానే రాయుడు జేబులోనించి ఓ కాగితం తీసి లేండ్ ఫోన్ నెంబరు రాసిచ్చేశాడు.

ఆ విషయమే చెప్పాడు రాయుడు.

"మిమ్మల్నెవడు రాసిమ్మన్నాడు?" అంటూ హూంకరించింది పద్మ.

"అప్పటికి నువ్వింకా గేస్ సిలెండర్ ఓపెన్ చెయ్యలేదు. నేను ముందు చూపున్న మనిషిని కాబట్టే, మన లేండ్ ఫోన్ నెంబరే యిచ్చాను గానీ, నీ సెల్ ఫోన్ నెంబరుగానీ, నా సెల్‌ఫోన్ నెంబర్ గానీ యివ్వలేదు" అన్నాడు.



## పింగళివారి చతురోక్తులు



అప్పట్లో పింగళి లక్ష్మీకాంతం, కాటూరి వేంకటేశ్వరరావులు కూడా జంటకవులుగా తెలుగునాట ప్రసిద్ధులయ్యారు. వివిధ సందర్భాల్లో పింగళివారు పేల్చిన చతురోక్తులు కొన్ని..

### సంస్కృతానికి వచ్చే నష్టమేంటి?

విజయవాడ ఆకాశవాణిలో పింగళి లక్ష్మీకాంతం సాహిత్య సలహాదారు పదవిలో చేరారు. కొత్తగా విజయవాడకు బదిలీమీద వచ్చిన స్టేషన్ డైరెక్టరుకి, అక్కడ్నుంచి వెళ్లిపోతున్న పాత డైరెక్టరు పింగళివారిని పరిచయం చేస్తూ ఆయన నిర్వహించే సంస్కృత కార్యక్రమాలను వివరంగా చెప్పారు. ఆ కొత్తాయన పింగళివారితో 'నేను సంస్కృతానికి బద్ధవిరోధిని' అన్నారు. దానికి పింగళివారు సమాధానంగా వెంటనే, 'అంతమాత్రాన సంస్కృతానికి వచ్చిన నష్టమేమీ లేదు' అని చురక అంటించారు.

కొండమ్మ జోక్యం చేసుకుని "ఇప్పుడేం కొంపలు మునిగిపోలేదులే పద్మా! నిన్ననేమో మీ ఆయన రీజినల్ మేనేజరని చెప్పావు. మనకి కారు వుందని చెప్పావు. ఇవాళావిడ ఫోన్‌చేస్తే, నువ్వు పొద్దుట్నించి రాత్రిదాకా బిజీ బిజీగా వుంటావని, నీ కోసం కొంతమంది గెజిటెడ్ ఆఫీసర్లు వెయిటింగ్‌లో వున్నారని చెప్పేశావు గదా! 'ఉష్ణం ఉష్ణేన శీతలం' అని ఆయుర్వేద వైద్యులు చెప్తుంటారు. అలాగే, నువ్వు కూడా నిన్న కొట్టిన గేస్‌కి విరుగుడు మందుగా మరో గేస్ యిప్పుడు కొట్టావు. ఖాళీగా వున్నప్పుడు నువ్వే ఫోన్ చేస్తానన్నావు కాబట్టి.. బహుశా మళ్లీ ఫోన్‌చేసి, నువ్వు మా యింటికి ఎప్పుడొస్తున్నావని అడక్కపోవచ్చులే" అని చెప్పింది.

ఆవిడ చెప్పిందాంట్లో కాస్త సెటైర్ వున్నా, ఆ మాటల్లో నిజం వున్నట్టనిపించింది. ఈ భావన కేవలం రాయుడిదే!

"అది కాదు వదినా, నువ్వు ఫోన్ చెయ్యడం కావాలనే లేట్ చేస్తే, ఆవిడ డైరక్ట్‌గా మనింటికి వచ్చేస్తుందేమో? " సందేహం వెలిబుచ్చింది కాంచన.

"ఎలా వస్తుంది? నేను అడ్రసివ్వలేదుగా" అంటూ నవ్వాడు రాయుడు.

"నువ్వు ఎమ్‌కామ్ ఎలా పేసయ్యావు? టెలీఫోన్‌డైరక్టరీ వెరిఫైచేస్తే, ఫోన్ నెంబర్ దగ్గర నీ పేరూ, అడ్రస్ వుంటాయిగా"

"ఉంటాయనుకో.. కానీ, అంత పెద్దస్టేటస్‌లో వున్నావిడ మన డొక్కు యింటిని వెదుక్కుంటూ వస్తుందా? నెవ్వర్" అన్నాడు రాయుడు.

ఈ మాటకు స్పందించింది కాంచన కాదు.. పద్మావతి! "ఎందుకురాదు? వస్తుందండి. మీరు చెప్పినట్టుగా, అది స్వతహాగా స్టేటస్ వున్న మనిషయితే, యిలాంటి డొక్కు యింటికి రాదు. కానీ, అది నడమంత్రపు సిరి అబ్బిన లేబర్ మనిషికదా! చవకబారు బుద్ధులన్నీ దాని పుట్టుకతోనే వస్తాయి. నేను చెప్పినవన్నీ నిజమో, లేక డబ్బా కబుర్లో తెలుసుకోడానికైనా వస్తుంది"

ప్రియాంక ఆ యింటికి వస్తుందా? అనే సందేహానికి సమాధానం తేల్చకుండానే కాంచన కాలేజీకి వెళ్లిపోయింది.

ఆఫీసుకి వెళ్లబోతున్న రాయుడితో మాత్రం "మీ ప్రమోషన్ ఎప్పుడొస్తుంది? ప్రమోషన్ కోసం మీతో మరెవడో బాబూరావుగాడు పోటీపడుతున్నాడని మీరు రెండు మూడుసార్లు చెప్పారు. వాడి సంగతేంటి? " అని పద్మ అడిగింది.

"ఆ బాబూరావుగాడు నన్ను ఓవర్‌టేక్ చేసి ముందుకు పోదామనుకుంటున్న మాట నిజమే! కానీ, వాడు నాకంటే ఓ నెల జూనియర్! పైగా ప్రస్తుతం ఆఫీస్ సూపర్నెంట్‌గా వుంటున్నది నేను! సూపర్నెంటుగా వున్నవాడే బ్రాంచ్ మేనేజర్ అవడం ఇక్ష్వాకుల కాలం నించీ వస్తున్న ఆచారం! మా జనరల్ మేనేజర్ సుందరావు కాస్త మూడీ మనిషి. అంచేత ప్రమోషన్ యివ్వడం లేట్ చేస్తున్నాడు. కంగారుపడకు. ఎప్పటికైనా ప్రమోషన్ నాకే వస్తుంది" అని గట్టిగా చెప్పి ఆఫీసుకి వెళ్లిపోయాడు.

★ ★ ★

రాయుడు వాణి అండ్ వీణ కంపెని ప్రైవేట్ లిమిటెడ్‌లో ఆఫీస్ సూపర్నెంటుగా పనిచేస్తూ ప్రమోషన్ పొందడానికి సిద్ధంగా వున్నాడు. ఆయనకి ప్రమోషన్ వస్తే సంతోషించే వారిలో ఆయన తల్లి, చెల్లి, పెళ్లాంతో పాటు మరో రెండు ముఖ్యమైన శాల్తీలున్నాయి. ఒకరు... ఆఫీస్ అటెండర్ యాదగిరి! రెండు... రాయుడి ఇంటి ఓనర్ సీతారామ్! రాయుడికి ప్రమోషన్ వచ్చాక ఆ బ్రాంచ్‌లో ఉంచరు. మరో ఊరికి ట్రాన్స్‌ఫర్ చేస్తారు. గుంటూరు బ్రాంచ్‌లోనే మేనేజర్ పోస్ట్ ఖాళీగా ఉంది. కాబట్టి అక్కడికే చేస్తారు. ఆ వూరికి బదిలీ చెయ్యడమంటే కల్పవృక్షం దగ్గరికి కారులో పంపించడమే! జీతం మిగతా బ్రాంచ్ మేనేజరుల్లాగే వచ్చినా... సైడ్ ఇన్‌కమ్ మాత్రం అన్ని బ్రాంచ్‌లకంటే అక్కడ ఎక్కువ వస్తుంది. దోచుకున్నవాడికి, దోచుకున్నంత ఈ విషయం యాదగిరికి తెలుసు. ఈ మధ్య ఏసీబీవాళ్లు, టీవీవాళ్లు ఎందరిమీదో నిఘా వేసి పట్టుకున్నా.. వాళ్లంతా గవర్నమెంట్ ఆఫీస్ వుద్యోగులే! ప్రయివేట్ కంపెనీల జోలికి వెళ్లడం లేదు. ఈ అదనపు సదుపాయం గురించి కూడా యాదగిరికి తెలుసు. అందుకే రాయుడు బదిలీమీద వెళ్లిపోయేటప్పుడు తనని కూడా ఆ

# దృక్పథంలో తేడా!




న్యూజెర్సీ రాష్ట్రంలోని ఓ స్కూల్‌లో చదివే కెన్నెత్ ఫుట్‌బాల్ స్టార్. అతని ఆటని ఆ రాష్ట్ర ప్రజలంతా ఎంతో అభిమానంతో చూసే వారు. అంతేగాక అతను బాక్సర్, మంచి వేట గాడు. ఓసారి బాక్సింగ్‌లో దెబ్బ అతని మెడ కింద తగలడంతో ఛాతీ కింద భాగం మొత్తం పక్షవాతానికి గురైంది. అతను నడవలేక, వీల్‌చేర్‌కే పరిమితం అయ్యాడు. తనకి ఇష్టమైన క్రీడలని ఇక ఆడలేనని తెలిసి, ఇద్దరు మిత్రుల సహకారంతో వీల్‌చేర్‌లో చెట్లు బాగా ఉన్న ఓ ప్రాంతానికి వెళ్ళాడు. అతని మిత్రులు అతనికి ఇచ్చిన ట్వెల్వ్‌గేజ్ షాట్‌గన్‌తో తనను తాను కాల్చుకుని ఆత్మహత్య చేసుకున్నాడు.



న్యూజెర్సీలోనే దాదాపు అదే వయసుగల పందొమ్మిదేళ్ళ జిమ్ కూడా విద్యార్థే. ఓ ప్రమాదంలో అతనికి దెబ్బ తగలడంతో ఛాతీ కింది భాగానికి పక్షవాతం వచ్చింది. వీల్‌చేర్‌కే పరిమితమైన జిమ్ తన భోజనాన్ని తనే వండుకుంటూ, తన దుస్తులని ఉతుక్కుంటూ, ఇంటిని శుభ్రం చేసుకుంటూ ఒంటరిగానే జీవిస్తున్నాడు. అతనికోసం ప్రత్యేకంగా తయారు చేసిన కారుని డ్రైవ్ చేస్తాడు. వీల్‌చేర్ స్పోర్ట్స్ మీద జిమ్ మొదటి పుస్తకం రాయడమే కాక, అందులో ప్రచురించబడ్డ ఫోటోలను తనే తీశాడు. తనకి పక్షవాతం వచ్చిన ముప్ఫై ఏళ్ళ తర్వాత విమానం లోంచి పేరాచూట్ కట్టుకొని దూకాడు! కెన్నెత్‌కి, జిమ్‌కి ఒకే రకం సమస్య ఎదురైనా, వారి దృక్పథాలు వేర్వేరు. వారి స్పందనా వేరుగా ఉంది. కష్టాల్లో ఉన్నవారు ఈ రెండు సంఘటనల నుండి సరైన గుణపాఠం నేర్చుకోవచ్చు.

---

బ్రాంచ్‌కి తీసుకుపొమ్మన్నాడు.

అతనెందుకు తీసుకువెళ్లమంటున్నాడో రాయుడికి తెలిసినా, ఓసారి యాదగిరిచేతే చెప్పించాలన్న కుతూహలంతో "నిన్నెందుకు తీసుకువెళ్లాలి? " అని అడిగాడు.

యాదగిరి ఆ ప్రశ్నకి సమాధానంగా పురాణఘట్టాల్ని రిఫర్ చేశాడు.

"శ్రీమహావిష్ణువు- గజేంద్రుణ్ణి బాధిస్తున్న మొసలిని చంపడానికి వెళ్లినపుడు లక్ష్మీదేవికి చెప్పలేదు. గరుత్మంతుణ్ణి పిలవలేదు. అద్దం ముందు నిలబడి తన డెకరేషన్ ఎలా వుందో కూడా చూస్కోకుండా, ఒక్కడే వెళ్లిపోయి సుదర్శనచక్రంతో మొసలిగారి చీటీ చింపేశాడు. కానీ భూలోకంలో రావణాసురుణ్ణి, కుంభకరుణ్ణి ఇంకా ఆ సైజ్ మెగా రాక్షసవిలన్స్‌ని చంపడానికి ఏకంగా రామావతారమే ఎత్తవలసి వచ్చింది. అప్పుడు అతనొక్కడు సింగిల్‌గా పుట్టెయ్యకుండా, తను డైలీ పడుకునే ఆదిశేషుణ్ణి లక్ష్మణుడిగా పుట్టమన్నాడు. మిగతా ఆయుధాల్ని భరత శతృఘ్నులుగా పుట్టమన్నాడు. అంటే, ఇక్కడ జరిగే భారీ ఫైటింగ్ సీనుల్లో లక్ష్మణుడి కేరెక్టర్ దాదాపుగా సెకండ్ హీరో కేరక్టర్‌లాగే ఫైటింగ్ చెయ్యాలి కాబట్టి లక్ష్మణుణ్ణి అడవిక్కూడా తీసుకువెళ్లాడు. అంచేతే... గుంటూరులో వచ్చే పక్క రాబళ్లుని శ్రద్ధగా దండుకోవాలంటే నాలాంటి మరో యాదగిరి లక్ష్మణస్వామి ఉండాలి. అక్కడ మీరు మేనేజరుగా లక్షల్లో కొరుక్కుతింటే, అటెండరుగా నేను వేలల్లోనైనా గిల్లుకు తినొచ్చు. నిజాయితీగా ఉద్యోగం చెయ్యడానికి మీడియేటర్ అక్కర్లేదు. కానీ కల్తీ మనిషిగా లంచాలు తీస్కోడానికి మాత్రం ఓ మధ్యవర్తి వుండాలి. ఆ వ్యక్తి కూడా మీ సొంత మనిషి అయ్యుంటే మంచిది కదాని, ఆ

ఛాన్స్ నాకిచ్చెయ్యముంటున్నాను"

అతను చెప్పిన లాజిక్ బాగుంది కాబట్టి, అతన్ని తీసుకెళ్లడానికే అంగీకరించాడు. అందుకే యాదగిరి ప్రమోషన్ విషయంలో రాయుడికి సలహాలిస్తున్నాడు.

ముందునించీ వున్న సైకిల్ కంటే వెనకొచ్చిన మోటర్‌సైకిల్‌కే స్పీడ్ ఎక్కువనేమాట బాబూరావుకి అక్షరాలా వర్తిస్తుంది. ఆఫీసులో రాయుడికంటే కాస్త లేట్‌గా జాయిన్ అయినా, అతనికంటే ముందు పరుగెత్తి, మేనేజరు సీట్లో కూర్చుండిపోవాలన్నదే తన డ్రీమ్ ప్రాజెక్ట్‌గా పెట్టుకున్న వ్యక్తి బాబూరావు. అతనికి రష్యా అధ్యక్షుడి పేరు సరిగా తెలీకపోవచ్చు. క్రికెట్ గేమ్‌లో వినబడే చాలా పేర్లకి అర్థం తెలీకపోవచ్చు. కానీ అతనికో విషయం స్పష్టంగా తెలుసు. మానవజీవితంలో ఎన్ని వున్నా.. అతనికి లౌక్యం లేనిదే సౌఖ్యం లేదనే మహత్తరమయిన సత్యం తెలుసు. తను ఆఫీసులో జూనియర్ అవుగాక, కానీ రాయుడికంటే ముందు తనకే ముందుగా ప్రమోషన్ వస్తుందంటూ బాహాటంగా అందరికీ చెప్పుకు తిరుగుతున్నాడు. ప్రమోషన్ కోసం అతను కాలినడకన తిరపతికొండకి వస్తానని, వెంకటేశ్వరుడికి మొక్కుకోలేదు. ఏ మంత్రిగారి చేతా సిఫార్స్ చేయించలేదు. కానీ, తెలివిగానే పనిచేశాడు.

దేవుడికో దండం, దెయ్యానికో పిండం పడేస్తే లాభమే తప్ప నష్టం వుండదని తెలుసుకున్నాడు. దాంతోపాటు... పాలు కావాలనుకున్నప్పుడు ఆవు పొదుగు పట్టుకోవాలి తప్ప ఎద్దుకొమ్ము పట్టుకోవడం వల్ల ఎలాంటి లాభం వుండదని కూడా గ్రహించాడు. ఆఫీసులోని ఉద్యోగులకి ప్రమోషన్ ఇచ్చేది స్వర్గంలో వుండే దేవుడే కాదు.. చాంబర్‌లో ఉండే జనరల్ మేనేజర్ సుందర్రావని తెలుసుకొన్నవాడై అతని విషయంలో ఓ ముఖ్యమైన పనిచేశాడు. జియ్యమ్‌గా పిలువబడే జనరల్ మేనేజర్ సుందర్రావుకి అప్పుడప్పుడు కవితలు రాసే అలవాటుంది. దాంతోపాటు వాటిని స్టాఫ్‌కి వినిపించి వారివల్ల మెప్పు పొందాలనే బలహీనత ఉంది. అదిగో, ఆ బలహీనతనే బాబూరావు భూతద్దంలో పెట్టిచూసి, రోజుకి మూడు పూటలా క్రమం తప్పకుండా, అతని గేయాల్ని పాడుతూ కాకా పడుతున్నాడు. కాకా అనగా బాకా. బాకా అనగా భజన. భజనలకి భగవంతుడే లొంగిపోతున్నాడు. కాబట్టి, జియ్యమ్‌గారు లొంగడంలో ఎట్టి ఆశ్చర్యం లేదని నిరూపిస్తున్నాడు. దేవతలందరికి హెడ్డాఫ్‌ది డిపార్ట్‌మెంట్టైన దేవేంద్రుడికి శాశ్వతంగా ఆ పదవిలోనే కొనసాగాలనే తపన వుండేదిట. అయితే భూలోకంలో ఎవరైనా భారీ ఎత్తున తపస్సు చేస్తే ఆ మెగా మునీశ్వరుడికి ఇంద్రపదవి ఇవ్వాలనే రూలొకటి వుందట. అంచేత ఎవరైనా ముని గట్టిగా తపస్సు చేస్తే, దాన్ని భగ్నం చెయ్యడానికి మేగ్జిమమ్ ట్రై చేస్తాడు. విశ్వామిత్రుడు భూమ్యాకాశాలు దద్దరిల్లేలా తపస్సు చేస్తుంటే ఆ తపస్సు భగ్నం చెయ్యడానికి, కుబేరుడి దగ్గరున్న డబ్బంతా మూటకట్టి విశ్వామిత్రుడికిచ్చి, దాన్ని స్విస్ బ్యాంక్‌లో దాచుకోమని చెప్పలేదు. మేనక అనే స్టాఫ్ డాన్సర్‌ని పంపించి, ఓ డిస్కోడ్యాన్స్ ఆడించేసరికి అంతటి విశ్వామిత్రుడు కూడా సన్యాసం వదిలేసి సంసారంలో దిగిపోయి, తన తపస్సుని తనే భగ్నం చేసేసుకున్నాడు.

ఈ కథని బాబూరావు చాలా పౌరాణిక సినిమాల్లో చూశాడు. విశ్వామిత్రుడు మగువకి లొంగినంతగా మనీకి లొంగడన్న పాయింటు అండర్‌లైన్ చేస్కుని, ఇంద్రుడు మేనకని పంపించి సక్సెసయ్యాడు. విశ్వామిత్రుడు మేనకకి ఇష్ట

పడినంత స్ట్రాంగ్‌గా, జియ్యమ్‌గారు పొగడ్త లకి ఇష్టపడతారని గ్రహించి, అదే దార్లో ప్రయాణిస్తున్నాడు బాబూరావు. ప్రమో షన్ విషయంలో అతనికున్న ప్లస్ పా యింటు ఇదే! ఇదే విషయంలో రాయుడికి ఓ మైనస్ పాయింటు వుంది. అదేం టంటే.. "సత్యమునే పలుకవలెను, సీని యార్టీ వల్లే ప్రమోషన్లు వచ్చును" లాంటి వేదకాలంనాటి సూక్తుల్ని పట్టుకుని వేళ్లాడ్డం!

గత కొన్నాళ్లుగా ఆ కంపెనీకి సంబంధిం చిన గోడౌన్‌లో తరచుగా దొంగతనాలు జరుగుతున్నాయి. అలాగే తాజాగా ఓ దొంగతనం జరిగింది. ఆ గోడౌన్ వ్యవహా రాలు చూసేది రాయుడు పనిచేసే సెక్షనే! దొంగతనం జరిగినప్పుడల్లా జియ్యమ్ వెళ్లి ,పోయిన సామాన్లకి ఖరీదుకట్టి, తన హయాంలో ఇంత ఖరీదైన సామాన్లు పోయాయి అంటూ లబోదిబోమని ఏడ్చే వాడు. అయినా, ఆ సామాన్లు తిరిగి దొరకేవి కాదు. ఇప్పుడు కూడా అలో పాలోమని ఏడ్చినా సామాన్లు దొరకలేదు. పోలీసులు మాత్రం ఆ సామాన్లు ఎప్పటి కైనా దొరుకుతాయని హామీ ఇచ్చారు గానీ, ఆ దొంగ మాత్రం దొరకలేదు. జియ్యమ్ ఆ వ్యవహారాల్లో తలమునకలై వుండడం వల్ల.. రాయుడికివ్వాల్సిన ప్రమో షన్ గురించి ఆలోచించడం లేదు.

మొదట చెప్పింది రాయుడి గృహాలయ పరిస్థితి కాగా.. ఇప్పుడు చెప్పింది కార్యా లయ పరిస్థితి!

★ ★ ★

రాయుడి ఇంట్లో ఆ ఉదయం లాండ్‌ఫోన్ మోగింది. ఈసారీ పద్మావతే ఫోన్ ఎత్తింది. ఈసారి కూడా అవత ల్నించి ప్రియాంకే మాట్లాడుతోంది. 'ఎందుకు ఫోన్ చేశావ్?' అని చిరాకు పడే లోగా.. ప్రియాంక ఓ బాంబ్ పేల్చింది.

"నేనే మీ ఇంటికొచ్చేస్తున్నాను"

ఇదీ ఆ బాంబ్! ఆ బాంబ్ సౌండ్ విన గానే పద్మావతి గుండె రెండు క్షణాల పాటు ఆగి, మళ్లీ కొట్టుకోవటం ఆరంభిం చింది. "ఎందుకొస్తున్నావ్?" అని అడి గేసి, వెంటనే మాట మార్చి "ఎప్పుడొస్తు న్నావు?" అని అడిగింది.

"ఎప్పుడొస్తున్నావని కాదు.. ఎందుకొస్తు న్నావనే అడగండి. మా ఆయన తరపు బంధువొకావిడ మీ ఇల్లున్న ఏరియాలో ఓ పెద్ద సైట్ కొంటున్నారట. దాన్ని చూడ్డా నికి వాళ్లతోపాటు నేనూ వస్తున్నాను"

"సరే, ఎప్పుడొస్తున్నావు?"

"ఎప్పుడో నాకే తెలీదండి. ఇంక మీకు నేనేం చెప్తాను? రేపే రావొచ్చు లేదా ఓ వారం తర్వాత రావచ్చు. ఒకవేళ వాళ్లు అమలాపురం నించి ఇప్పుడే వచ్చేస్తే, మరో గంట తర్వాత రావచ్చు. ఎప్పుడొచ్చినా ఒక్కటి మాత్రం నిజం"

"ఏంటి?"

"నా రాక మీ కోసమే"

ఆ మాటతో పద్మావతి మస్తిష్కం స్తంభించడం వలన ఒకదాంతో మరో దా నికి పొంతనలేని రెండు మూడు మాటలు మాట్లాడి ఫోన్ పెట్టేసింది. సౌత్ సెంట్రల్ రైల్వేలో నడిచే రైళ్లన్నీ పద్మావతి గుండెల్లోనే పరుగెడుతున్నట్టుగా బాధ

---

## కొత్తగాలి...

**రైతుల కష్టాలన్నీ**
**ఆఫీసులో పవర్ పాయింట్**
**తీగలకు కరెంటు లేదన్నదే**
**అసలు సిసలైన పాయింట్**

*– మాడ రిత్విక్ భరద్వాజ, సికింద్రాబాద్*

పడిపోయింది. ఆ రోజు పార్క్‌లో ప్రియాంక ఎదురుపడి తన వాస్తవ జీవితం గురించి చెప్పింది. నిజానికి ఆ రోజు ప్రియాంక తన జీవితం ఏ స్థాయిలో వుందని చెప్పిందో.. ఆ స్థాయి జీవితాన్నే తను అనుభవించాలనుకుంది. ఆ జీవితం లభిస్తుందని నమ్మింది. కానీ, మన నమ్మకాలు వేరు.. వాస్తవాలు వేరు! ఆ రోజుతో 'ప్రియాంక' అనే ఓ పీడకల కరిగిపోతుందనుకుని, తన భర్త రీజినల్ మేనేజరని, తనకో కారు వుందని చెప్పేసింది. అంతటితో ఆగకుండా, తనకి సోషల్ సర్వీస్ ఎక్కువని, అనేకమంది సెలబ్రిటీలు, వి.ఐ.పీ.లు తనింటికి వస్తుంటారని ఫోన్‌లో చెప్పేసింది. ఇప్పుడు ప్రియాంక ఇక్కడికొస్తే ఏం దర్శనమిస్తుంది? ఓ సాదాసీదా పాతకాలపు మధ్య తరగతి ఇల్లు, ఇలాంటి కొంపల్లో కాస్తో కూస్తో ఇతర ఆదాయాలున్న క్లాస్‌ఫోర్ ఎంప్లాయీస్ కూడా వుండడం లేదు. అలాంటిది ఓ కంపెనీ రీజినల్ మేనేజర్ వుండడని ఎవరికైనా తెలిసిపోతుంది. ఇంటిముందు కారు కాదుగదా.. ఓ హోండా బైక్ కూడా లేదు. ఎప్పుడో పెళ్లికి ముందు కొన్న స్కూటర్ కనిపిస్తుంది. దాంతో, తను పార్క్‌లో చెప్పినవన్నీ డబ్బా కబుర్లేనని తెలిసిపోయి ఆమె తనమీద జాలి పడుతుంది!

తను భరించలేనిది.. ఆ ఒక్కటే!

ఈ ఆలోచనల్లో వుండగానే సాయంకాలమయింది. ఆఫీసు నించి రాయుడు, కాలేజీ నించి కాంచన వచ్చారు. వారికి లేటెస్ట్‌గా ఏర్పడిన సమస్య గురించి చెప్పింది.

చెప్పిందంతా విని రాయుడు "ఇప్పుడెలా?" అని అడిగాడు.

పద్మావతికి చిర్రెత్తుకొచ్చి "నేనింతసేపూ మొత్తుకున్నదంతా విని, 'యిప్పుడెలాగా' అని అడగడానికి చెప్పలేదు. మీరు అప్పుడప్పుడైనా బుర్ర ఉపయోగించండి" అంది.

ఓ రెండు నిమిషాలపాటు రాయుడు ఆలోచించి "అసలారోజు నేను చెప్పినట్టుగా దుర్గ గుడినించి ఇంటికొచ్చేసుంటే, ఆ ప్రియాంక కలిసే వుండేది కాదు" అన్నాడు.

వంటగది గుమ్మం దగ్గర కూర్చున్న కొండమ్మ ఆ మాటలు వింటూ అక్కడకొచ్చింది. "సర్లేరా మీకా ప్రియాంక కలిసింది. అప్పుడు కుశల ప్రశ్నలు అడగడం మానేసి, అడ్డంగా కోతలు కొయ్యకుండా వుండుంటే, మీరు చెప్పిన అబద్ధాలు మీ గొంతుకి ఉచ్చు బిగించేవి కావుగా"

పద్మావతికి ఓ గంటన్నర లెక్చర్ యిచ్చి, ఆ తల్లీకొడుకుల నోళ్లు మూయించాలనే వుంది. కానీ, ఆ పని చెయ్యకుండా "ఇల్లు అంటుకున్నాక ముందు ఆర్పడానికి ట్రై చెయ్యాలి గానీ, ఎలా అంటుకుందో కనుక్కోడానికి కమిటీ వెయ్యడం కాదు కావల్సింది" అనేసి వూరుకుంది.

కాంచన ఇప్పుడు తనకొచ్చిన ఐడియా చెప్పింది. "వదినా! నువ్వు చెప్పినవి మూడు సమస్యలు. అందులో రెండింటికి పరిష్కారం దొరికింది నాకు. వాటిని చెప్తాను. బాగుంటే టిక్కు పెట్టు, బాగులేకపోతే మాత్రం తిట్టకు"

"తిట్టడం ఎందుకులే.. చెప్పు" అంది పద్మ ఆసక్తిగా.

"మా అన్నయ్య ఆల్‌రెడీ రీజినల్ మేనేజరుగా పనిచేస్తున్నాడని ఆ ప్రియాంకతో చెప్పేవు సరే.. ఇప్పటికప్పుడు మనింటి తలుపుకి సుబ్బారాయుడు, రీజినల్ మేనేజర్, వాణి అండ్ వీణ కంపెనీ అనే బోర్డ్ కట్టేశాం అనుకో.. ఆవిడొచ్చి ఆ బోర్డు చూస్తుందే తప్ప, ఆఫీసుకెళ్లి ఎంక్వయిరీ చెయ్యదు కదా"

పద్మావతి శూన్యంలోకి చూస్తూ.. "ఈ ఐడియా బాగానే వుంది. కానీ, నమ్ముతుం

# స్విస్ వాచీ పరిశ్రమ దివాళా?




ఓ యాభై ఏళ్ల క్రితం ప్రపంచంలో గడియారాలు కొనే ధనవంతులు స్విస్ వాచీలను కొనడానికే ఉత్సాహం చూపించేవారు. కారణం ఆ కాలంలో నాణ్యమైన వాచీలు స్విడ్జర్లాండ్ లో మాత్రమే తయారయ్యేవి. 1850నుంచే స్విడ్జర్లాండ్ ఆ పరిశ్రమకు పెట్టింది పేరు. 1968లో ప్రపంచ గడియారాల మార్కెట్ లో ఆ దేశం వాటా 65శాతం అలాగే వారి లాభార్జన 80శాతం ఉండేది. కాని 1978 వచ్చే సరికి వాచీల అమ్మకాల్లో ఆ దేశం వాటా 10శాతం కన్నా తక్కువకి పడిపోయింది. 1981 నాటికి ఆ దేశంలోని అరవైఐదు వేలమంది గడియారాల పరిశ్రమల కార్మికులకు పనిలేకుండా పోయింది.



1968లో జపాన్‌లో అసలు వాచీల తయారీనే లేదు. కాని స్విస్ వ్యాపారాన్ని అకస్మాత్తుగా జపాన్ కైవసం చేసుకుంది. వాచీలోని క్వార్ట్జ్ మూమెంట్ ని స్విస్‌కి చెందినవారే కనిపెట్టారు. స్విస్ రిసెర్చర్స్ 1967లో క్వార్ట్జ్ వాచ్‌ని ఆదేశపు వాచ్ తయారీదారులకి ప్రదర్శించారు. బేటరీతో నడిచే వాటికి స్విస్ వాచీలకు మాదిరిగా నిత్యం కీ ఇవ్వక్కర్లేదు. బేటరీ ఎక్స్‌పైరీ అవగానే దాన్ని మార్చుకుంటేచాలు. ఐతే దానికి గల భవిష్యత్‌ని స్విస్ వాచీ ఉత్పత్తిదార్లు తప్పుగా అంచనా వేశారు. దాన్ని వారు తిరస్కరించారు. దానికి నిజంగా భవిష్యత్ లేదని భావించిన పరిశోధకులు సైతం తమ క్వార్ట్జ్ వాచ్‌కి పేటెంట్ హక్కుని కూడా తీసుకోలేదు.

అంతర్జాతీయ సదస్సులో వారు దాన్ని ఓసారి ప్రదర్శిస్తే జపాన్‌కి చెందిన సీకో అనే కంపెనీ, టెక్సాస్ ఇన్‌స్ట్రుమెంట్స్ అనే అమెరికన్ కంపెనీ ఆసక్తి చూపించాయి. సీకో కంపెనీ త్వరలోనే బేటరీతో నడిచే వాచీలు తయారు చేసింది. అవి స్విస్ వాచీలకన్నా చవక. పైగా రోజూ కీ ఇవ్వక్కర్లేదు. దాంతో ప్రపంచ ప్రజలు సీకో వాచీలనే కొనసాగారు. దీనివల్ల రోజూ కీ ఇచ్చే స్విస్ వాచీలకు డిమాండ్ తగ్గింది. చాలా మంది స్విస్‌వాచీ పరిశ్రమకు చెందినవాళ్లు తమది ఓపెన్‌మైండ్ అని చెప్పుకునేవారు. నిజానికి వారు చెప్పేదానికి వ్యతిరేకంగా మసలుకోవడం వల్లే దివాళా తీశారు.

దంటావా? " అని అడిగింది.

"నమ్మదనే డౌట్ వుంటే ఒకలా చేద్దాం. మన ఇంటికి యీ పక్కనున్న రెండిళ్లకి, ఆ పక్కనున్న రెండిళ్లకి మనం వెళ్లి ఒక్కొక్కరికి పావుకేజీ స్వీట్స్ పేకెట్టిచ్చి, మా అన్నయ్యకి రీజినల్ మేనేజర్‌గా ప్రమోషన్ వచ్చి రెండేళ్లు పూర్తయిన సందర్భంగా, మీకీ స్వీట్స్ ఇస్తున్నాం అన్చెప్దాం. ఒకవేళ ఆ ప్రియాంక వచ్చి, మన ఇరుగు పొరుగు వాళ్లని ఎంక్వయిరీ చేసినా, వాళ్లు చెప్పిన మాటల్లో నువ్వు కొట్టిన గేస్‌కి రెండు సంవత్సరాల సీనియార్టీ కూడా కనబడుతుంది"

ఈ ఐడియా పద్మకి నచ్చింది. ఈ విపత్తులో కాంచన తనకంటే మించిన గేస్ మాస్టర్ కాగలదనే నమ్మకం పద్మకి ఏర్పడింది. వెంటనే పద్మకి మరో సందేహం వచ్చింది. "మనవెందుకు స్టేటస్‌కి తగ్గ ఇంట్లో వుండకుండా, యీ డొక్కు ఇంట్లో వుంటున్నాం? " ఇదీ ఆ సందేహం.

కాంచన దగ్గర ఈ సందేహానికీ సమాధానం సిద్ధంగా వుంది.

"మనం మధురవాడలో ఓ ఎకరం స్థలంలో, ఓ పెద్ద బంగళా కడుతున్నాం. ఆదింకా పూర్తి కాలేదు. అయ్యేవరకు టెంపరరీగా.. జస్ట్ టెంపరరీగానే యీ ఇంట్లో

వుంటున్నాం అని చెప్తాం. జనరల్ బోగీలో ప్రయాణం చేసేవాడే కాదు, ఫస్ట్ ఏసీలో వెళ్లే పాసింజర్ కూడా ట్రైన్ వచ్చే వరకు ప్లాట్‌ఫారమ్‌మీద వెయిట్ చేస్తుంటాడు కదా! మనం కూడా అంతే"

"ఒకవేళ ఆ బిల్డింగ్ చూపించమంటే? "

"చూపిస్తాం. మా ఫ్రెండ్ సులోచన ఫాదర్ మధురవాడలో ఓ బిల్డింగ్ కట్టిస్తున్నాడ్లే. ఆ ఇల్లే మనదని చూపించేస్తాం"

ఈ ఐడియా కూడా పద్మకి నచ్చింది. కొండమ్మకి మాత్రం ఆ చర్చా కార్యక్రమం చిరాకు కలిగించింది. "బుఱ్ఱ విలువ నోరు చెప్పేస్తుందంటారు. లేని గొప్పల కోసం కోతలు కొయ్యడమెందుకు? దాన్ని కప్పిపుచ్చడానికి కోతమీద కోత కోసుకుంటూ వెళ్లడమెందుకు? " అంటూ సణిగినా, ఆ సణుగుడు పద్మ వరకూ రాలేదు.

ఇప్పుడు సందేహం నెంబర్ త్రీ.. కారు!

"కొనేద్దాం" అని పద్మ చాలా చిన్న విషయంలా చెప్పింది.

"ఎందుకూ కారు? " అంటూ కొండమ్మ అడిగింది.

"ఎవరైనా కారు ఎందుకు కొంటారు? తిరగడానికి. మనమూ అందుకే కొంటాం" పద్మ పెడసరంగా జవాబు చెప్పింది.

"మనకిప్పుడు కారు అవసరం వుందా? "

"నా చిన్నప్పుడే కారుల్లో తిరిగాను" అంది పద్మ గర్వంగా.

"ఎలాంటి దురదయినా జాలిమ్‌లోషన్‌తో వదిలిపోద్దంటారు. కానీ, గొప్ప కోసం డప్పు వేసుకునే దురద వుందే.. అది మాత్రం ఏ మందులకీ లొంగదట. నెలాఖర్లో ఆటోల్లో తిరగడానికి ఠికాణా లేక.. సీజన్ టిక్కెట్ మీద సిటీ బస్సులో తిరిగే మనకి, కారు.. విమానాలూ వున్నాయంటే ఎవరు నమ్ముతారు? అందులోనూ, నిజంగా విమానాల్లో తిరిగేవాళ్లెందుకు నమ్ముతారు? నిన్న గొప్పగా బతికేం, రేపు గొప్పగా బతుకుతామనుకుంటే కాదు. నిన్నకీ, రేపుకీ మధ్య యీ రోజు ఒకటి వుందిగా! దాన్ని దృష్టిలో పెట్టుకునే నిర్ణయాలు తీస్కోవాలి. మన ఆదాయాన్ని బట్టే ఖర్చులూ లెక్కేయాలి" కొండమ్మ కాస్త కటువుగానే చెప్పింది.

కొండమ్మ యిలాంటి అభ్యంతరం లేవదీస్తుందని తెలుసు. అలా లెక్కలేసి ఆలోచించడానికి మనవేం కొత్త కారు కొనెయ్యడం లేదు. కండీషన్‌లో వున్న సెకండ్ హ్యాండ్ కారు కొంటాం" అంది పద్మ.

"సెకండ్‌హ్యాండ్ అయితే మాత్రం వందకీ, రెండొందలకీ రాదుగా. అయినా, ఇప్పుడు మనకి కార్లు అవసరమా? "

"రేపు మీ అబ్బాయి మేనేజరయ్యాక అవసరమవుతుంది గదా? "

"వాడు మేనేజరయ్యాక ఓ అరడజను కార్లు, పావు డజను విమానాలు కొనేస్కోండి. నేను వద్దన్ను. ఇప్పుడా కారు కోసం అప్పు చేస్తే సుఖాన వున్న ప్రాణం దుఃఖాన పెట్టుకున్నట్టవుతుంది"

"అప్పు చేయక్కర్లేదు. బ్యాంకిలో నించి తీస్తే చాలు"

"నీ ఎక్కౌంట్లో అంత డబ్బుందా? "

"నా ఎక్కౌంట్లో కాదు.. నీ ఎక్కౌంట్‌లో రెండు లక్షలుందిగా"

కొండమ్మకి పద్మావతి ఐడియా అర్థమై

## కొత్తగాలి...

**కేన్సర్.. ఎయిడ్స్**
**స్వైన్‌ఫ్లూ.. ఎన్నున్నా**
**రేపిడ్ మరణాల్లో**
**'రేబిస్' కే స్టేట్‌ఫస్ట్**

– పినిశెట్టి లక్ష్మీశారద, రాజమండ్రి

పోయి గుండె గుబగుబలాడింది. "ఆ డబ్బుందన్న ధైర్యంతో ఇంతసేపూ ఇన్ని కబుర్లు చెప్పేవా? మాతల్లే! ఆనాడెప్పుడో మా ఆయన యాభైవేలిస్తే అందులోనించి ఓ పావలా కూడా తియ్యకుండా పదిలంగా దాస్తే అదిప్పటికి రెండు లక్షలయింది. దాన్ని కాంచన పెళ్లికి దాచాను" అంది.

"ఇప్పుడు దాని పెళ్లికేం తొందర వచ్చింది? " అంది పద్మ.

"నువ్విప్పుడు కారు కొనాల్సిన అవసరం ఏం వచ్చింది? "

"ప్రిస్టేజ్ క్వశ్చిన్ వచ్చింది"

"మన బతుక్కో ప్రిస్టేజీ.. దానికిప్పుడో కొశ్చిను. ఎవరో ప్రియాంక దగ్గర కోతలు కోసిందట. ఆ కోతల్ని నిజం చెయ్యడానికి ఆడపడుచు పెళ్లికోసం దాచిన డబ్బు తీసి కొనేస్తుందట! ఇంతవరకు మనకో సొంత కొంప తగలల్లేదు. ఓ జానాబెత్తడు జాగా కూడా కొనలేదు. కాంచన పెళ్లి కోసం ఓ వంద రూపాయలు కూడా దాచలేదు. ఇవన్నీ వదిలేసి కారు కొంటాదట.. కారు" కొండమ్మ మాటలన్నీ దులపరించేసి లోప లకి వెళ్లిపోయింది.

పద్మ క్షణం కూడా ఆగకుండా ఇంటి ఓనరు సీతారామ్‌కి ఫోన్‌చేసి వెంటనే ఇక్కడికి రమ్మని చెప్పింది.

సీతారాం చిత్రమైన వ్యక్తి. మాటకారి, చమత్కారి, పిసినారి.. వెరసి బతకనేర్చిన మనిషి! గొడ్డలి లేకుండా చెట్టుని నరకగ లడు. పట్టాలు లేకుండా రైలుని, నీళ్లు లేకుండా పడవనీ నడపగల సమర్థుడు. సెకండ్ హ్యాండ్ కార్లు, ఇళ్లు, స్థలాలు అమ్మిస్తూ ఇరుపక్షాల్నించీ కమీషన్లు తీస్కోవడం ఆయన వృత్తి.

పది నిమిషాల్లో సీతారామ్ వచ్చాడు. రెండు నిమిషాల్లో విషయం అర్థం చేసుకు న్నాడు. 'ఇహ్హిహ్హి..' అంటూ గోళీసోడా కొట్టినట్టు నవ్వి "ఎంతయినా అదృష్టవం తురాలివమ్మా! పొద్దున్నే మా ఫ్రెండు మోహన్‌రావు నన్ను పిలిచి, తనకి అర్జం టుగా డబ్బు అవసరం వచ్చి తన కారు అమ్మేస్తానన్నాడు. మంచి కండీషన్లో వున్న కారు. దాన్ని అతను వాడింది కూడా ఓ ఏడాదే!" అన్నాడు.

"కారు ఎంతలో వుందో? " రాయుడు అడిగాడు.

"ఆ కారు ఒరిజినల్ ఖరీదు నాలుగు న్నర లక్షలు. కానీ, హ్యాండ్ మారేసరికి రేటు పడిపోతుంది గదా! రెండున్నర లక్షలు చెప్పాడు. అయితే అమ్మేవాడు ఎప్పుడు ఎక్కువే చెప్తాడు. కొనేవాడెప్పుడూ తక్కువకే అడుగుతాడు! మీరు ఎలాగూ నా సొంత మనుషుల్లాంటివాళ్లు కాబట్టి లక్షన్నరకి తెగ్గొట్టేస్తాను. కాకపోతే సింగిల్ పేమెంట్లో డబ్బు యిచ్చెయ్యాలి"

ఆ రేటుకి ఒప్పేసుకుని ఆ డబ్బు కూడా అతన్నే అప్పుగా యిప్పించమంది. ఆయన కొంతమంది వడ్డీ వ్యాపారస్థులతో సంబం ధాలు పెట్టుకుని అప్పులు కూడా యిప్పి స్తుంటాడని ఆ దంపతులకి తెలుసు.

"అంత డబ్బు కావాలంటే దానికి రెట్టింపు విలువుండే ప్రాపర్టీ తనఖా పెట్టాలి" అన్నాడు.

రాయుడు వెకిలిగా నవ్వి "అంత ప్రాపర్టీ మా దగ్గరుంటే, మేమెందుకు యీ కొంపలో

> **కొత్తగాలి...**
>
> **దా(దో)చుకున్న వారిని**
> **ఉతికి ఆరేసినప్పుడే**
> **నల్లధనం**
> **తెల్లధనమవుతుంది**
>
> – బిక్కునూరి రాజేశ్వర్, పాస్కల్

అద్దెకుంటాం. తనఖా లేకుండా డబ్బు ఇప్పించండి" అన్నాడు.

"ఇప్పించొచ్చనుకో! కానీ తనఖా లేని అప్పుకి నూటికి నెలకి అయిదు రూపాయలు వడ్డీ తీసుకుంటారు"

"అయిదే కదా పారేద్దాం" అంది పద్మ .

కొండమ్మ అక్కణ్ణించి వెళ్ళిపోయినా చెప్పులు మాత్రం యిక్కడే వదిలెయ్యడం వల్ల గబగబా వచ్చింది. "ఏంటే పారేస్తానూ అంటూ అంత గోరోజనంగా చెప్తున్నావు. నూటికి అయిదు రూపాయల వడ్డీ చొప్పున నెలకి, లక్షన్నరకీ ఎంతవుతుందో ఆలోచించావా? మీ ఆయనకి జీతమెంత? అన్ని మినహాయింపులూ పోనూ చేతికి అందేదెంత? ఆలోచించేవా? "

పద్మావతికి అత్తగారితో ఆర్గ్యుమెంట్ యిష్టం లేదు. తన భర్తకి రావల్సిన ప్రమోషన్ గుమ్మందాకా వచ్చేసింది. మేనేజరు అయ్యాక ఆయనకొచ్చే రాబళ్లు ఏస్థాయిలో వుంటాయో అత్తగారికి తెలీక వాదిస్తోందని ఆవిడ మాటల్ని పెద్దగా పట్టించుకోకుండా సీతారామ్‌కి ఫైనల్‌గా చెప్పేసింది. "అప్పు తీస్కోవడం, కారు కొనెయ్యటం రెండూ రేపే జరిగిపోవాలి" అంది.




**రా**యుడి ఆఫీస్ గోడౌన్‌లో మళ్లీ దొంగతనం జరిగింది. గోడౌన్ చూడ్డానికి ఇనస్పెక్టర్ శంకరయ్య, యిద్దరు కానిస్టేబుల్స్ జీపులో వచ్చారు. జి.యమ్. కూడా వారి దగ్గరకొచ్చి గోడౌన్ అంతా చూపించాడు. ఆ తర్వాత గోడౌన్ బైటకి వచ్చి జియ్యమ్ తన విసుగు, కోపాన్ని వ్యక్తపరుస్తూ మాట్లాడాడు.

"ఏంటి యినస్పెక్టరుగారూ! వారానికో సారి పబ్లిక్ హాలిడే వచ్చినట్టు, ఆ దొంగ రాస్కెల్ వారానికోసారొచ్చి యిక్కడున్న సామాన్లని ప్రశాంతంగా పట్టుకుపోతున్నాడు. దొంగతనం జరిగినప్పుడల్లా మీరు రావడం, మానించి కంప్లైయింట్ తీస్కోవడం, వెళ్లిపోవడమే జరుగుతోంది తప్ప, యింతవరకు మా సామాన్లు రికవర్ చెయ్యలేదు, దొంగల్నీ పట్టుకోలేదు"

ఆ మాటలకి శంకరయ్య ఆవేశంతో చిందులెయ్యలేదు. పళ్లు పటపటమని కొరకలేదు. అతన్లో ఏ రకమయిన స్పందన కనిపించలేదు. పదిమంది మగాళ్లకి సరిపడేటంత మీసాల్ని తనొక్కడే పెంచుకుని, వాటిని కుడిచేత్తో దువ్వుకుంటూ విన్నాడు.

అతను పైఆఫీసర్లతో మాట్లాడేటప్పుడల్లా వారిచేత చీవాట్లు తింటుంటాడు. అలా చెప్పడంకంటే, వాళ్ళు తిట్టాలనుకున్నప్పుడే శంకరయ్యని పిలుస్తుంటారని చెప్తే సమంజసంగా వుంటుంది. శంకరయ్య ఒక్కోసారి పర్సు మర్చిపోయి డ్యూటీకి వచ్చేస్తాడు. అప్పుడప్పుడు కళ్లద్దాలు పెట్టుకోవడం మర్చిపోయి వస్తుంటాడు. కానీ, ఎల్లప్పుడూ తన మెదణ్ణి యింట్లో మర్చిపోయి డ్యూటీ చెయ్యడానికి వచ్చేస్తాడనే విషయం పోలీస్ డిపార్ట్‌మెంట్లో ఎవర్ని అడిగినా చెప్తారు. జియ్యమ్ చెప్పినదంతా విన్నాక శంకరయ్య చిత్రమైన ధోరణిలో జవాబు చెప్పాడు.

"మనదేశంలో పెద్ద డ్రాబేక్ ఏంటంటే ఎవడి తప్పు వాడు ఒప్పుకోవడం లేదండి. దొంగల్ని పట్టుకోలేదని మమ్మల్ని తప్పు పడుతున్నారేగానీ, మేం చెయ్యమన్న పని

మీరు చేశారా? అని నేనడుగుతున్నాను"

జియ్యామ్‌కి అర్థం కాక "మీరేం చెయ్యమని చెప్పారు" అని అడిగాడు.

"దొంగతనం జరగడానికి కనీసం ఒక్క గంట ముందయినా మాకో ఫోన్ కొట్టమన్నాను. కానీ, మీరు కొట్టారా? "

జియ్యామ్ చుర్రుమంటూ చూశాడు. తనకే గనక అధికారం వుంటే, ఆ శంకరయ్య ఒంటిమీద బట్టలూడదీసి చావగొట్టి వుండేవాడు. "గంట ముందు మీకు ఫోన్ కొడితే, మీరొచ్చి ఆ దొంగల్ని అరెస్ట్ చేసేస్తారా? గంట ముందు, ఒకరోజు ముందు చెప్పడానికి మా గోడౌన్‌లో ఏదైనా పెళ్లి జరుగుతోందనుకున్నారా? లేక, ఆ దొంగలు మాకు ముందుగా నోటీసిచ్చి దొంగతనం చేస్తున్నారా? ఏ పోలీసూ యింతవరకు యింత దిక్కుమాలిన క్వశ్చిన్ అడిగుండడు" అన్నాడు జియ్యామ్.

ఆ మాటలకి కూడా శంకరయ్య తన తప్పు ఒప్పుకోకుండా, ఓ పోలీస్ నవ్వొకటి నవ్వేసి "సర్లెండి. ఈసారి ఆ దొంగల్ని పట్టుకునే చిట్కాలు కొన్ని చెప్తాను. ముందు మీ గోడౌన్‌లో పనిచేస్తున్న స్టాఫ్‌ని వర్సగా నిలబెట్టి, వాళ్ళలో ఆ దొంగ వున్నాడేమో తేల్చేస్తాను" అన్జెప్పి అక్కడ పనిచేసే వాచ్‌మెన్‌తో సహా ఎనిమిది మందిని వరసగా నిలబెట్టాడు.

ఒక్కొక్కరి దగ్గరకి వెళ్ళి, కళ్లు మూసుకుని మూడుసార్లు వాసన చూసి "నో వీళ్లు దొంగలు కారు. ఆ దొంగల్తో వీళ్లకి ఎలాంటి సంబంధం లేదు" అని తేల్చేశాడు.

జియ్యామ్ నివ్వెరపోయాడు. సాధారణంగా పోలీసులు ప్రశ్నలడుగుతారు. అనుమానం వున్న వాళ్లని ఇంట్రాగేషన్ పేరుతో కొట్టి నిజం చెప్పించడం తెలుసు. కానీ, యిలా వాసన చూసి ఎలా దొంగని కనిపెడతాడో మాత్రం అర్థం కాలేదు.

"అదేంటండీ అలా వాసన చూస్తున్నారు? పోలీస్ కుక్కలు కదా అలా వాసన చూసి నేరస్థుల్ని పసిగడతాయి? " తన సందేహాన్ని బైటపెట్టాడు జియ్యామ్.

శంకరయ్య నిట్టూర్చి "ఆ కుక్కలకుండే విలువ మా డిపార్ట్‌మెంట్‌లో కొంతమంది పోలీసులకి వుండడం లేదు. అందుకే.. వాటికుండే వాసన చూసి పసిగట్టే టాలెంట్‌ని నేను అభ్యాసం చేసి సాధించాను. ఆ టాలెంట్‌తోనే ఈ మధ్య నేరస్థుల్ని పట్టేస్తున్నాను" అంటూ ఓ చేత్తో మూతిమీదున్న మీసాన్ని, మరో చేత్తో బోర్లించిన కుండలాంటి కడుపుని తడుముకుంటూ తన జీపు దగ్గరకి నడిచాడు.

"దొంగని పట్టుకునే చిట్కాలేవో చెప్తానన్నారు కదా" అని గుర్తుచేశాడు జియ్యామ్.

శంకరయ్య ఏదో గండికోట రహస్యాన్ని వివరిస్తున్నట్టుగా కాస్త మెల్లగా చెప్పాడు.

"ఆ దొంగ మీ ఆఫీసులోనే పనిచేస్తున్నాడు. ఈ గోడౌన్ తాలూకా అనుపానూ సర్వం తెలిసిన వాడైతే తప్ప, యింత నీటుగా దొంగతనం చెయ్యలేడు. ఇన్నిసార్లు దొంగతనమూ చెయ్యలేడు. వాడు మీ యింటి దొంగేనని నేనెంత తెలివిగా కనిపెట్టేశానో చూశారా? "

జియ్యామ్‌కి యీ విషయం వింతగానూ, ఆసక్తికరంగానూ కనిపించింది.

"ఆ దొంగని కనిపెట్టడం ఎలా? " అని ఆఫీసరు హస్కీవాయిస్‌తోనే అడిగాడు.

"వెరీ సింపుల్. వాడు మీకు బాగా దగ్గర్లోనే వుంటాడు. అమాయకంగానే కనిపిస్తాడు. మీరు లేనప్పుడు మాత్రం టిక్కెట్ పెట్టకుండా ఉచితంగానే తన విశ్వరూపాన్ని చూపిస్తుంటాడు"

"ఇంకేదయినా గట్టి క్లూ యివ్వండి"

"మీ ఆఫీసులో ఎవరికి కార్లు, వేన్లు, స్థలాలు, పొలాలు వున్నాయో కనిపెట్టండి. మీరు కనిపెడుతున్నట్టుగా ఎవరికీ తెలియనివ్వకండి. ఎవరికైనా సదరు ఆస్తుల్లో ఏ

ఒక్కటి ఉన్నట్టు తెలిసినా, వెంటనే నాకో ఫోన్ కొట్టండి. మరుక్షణం యీ పోలీస్ సింహం రంగంలోకి దిగిపోతుంది"

జియ్యమ్ తన స్టాఫ్‌లో ఎవరికి కారు వుందా? అనే ఆలోచనలో పడ్డాడు.

★ ★ ★

"ఫట్"

కొబ్బరికాయ రెండు చెక్కలుగా పగిలింది. రాయుడు కొన్న శాం(త్రో కారుకి పూజచేసి కారు ముందు కొబ్బరికాయ కొట్టాడు. అది సెకెండ్ హ్యాండ్ కారు అని ఒకరు చెప్తే తప్ప నమ్మనంత కొత్తగా వుంది. అంచేత ఎవరు అడిగినా అది కొత్త కారేనని, దాని ఖరీదు నాలుగులక్షలని చెప్పమంది పద్మావతి. అలాగేనన్నాడు రాయుడు. ఇంటి ముందున్నకారుకి పూజ జరుగుతున్నా, కొండమ్మ మాత్రం బైటకి రాకుండా, వంటగదిలోనే వుండిపోయి స్వగతాలు పలుక్కుంటోంది.

"ఆ ప్రియాంక విశాఖపట్నం రావడమే యీవిడ కోసం అయినట్టు, ఆ అమ్మాయి వచ్చిన దగ్గర్నించి కిందా మీదా అయిపోతోంది. పులిని చూసి నక్క వాతలు వేసుకున్నట్టు, ఆ శ్రీమంతురాల్ని చూసి, మా కోడలూ వాత వేసుకుంటోంది. ఆవిడ కనిపించినప్పుడు డబ్బేం ఖర్చుండదు కదా అని కోతలు కోసింది. ఆవిడ యింటికొస్తాననేసరికి లక్షన్నర అప్పుచేసి మరీ కారు కొనేసింది. ఎవరో మధురవాడలో కట్టుకునే బిల్డింగ్ చూపించి, ఆ భవంతి మాదేనని చెప్పి మరో అబద్ధం తయారు చేసేసింది. ఫాల్స్ ప్రిస్టేజీకి పోయి కోతలు కొయ్యడం, ఆ కోతల్ని నిజం చెయ్యడానికి శక్తికి మించిన అప్పులు చెయ్యడం దీన్నే తొమ్మిదో కష్టం అని పెద్దలు చెప్తారు. మనిషికి వచ్చేవి అష్టకష్టాలని శాస్త్రకారులు లెక్కకట్టారు. ఆ ఎనిమిది కష్టాలకి తోడుగా కొంతమంది వాళ్ళ బుద్ధి తక్కువతనంతో సృష్టించుకునేదే తొమ్మిదో కష్టం. అప్పుచేసి కారు కొనెయ్యగానే సరా! ఆ అప్పు, దానిమీద వడ్డీ కట్టేసరికి గూబ గులాబ్‌జామ్ అయిపోద్ది!!"

పద్మావతి బయటనించి హాల్లోకి వచ్చేసరికి కొండమ్మ తన స్వగతాల స్వరం తగ్గించింది. హాల్లో కూర్చుని పద్మ తన టెలీఫోన్ డైరెక్టరీ తీసి ఒక్కోనెంబరుకి ఫోన్ చేసి, తను కొత్త కారు కొన్నానని, దాని ఖరీదు నాలుగు లక్షలని చెప్పడం ఆరంభించింది.

రాయుడు వచ్చి "పన్లోపని ఆ ప్రియాంకకి ఫోన్ కొట్టి రేపోసారి రమ్మని చెప్పు" అన్నాడు.

"రేపు వుదయం పనిమనిషి కూడా వచ్చేస్తుంది. ఆ తర్వాత ఫోన్ చేస్తాను" అంది, మరో వ్యక్తితో ఫోన్‌లో మాట్లాడుతూ

పనిమనిషిని పెడుతుందనే విషయం రాయుడికి తెలీకపోవడంవల్ల అతను ఆశ్చర్యపోయాడు.

ఆ మాటలు కొండమ్మకి వినిపించాయి. వినిపించకపోడానికి అదేమీ నైజామ్ నవాబ్‌గారి బంగళా కాదు. "నేనుండగా పనిమనిషెందుకు? ఇప్పుడు దొరికే పనిమనుషులు ఎంతెంత జీతాలు తీస్కుని, ఏపాటి పన్జేస్తున్నారో నీకు తెలుసా? " అడిగింది కొండమ్మ.

కోడలు ఓ నిర్ణయం తీసుకున్నాక, ప్రెసిడెంటాఫ్ ఇండియా వచ్చి చెప్పినా దాన్ని మార్చుకోదని తెలిసిగూడా ఆ యింటి ఆదాయ వ్యయాలు తెలిసిన వ్యక్తిగా అడక్కుండా వుండలేకపోయింది.

"ఇప్పుడు పని మనుషులు దొరకడం కష్టంగా వుందనీ తెలుసు, దొరికినవాళ్లు చాలా ఎక్కువ జీతాలు అడుగుతున్నారనీ తెలుసు.. కానీ రాజుగారి ఒంటిమీద ఎన్ని ఆభరణాలు వేసుకున్నా నెత్తిమీద కిరీటం పెట్టుకోకపోతే రాజు అనిపించుకోడు.

అలాగే, యిప్పుడు మనం యింటితలుపుకి మీ అబ్బాయి రీజినల్ మేనేజరనే బోర్డు తగిలించాం, యింటి ముందు కారు పెట్టాం, మధురవాడలో బంగళా కడుతున్నామని డైలాగ్ చెప్పాలనుకుంటున్నాం. అది నమ్మనట్టుగా ఫీలయితే, దాన్ని మధురవాడ తీసుకెళ్ళి కన్‌స్ట్రక్షన్‌లో వున్న బిల్డింగ్ చూపించాలనుకుంటున్నాం. ఇన్ని స్టేటస్ సింబల్స్ వున్న నా యింట్లో ఒక్క పనిమనిషయినా లేకపోతే ఎలా? పనిమనిషిని కేవలం టెంపరరీగానే పెడుతున్నాం. ప్రియాంక వచ్చి వెళ్ళిపోగానే పనిమనిషిని తీసేస్తాను" అంది కొండమ్మవైపు చూడకుండా కిటికీవైపు, మీదన తిరుగుతున్న ఫ్యాన్‌వైపు చూస్తూ.

కొండమ్మ పరాజితురాల్లా నిట్టూర్చింది. ఇటుక మీద యిటుక పెడితే పదికాలాల పాటుండే ఇల్లు తయారవుతుంది గానీ ఓ పేకముక్కమీద మరో పేకముక్క పెట్టుకుంటూ వెళ్తే గాలికి పడిపోయే పేకమేడే తయారవుతుంది. పద్మావతి ఆలోచనలూ పేకమేడల్లా కూలిపోతాయని కొండమ్మ మనసులో అనుకుందే తప్ప కోడలితో అనలేకపోయింది.

★ ★ ★

రాత్రి ఏడుగంటలప్పుడు పద్మావతి, కాంచన ఆ వీధిలోని ఓ ఆరు ఇళ్ళకి వెళ్ళి పావుకేజీ స్వీట్ పేకెట్స్ పంచారు. రాయుడు రీజినల్ మేనేజరై రెండేళ్ళు పూర్తయినందుకు, కారు కొన్నందుకు స్వీట్స్ పంచుతున్నామని చెప్పారు. ఎదుటి వర్స యిళ్ళలోని ఆదినారాయణ అనే నడివయస్కుడో చిత్రమైన వ్యక్తి.

"మీకేదో మంచి జరిగిందని మీరు స్వీట్స్ పంచుతున్నారు. మంచి ఎక్కడున్నా దానికి పబ్లిసిటీ యివ్వడం నాకలవాటు" అన్నాడు.

పద్మ చిన్నగా నవ్వుతూ "మాకు కావల్సిందీ అదే" అంది.

మర్నాడు ఆ యింటికి వచ్చిన మనిషి అనుష్క!

అనుష్కంటే!! పనిమనిషి! ఆమె సినిమా వేషాల కోసం తంటాలుపడే మనిషిలా కనిపిస్తోందే తప్ప, ఒళ్ళొంచి యింటిపనులు చేసే మనిషిలా కనబడ్డంలేదు. తెలుగు సినిమాల్లో నటించే హిందీ హీరోయిన్ పేరు పెట్టుకున్నావేంటని అడిగినందుకు ఆమె కస్సుమంటూ లేచింది.

"ఆ పేరు ఆవిడొక్కదానికే వుండాలని గవర్నమెంట్ రూలెట్టిందా? ఆవిడ పేరు పెట్టుకున్నందుకు ఆవిడ ఫీలైపోతే, కోర్టులో కేసు ఏస్కోమనండి" అంది దర్జాగా.

ఆవిడ మాటల్లోని ఫోర్స్‌కి పద్మావతి

**కొత్తగాలి...**

**మూడు ముళ్ళు**
**ఏడు అడుగులు**
**అష్ట కష్టాలు**

– ఇంద్రగంటి నరసింహమూర్తి,
కాకినాడ

కూడా. కాస్త తగ్గి మాట్లాడింది. ఆ యింట్లో పనిచేయడానికి అనుష్క కొన్ని షరతులు పెట్టింది. తనని పద్మావతి కొడుకు 'ఆంటీ' అని పిలవాలి తప్ప మరో రకంగా పిలిస్తే ఒప్పుకోదట. మధ్యాహ్నం ఒంటిగంటకి ఈటీవీలో వచ్చే స్టార్‌మహిళ ప్రోగ్రామ్‌నించి, సాయంత్రం మూడున్నర వరకు వచ్చే సీరియల్స్ కంపల్సరీగా చూస్తాదట. ఆ సమయంలో ఆమెకు ఎవరు ఏ పని చెప్పినా చెయ్యదట. ఇంటి పనులే చేస్తుంది తప్ప, మార్కెట్ కెళ్ళి కూరగాయలు తీసుకురాదట. కాదు, కూడదని

తీసుకురమ్మని పంపితే కంపల్సరీగా కారులోనే పంపాలట. లేకపోతే ఆటోఛార్జీలిచ్చినా ఆటోలో వెళ్లి తెస్తుందట. టీవీల్లో వచ్చే 'పట్టుకుంటే పట్టుచీర', 'అవ్వాక్కైపోయారా?' లాంటి ప్రోగ్రాములకి తను లేండ్‌ఫోన్స్ చేసి మాట్లాడితే, ఎవరూ అభ్యంతరం చెప్పకూడదట!! యిలా ఆవిడ అధికమైన జీతం అడగడంతోపాటు షరతులు కూడా చాలా విధించింది.

అనుష్క చెప్పిన షరతులన్నింటికి పద్మావతి సరేనని తలాడించింది. కానీ, కొండమ్మ మాత్రం "మనం ఆవిణ్ణి పనిలో పెట్టుకుంటున్నామో, లేక ఆవిడేమన్ను పనిలో పెట్టుకుంటుందో నాకు అర్థం కావడంలేదు. సరే, నువ్వు నా యిష్టాయిష్టాల్ని ఖాతరు చెయ్యవు కాబట్టి, నేను ఆ అమ్మాయికే చెప్పుకుంటాను" అన్చెప్పి అనుష్కతోనే డైరక్ట్‌గా చెప్పింది కొండమ్మ. "చూడమ్మా నువ్వు పొద్దుట అయిదోగంటకల్లా కాఫీ చేసిస్తే తప్ప నా బండి నడవదు" అంది.

అనుష్క పకపకమని నవ్వి "భలేవారే మామ్మగారూ, మీలాంటి పెద్దవాళ్లకి ఆ మాత్రం సాయం చెయ్యలేనా? మీరెవరయినా పొద్దుట నాలుగున్నరకి లేచి, ఓ స్ట్రాంగ్ టీ చేసి, నన్ను లెగ్గొట్టి నాచేతికి యిచ్చేస్తే అది తాగేసి టకటకమని మీకు కాఫీ యిచ్చేస్తాను" అంది.

కొండమ్మ ఆమెతో వాదించబోతే పద్మావతి వారించింది. దాంతో కొండమ్మ విసిగిపోయి "మీరూ మీరూ ఎలా పోయినా నాకనవసరం. మన పనిమనిషి ఏం చేసినా సగానికి సగం కలిసి రావాలి" అనే కండీషన్ మాత్రం కచ్చితంగా చెప్పింది. అలాగేనని అనుష్క కూడా తలూపింది.

★ ★ ★

ఆ సాయంకాలమే పద్మావతి ప్రియాంకకి ఫోన్‌చేసి, మా యింటికి ఎప్పుడు వస్తున్నావని అడిగింది.



"నాకైతే రావాలనే వుంది. నిజం చెప్పాలంటే, మా ఆయన్ని బెంగుళూరు ట్రాన్స్‌ఫర్ చెయ్యాలా? విశాఖపట్నం ట్రాన్స్‌ఫర్ చెయ్యాలా? అనే సందేహం ఆఫీసు వాళ్లకి వచ్చినప్పుడు వైజాగ్ చేయించుకోండీ అని నేనే సలహా యిచ్చాను. ఎందుకో తెలుసా? మీరు విశాఖపట్నంలో వున్నారని ఎవరో చెప్పారు. నా పెళ్లైన దగ్గర్నించీ విదేశాలు తిరిగాను, స్వదేశంలోనే చాలా రాష్ట్రాలు తిరిగాను. వెళ్లిన ప్రతిచోటా కొత్త వ్యక్తుల్ని పరిచయం చేస్కోడానికే కొంతకాలం పట్టేసింది. ఆ పరిచయాలు చిక్కబడి స్నేహంగా మారుతుందనేసరికి ఆ వూర్నించో, ఆ దేశంనించో



ట్రాన్స్‌ఫర్ అయిపోయేది. దాంతో మనసు విప్పి మాట్లాడే మనుషులే కరువయ్యారు. విశాఖపట్నం వస్తే, నా చిన్ననాటి స్నేహితురాలయిన మీరు వుంటారు కాబట్టి, బాల్యస్మృతుల్ని మనసారా నెమరు వేసుకోవచ్చని భావించాను. నేనీవూరొచ్చిన పదో రోజే మీరు అనుకోకుండా కనిపించారు. ఒకరకంగా చెప్పాలంటే... నా రాక మీ కోసమే... అహ్హహ్హహ్హా!!".

ఆఖరుమాట పద్మావతి ముఖం మీద ఫెడీమని కొట్టినట్టయింది. నా రాక మీ కోసమే అనేమాట మొన్ననోసారి వాడింది. యిప్పుడూ వాడింది. ఆ మాట 'నేనొచ్చింది నీ సంగతి తేల్చడానికే' అన్నట్టుగా ఆమెకు వినిపిస్తోంది. తను విశాఖపట్నంలోనే వుంటున్నానని ఆవిడతో చెప్పినవాళ్ళు, అంతే చెప్పారో, లేక.. యిక్కడో డొక్కు యింట్లో, డబ్బారేకుల సుబ్బారాయుణ్ణి కట్టుకుని బిలో ఏవరేజ్‌గా బతుకుతున్నానని చెప్పారో తెలీదు. ఆవిడ మాత్రం తనతో హ్యాపీగా టైమ్‌పాస్ చెయ్యడానికే వచ్చానంటోంది. తన కోసమే యీవూరు వచ్చానంటున్న మనిషి, యింటికి ఎందుకు రాదు? వస్తుంది. తన జీవితాన్ని నిశితంగా గమనిస్తుంది. అందుకే ఆలోచనల్ని ఆపి "ఇంతకీ నువ్వు మా యింటికి ఎప్పుడొస్తున్నావో చెప్పలేదు" అని అడిగింది.

"అమలాపురంనించి మావాళ్ళు రావడానికి యింకొన్ని రోజులు పడుతుందట. ఎన్నిరోజులు పడుతుందో ఎగ్జాట్‌గా తెలీ

దుగానీ.. మొత్తం మీద రోజులే! నెలలు మాత్రం కాదు. అందుకే... యిప్పుడోసా రొచ్చి మళ్లీ మా వాళ్లతో కలిసి మరోసారి రావడమంటే కష్టం కదా! మావాళ్లు రాగానే ముందుగా ఫోన్‌చేసి వస్తాను"

సంభాషణ అంతకంటే సాగడం యిష్టం లేక 'ఉంటాను' అన్చెప్పి ఫోన్ పెట్టేసింది.

మర్నాడు మధ్యాహ్నం భోజనాలయ్యాక కొండమ్మ తన కూతురు గదిలో కాస్సేపు నిద్రపోయి లేచేసరికి పావుతక్కువ నాలు గయింది. హాల్లోకొచ్చి చూసింది. పనిమ నిషి అనుష్క ఓ కుర్చీమీద కూర్చుని టీవీ చూస్తోంది. వంటగదివైపు చూస్తే.. రెండు స్టవ్వుల్లో మంటలు మండుతు న్నాయి. స్టవ్‌ల మీద ఏ పాత్రలూ లేవు. ఇంత వేగంగా స్టవ్‌లు ఎందుకు వెలిగిం దిందో తెలీక "అప్పుడే పొయ్యిలు వెలిగిం చేశావేంటి? " అని అనుష్కని అడిగింది. అనుష్క శెనగ పలుకులు తింటూ "ఆ పొయ్యిలు యిప్పుడు ఎలిగించ లేదండి. పొద్దుట వెలిగించినవే" అంది.

"పొద్దుట వెలిగించిన పొయ్యిలు అలాగే వుంచేశావా? ఏం మర్చిపోయావా? "

"లేదండి, మీరు నాకేం చెప్పేరు? నేనేం చేసినా మీకు సగానికి సగం కలిసి రావా లన్నారు కదండి. స్టవుల్ని పొద్దుటోసారి, సాయంత్రం ఓసారి వెగిలిస్తే రెండు అగ్గి పుల్లలు దండగైపోతాయి కదా! ఆ రెండు అగ్గిపుల్లల్లో ఒక్క అగ్గిపుల్లయినా మిగల్చా లని పొద్దుట ఎలిగించిన పొయ్యిల్ని అలాగే వదిలేశాను"

కొండమ్మ అరికాలిమంట నెత్తికెక్కి, అనుష్కని ఫెడీఫెడీమని చావగొట్టాలను కున్నా, తమాయించుకుని బిగ్గరగా కేకలు వేసింది. ఆ కేకలు విని పద్మావతి గబగబ వచ్చి "ఏం జరిగింది? " అని అడిగింది. అనుష్క చేసిన పని గురించి చెప్పబోయి ఆగి, గబగబ వంటగదిలోకి వెళ్లి రెండు స్టవ్‌లూ ఆఫ్ చేసొచ్చి జరిగింది చెప్పి "ఓ పక్కనించి నువ్వు డబ్బుని మంచినీళ్ల ప్రాయంగా ఖర్చు చేసేస్తున్నావు. ఆదాయం వచ్చే మార్గమేంటో చూస్కో కుండా ఖర్చులు పెంచుకుంటూ వెళ్లిపోతు న్నావు. స్టేటస్ సింబలూ, నీవల్లకాడూ వయసిందిబ్బా! అంటూ పనిమనిషిని పెట్టావు. అదేమో అగ్గిపుల్ల ఆదా చెయ్యడా నికి గేస్ సిలెండర్ విప్పి వదిలేసింది. మొత్తంమీద మన సంసారం రెండువై పులా అంటించిన కొవ్వొత్తిలా మారిపో యింది. నీ ఆడంబరాలకీ, నీ దుబారాకీ తోడుగా యిలాంటి పనిమనిషి తగల డింది"

నిజానికి అనుష్క చేసిన పని పద్మావతి క్కూడా కోపం తెప్పించినా తమాయించు కుంది. ఇల్లూ వాకిళ్లు పోగొట్టుకున్న వరద బాధితులకి వరల్డ్ బేంకివాళ్లు ఆహార పొట్లాలు సప్లై చేసినట్టు, హౌస్‌ఓనర్ సీతా రాంని పదిసార్లు అడగ్గా అడగ్గా, యీ పని మనిషిని పంపించాడు. ఆవిణ్ణి కోప్పడి పంపిచేస్తే, ప్రియాంక ముందు యిద్దామ నుకున్న బిల్డప్‌కి లోపం వస్తుందని భావించి అనుష్కని సున్నితంగా మంద లించినా "మళ్లీ ఎప్పుడూ యిలా చెయ్యకు" అని ఆమెతో చెప్పలేదు. "మళ్లీ యిలా చెయ్యదులే" అని అత్తగారికే నచ్చజెప్పింది. పనిమనిషి ముందు గొడవ పడడం వల్ల పద్మావతి మనసు మారకపోగా పోయేది తన పెద్దరికమనేనని భావించి కొండమ్మ ఫైనల్‌గా ఓ మాట చెప్పింది.

"చూడమ్మా మీరు ఎక్కడికి పరుగెడుతు న్నారో, ఎందుకు పరుగెడుతున్నారో మీకు అర్థమవుతున్నదేమో గానీ, నాకు మాత్రం అర్థం కావడం లేదు. అనుభవంతో పండిన మనిషిగా ఓ మాట. మీకు చేత నైతే కష్టపడి జీవితంలో నాలుగు మెట్లు పైకెక్కండి. ఎక్కలేరూ.. కనీసం యిప్పు

డున్న మెట్టుమీదయినా నిలబడండి. అక్క ణ్ణించి మాత్రం జారిపోకండి"

కొండమ్మ వెళ్లిపోయింది. ఆమెతోపాటు ఆమె యిచ్చిన సలహా కూడా వెళ్ళిపో యింది. 'ఆ సీనియర్ సిటిజన్‌కి ఛాన్స్ దొరికితే చాలు మెస్సేజ్ లిచ్చేస్తుంది' అను కుంటూ పద్మావతి తను నడుస్తున్న దారి లోనే మరి కొంతదూరం వెళ్లడానికి నిర్ణ యించుకుంది.

★ ★ ★

ఆ రోజు ఆఫీసులో రెండు విశేషాలు జరిగాయి. ఒకటి గుంటూరు బ్రాంచికి మేనేజర్ని సెలక్ట్ చేసి పంపమని ఆ కంపెనీ ఎమ్.డి.గారు యిక్కడున్న జనరల్ మేనేజరుకి ఫోన్‌చేసి చెప్పారు. ఆ ఫోన్ సంభాషణ జరిగేటప్పుడు, యాదగిరి అక్కడే వున్నాడు కాబట్టి విన్నాడు. రాయు డికి యీ విషయం చెప్పి, జాగ్రత్తగా వుండమని హెచ్చరించాలనుకున్నాడు.

రెండు ఆఫీసరుగారు అప్పుడప్పుడు రాసే గేయాల్ని ఆఫీస్ స్టాఫ్ అంతట్ని తన ఛాంబర్‌లోకి పిలిచి వారందర్ని నిలబెట్టి, గేయాల్ని రాగాలు తీసి పాడుతూ, మధ్యలో కొన్ని ముఖ్యమైన వాక్యాల్ని మళ్లీ మళ్లీ రిపీట్ చేసి మరీ ఆలపిస్తుంటాడు. ఆ రోజు ఆ గేయ కార్యక్రమం పెట్టాడు. స్టాఫ్ మెంబర్స్‌లో ముగ్గురు మహిళలు కూడా వున్నారు. వారు కూడా ఆ గేయ కార్యక్రమం జరిగే గంటసేపూ నిలబడే వినాలి.

"తెల్ల తెల్లని కాకులన్నియు
పచ్చపచ్చని పాలు తాగెను
సముద్రానికి నిప్పు అంటగా
చేపలన్నీ నింగికెగిరి
హాయిహాయిగా ఎగర సాగెను"

ఆ గేయం విన్న కొందరికి వాళ్ల కడు పులో చెయ్యిపెట్టి దేవేసినట్టయింది.

అందరి రియాక్షన్సు ఆఫీసరు గమనిస్తూ "ఈ గేయం పేరు చెప్పడం మర్చిపో యాను. దీని పేరు- ఆకాశంలో భూకంపం" అన్నాడు.

అంతే! బాబూరావు మహదానందం నటిస్తూ దడదడమని చప్పట్లు కొట్టాడు. అతను కొట్టాక, మిగతావాళ్లు కొట్టకపోతే బాగోదని అయిష్టంగానే ఆడాళ్లతో సహా అందరూ చప్పట్లు కొట్టారు. బాబూరావు అంతటితో వూరుకోకుండా తన ప్రశంస లతో ప్రభంజనాన్ని సృష్టించాడు.

"భావుకతంటే యిదీ! ఆకాశానికైనా అంచులు కనిపిస్తాయేమో గానీ, మీ భావు కతకి మాత్రం బౌండరీలు కనబడ్డం లేదండి. ఏంటిసార్ ఆ ప్రయోగాలు?

## వంగుని దణ్ణం పెట్టలేదే!

విశాఖలోని ఆంధ్రవిశ్వవిద్యాలయం ఆంధ్ర విశ్వకళాపరిషత్తులో తెలుగు అధ్యా పకుడిగా పింగళి లక్ష్మీకాంతం పనిచేసే వారు. ఆ పరిషత్తుకు ప్రోఛాన్సిలర్ అయిన జయపుర సంస్థానాధీశులు విక్రమ దేవ వర్మగారు పింగళివారితో 'మీరు కృష్ణాజిల్లా వాస్తవ్యులా! ఇక్కడివారేనేమోనని అనుకొ న్నాను!' అన్నారట ఓసారి.

దానికి పింగళివారు వెంటనే, 'నేనెప్పుడూ ఒక్కసారైనా మాట్లాడుతూ మీకు వంగుని



దణ్ణం పెడుతూ సమాధానం చెప్పలేదు కదా! స్థానికుడిని అవుతానని ఎలా అనుకు న్నారు!?' అన్నారు. విశాఖ వాస్తవ్యులు విక్రమ దేవవర్మగారితో మాట్లాడేప్పుడు గౌర వసూచకంగా కుర్చీనుండి లేచి, వంగి నమ స్కరిస్తూ 'చిత్తం' అంటూ సమాధానం చెప్పేవారట.

పాలు పచ్చపచ్చగా ఉన్నాయా? సముద్రానికి నిప్పు అంటుకుందా? నీట్లో చేపలన్నీ నింగిలోకెగిరి హాయి హాయిగా ఎగురుతున్నాయా? ఇలాంటి మాటల్ని అన్నం తినే వాడెవడూ రాయడండి.. ఎవరో మీలాంటి అమృతం తాగిన అఖండ ప్రజ్ఞావంతులు తప్ప! ఈ గేయం పేరు ఆకాశంలో భూకంపమా? వావ్వావ్వా... ఏం టైటిల్ సార్? ఇలాంటి పేర్లు పెట్టడానికి కాళిదాసుక్కూడా ఖలేజా చాల్లేదంటే నమ్మండి" అన్నాడు.

ఈ పొగడ్తకి తమలపాకంత వుండే జియ్యమ్‌గారి ముఖం తాటాకు మట్టంత సైజ్‌కి విస్తరించింది. బాబూరావు అంతటితో వూరుకోక ఆఫీసరుగారి కుడిచేతిని తీసుకుని కళ్లకి అద్దుకున్నాడు. బాబూరావు చెప్తున్న మాటలు, చేస్తున్న చేష్టలు రాయుడికి, ఆడవాళ్లకి జుగుప్స కలిగించాయి. ఆఫీసరు కూడా ఆ పొగడ్తలతో ఊహాలోకాల్లో ఉయ్యాలలూగుతూ 'ఎహ్హెహ్హె.. నాకుండే భావుకత మీకూ వుంటే, నా ప్రత్యేకత ఏం వుంది? నువ్వు చెప్పిన కాళిదాసయినా, రామదాసయినా ఎలా గొప్పవారై పోయారంటావ్? అప్పటికి నేను పుట్టలేదు కాబట్టి. నేను పుట్టకపోవడం వల్ల బతికిపోయారు. పుట్టుంటే చచ్చుండేవారు ఎహ్హెహ్హె' ఇలా ఆయనగారి ఆత్మస్తుతి, పరనిందలతో ఓ గంటసేపు గడిచాక, వారంతా తమ సీట్ల దగ్గరకి వెళ్లడానికి అనుమతించారు. ఇక్కడ ఆఫీసరు గమనించిన విషయం ఒకటుంది. తను గేయాలు చదివినప్పుడు సాధారణంగా రాయుడు ఆ గేయాల్ని వినడానికి రాడు. అడపాదడపా వచ్చినా, గేయాలు విని వెళ్లిపోతాడే గానీ స్పందించడు. పొగడ్తలనే అందలాలమీద బాబూరావు తనని ఆకాశ వీధుల్లో షికార్లు తిప్పితే, రాయుడు అలాంటి కార్యక్రమాలేం చెయ్యకుండా, ఏదో చావింట్లోకి వచ్చినట్టు ఛాంబర్‌లోకి వస్తాడు. సంతాపసభలో నిలబడినట్టు నిలబడతాడు. కార్యక్రమం అయ్యాక శ్మశానం నించి యింటికెళ్ళేవారిలా కాస్త విషాదవదనంతో వెళ్లిపోతాడు. ఇవాళా అదే జరిగింది!

ఆఫీసు హాల్లోకి అందరూ అప్పుడే స్వాతంత్ర్యం పొందిన బానిసల్లా వచ్చి తమ సీట్స్‌లో కూర్చున్నారు. అక్కడున్న ఆడవాళ్లకి ఆఫీసరుగారు తన గేయాల్తో చేసిన గాయాలకంటే ఎక్కువగా బాబూరావు పొగడ్తలే బాధించాయి. అక్కడ ఉద్యోగం చేసే ఆడవాళ్లు ఎంత శాంత మూర్తులయినా, అవసరమయితే ఎదుటి వాణ్ణి మాటల్తో వాయించెయ్యడానికి, చీవాట్లతో చెండాడెయ్యడానికి వెనకాడనివాళ్ళే! ఆ ముగ్గురిలో ముందుగా రత్నమాలే బాబూరావుమీద విరుచుకుపడింది.

"చూడండి సార్, మీరా ఆఫీసర్ గారికి కాకాపట్టి ప్రమోషను కొట్టెయ్యాలనుకుంటే, వాడింటికెళ్లి రాత్రంతా వహ్వా! వహ్వా!! అంటూ భజన చెయ్యండి. కానీ, ఆ భజన ఆఫీసులో స్టార్ట్ చేసి మమ్మల్నెందుకు చంపడం"

"నేనేం చేశానండి? " ఉక్రోషంగా అడిగాడు బాబూరావు.

"చేసిందంతా మీరే చేశారు. అతను

కొత్తగాలి...

**కవి నూరుతున్న**
**గోరింటాకు**
**పెట్టుకోండి**
**పండుతుంది మనసు**

– *రావి రంగారావు,*
మచిలీపట్నం

యీ ఆఫీసుకొచ్చిన మొదటిరోజే మీరేమని కాకా పట్టారు? మీరు నన్నయకంటే నాలు గురెట్లు, పోతన్న కంటే పదిరెట్లు గొప్ప కవిత్వం చెప్పగలరు. కాళిదాసు కంటే అమోఘంగా కవిత్వం చెప్పి, బాలసుబ్రహ్మణ్యం కంటే బ్రహ్మాండంగా పాడగలరు.. దయచేసి మీ గేయామృతాన్ని మాకు ప్రతీరోజూ పంచండీ అని ప్రార్థించారు. దాంతో ఆ పిచ్చివెధవ రెచ్చిపోయి 'అప్పుడప్పుడు పంచుతా'నని అభయం యిచ్చి, యిదిగో యిలా గంటల తరబడి మమ్మల్ని చంపుకు తింటున్నాడు. వాడు పాడుతుంటే, మేం తల కూడా పక్కకి తిప్పకూడదట. వాడు తుమ్మినా... మీరు 'వహ్వా' అంటున్నారు. వాడు దగ్గినా.. 'అదిరిపోయింది సార్' అంటున్నారు. ప్రమోషన్ కోరుకోవడం తప్పేంకాదు కానీ, దానికోసం మరీ యింతగా ఆత్మగౌరవాన్ని చంపుకోనక్కర్లేదు" అంటూ క్లాసుపీకింది.

ఆ మాటలకి బాబూరావు ముఖం మాడిపోయి, ఏదో ఫైల్ తీసి చదువుతున్నట్టు నటించినా, మరో సీనియర్ ఎంప్లాయి మాలతి కూడా అతన్ని వదలకుండా, తను పెట్టే చీవాట్లనీ అతనిచేత తినిపించింది. "తెల్లారుఝామునే లేచి యింటిపనీ, వంటపనీ తగలెట్టి, పిల్లల్ని స్కూల్ కి పంపించి, అత్తమామలకి టిఫిన్లు అందించి, నేనూ యింత గొంతులో పడేసుకుని పరుగున బస్‌స్టాప్ కొచ్చి, రెండు బస్సులు ఎక్కి దిగి ఆఫీసుకొస్తే యిక్కడీ పిచ్చి పకోడీగాడు గేయపఠనం పేరుతో ప్రాణాలు తోడేస్తున్నాడు. పోనీ, ఆ గంటసేపూ మా లేడీస్‌నైనా కూర్చోమంటాడా అంటే అదీ లేదు. ఉద్యోగం మానేసి, యింట్లోనే చస్తానంటే మా ఆయన ఒప్పుకోడు. ఇక్కడకొచ్చి గేయాలు వినకపోతే వీడొప్పుకోడు. దీనికంతటికీ కారణం ఎవరు? మీరు"

ఆవిడ ఆపెయ్యగానే లీలావతి అందుకుంది, "ఏంటండీ వాడు రాసే రాతలు? వాడు రాసిన రాతలు వినలేక ఛస్తున్నాం. వాడి గేయానికి 'ఆకాశంలో భూకంపం' అనే పేరు పెట్టగానే మీరేం చెయ్యాలి? వాడి కాళ్లూ చేతులూ కట్టేసి, పిచ్చాసుపత్రిలో పారెయ్యాలి. కానీ, అలా చెయ్యకుండా, వాడు వాడే మాటల్లాంటివి వాడ్డానికి కాళిదాసుక్కూడా ఖలేజా చాల్లేదంటారా? వాడి చేతిని మీరు భక్తి ప్రపత్తులతో కళ్లకి అద్దుకుంటారా? ఇప్పుడు గృహ వేధింపులు జరిపేవాళ్లని జైల్లో పెట్టినట్టు, యీ సుందర్రావుగాణ్ణి కూడా! మెదడు వేధింపుల కేసు కింద అరెస్టు చేయించి జైల్లో పెట్టించెయ్యాలి. లేదా ముదిరిపోయిన పిచ్చోడి కింద పిచ్చాసుపత్రిలో పడెయ్యాలి"

ఆ మాటల్లోని వాస్తవం నిప్పురవ్వలా అతన్ని మండిస్తుంటే ఆ బాధ భరించలేక బాబూరావు తన యిద్దరు ఫ్రెండ్సుని తీసుకుని వరండాలోకి వెళ్లిపోయాడు.

మరో గంట తర్వాత ఆఫీసరుగారు తన ఛాంబర్‌లోనించి, అందరూ కూర్చునే హాల్లోకొచ్చి నిలబడ్డాడు. అతను సైగ చేయగానే, అతని వెంట వచ్చిన యాదగిరి ఓ ప్రకటన లాంటిది వినిపించాడు.

"మీ అందరికీ ఓ స్వీట్ న్యూస్, ఓ శుభవార్త వినిపించడానికి మన జియ్యమ్‌గారు ప్రజల దగ్గరకే ప్రభుత్వం వచ్చినట్టుగా ఆయనే మీ సెంటర్‌లో కొచ్చారు. అందరూ జాగ్రత్తగా వినండి"

ఆఫీసరు చెప్పబోయే విషయం మీద ఎవరికీ ఆసక్తి లేకపోయినా, అతనొచ్చింది మాత్రం మళ్లీ గేయాలు వినిపించడానికి కాదని గ్రహించాక, ఆ మాటలు వింటానికి సిద్ధపడ్డారు. ఆఫీసరుగారు తన మాటలు చెప్పడానికి ముందు కొన్ని క్షణాలపాటు పెళ్లిచూపులకి కూర్చున్న ఆడపిల్లలా నేల చూపులు చూశాడు. తర్వాత కాస్సేపు తన



లో తనే ముసిముసిగా నవ్వుకున్నాక మనసులోని మాటల్ని బహిర్గతం చేశాడు.

"ఆ మధ్యన నేను హైదరాబాద్ వెళ్లాను. నేను అద్భుతంగా గేయాలు రాస్తాననే విషయాన్ని ఎంత సీక్రెట్‌గా దాచిపెట్టినా, ఎవరో స్కాంర్డల్స్ ఆ విషయాన్ని హైద రాబాద్‌లో లీకౌట్ చేసేశారు. దాంతో అక్కడుండే దూరదర్శన్ వారికి తెలిసిపో యింది. తెలిసిపోయాక వూరుకుంటారా? ఊరుకోరు. నన్ను వెదుక్కుంటూ, నా హోటల్‌కొచ్చి, మీరు మా దూరదర్శన్‌లో మీ గేయాలు చదువుతారా? లేదా? అంటూ పట్టుపట్టి నా చెయ్యి పట్టుకుని కారులో కూర్చోబెట్టి, టీవీ స్టేషన్‌కి తీసుకు పోయి నా చేత గేయాలు చదివించేశారు. ఆ గేయాల్ని యీ రాత్రి ఎనిమిదింటికి 'అమృతవర్షిణి' కార్యక్రమంలో ప్రసారం చేస్తున్నారు కాబట్టి అదంతా మీకు శుభ వార్తే కదా? మీ అందరికీ పండగే కదా? అంచేత, యివాళ రాత్రి అందరూ శ్రద్ధగా విని, రేపొచ్చి నిర్మొహమాటంగా, నిర్భ యంగా బాగున్నాయని చెప్పండి"

ఆఫీసరుగారికి ఆత్మీయుడుగా మారడానికి రాయుడికిదో సువర్ణావకాశంగా భావించాడు యాదగిరి. రాయుణ్ణి తీసుకుని క్యాంటీన్ కెళ్లి, సొంతడబ్బుల్తో రెండు కాఫీలు తీసు కుని ఒకటి రాయుడికిచ్చి తనూ ఓ కాఫీ తాగుతూ మాటకచేరి ఆరంభించాడు.

"ఇందాక ఆఫీసరుగారు చెప్పిన టీవీలో గేయాల ప్రోగ్రామ్ గురించి మీరేం అను కుంటున్నారు? " అడిగాడు.

రాయుడు ముఖాన్ని ముటముటలా డిస్తూ చిరాగ్గా, "మన ఆఫీసరుగాడికాపోస్ట్ ఎవడిచ్చాడయ్యా? జియ్యమ్‌గాడుత్త పిచ్చి కొత్తెంగాళ్లా వున్నాడు. వీడి గేయాల ప్రో గ్రామ్‌ని మనవే యిక్కడ వినలేక ఛస్తున్నాం. వీడి గేయాల గురించి ఎవడో దూరదర్శన్ వాళ్ల దగ్గర లీకౌట్ చేసేశా డట, వాళ్లొచ్చి వీణ్ణి గేయాలు చదవమంటే చదివేడట! నాకు తెలీకడుగుతాను.. మన వంతా వాడికంటికి నోట్లో వేలేసుకు చూస్తున్న యల్‌కేజీ గుంటల్లా కనిపిస్తు న్నామా అలా చెప్తున్నాడు? " అన్నాడు.

ఆ సమాధానం యాదగిరికి సంతృప్తి నివ్వకపోగా చిరాకు కలిగించింది.

"నేనడిగిందొకటి, మీరు చెప్పిందొకటి"

"నాకు అర్థమయింది లేవయ్యా. వాడు టీవీకి సంబంధించిన ఆఫీసర్ల కాళ్ల పట్టు కున్నాడో, కాలర్ పట్టుకున్నాడో.. మొత్తం మీద వాడి ప్రోగ్రామ్‌ని టెలీకాస్ట్ చేస్తు న్నారు.. ఆ విషయం చెప్పాడు. అంతవ రకు బాగానే వుంది. కానీ వాడి ప్రోగ్రామ్ చూసి మనం నిర్మొహమాటంగా, నిర్భ యంగా బాగుందని చెప్పమన్నాడు. అదే నాకు నచ్చలేదు. నన్ను పొగడండీ అని మరీ అంత డైరక్టుగా అడిగెయ్యడవేంటి ఛండాలంగా" అన్నాడు రాయుడు.

యాదగిరి గ్లాసులోని కాఫీ పూర్తిగా తాగేవరకు మాట్లాడకుండా ఆగాడు. ఆ పని పూర్తయ్యాక "మన పెద్దవాళ్లేం చెప్పారు? మన బుర్ర విలువ మన నోరు చెప్పేస్తుందంటారు. మన ఆఫీసరుగాడు 'ఆకాశంలో భూకంపం' అనే హెడ్డింగ్ పెట్టి, సముద్రానికి నిప్పంటుకుంటే చేప లన్నీ గాలిలో గెంతులేస్తున్నాయని రా శాడే.. అప్పుడే వాడో పిచ్చి తుగ్లక్‌గాడని అర్థమైపోయిందిగా? ప్రస్తుత రోజుల్లో సర్వసంగ పరిత్యాగులైన కొంతమంది బాబాలు, స్వామీజీలే టీవీల్లో వాళ్ల గురించి యాడ్స్ యిచ్చుకుంటున్నారు. అంటే, వాళ్ల దగ్గరకొచ్చి దర్శించుకుని, దక్షి ణలు, ముడుపులు చదివించుకోమనే కదా అర్థం. అలాంటివాళ్లే సెల్ఫ్‌డబ్బాలు వాయించుకుంటున్నప్పుడు మన ఆఫీసర నగా ఎంత? ఇలా సొంతడబ్బా వాయిం చుకోవడంలో పితామహుడనిపించుకున్న

ఓ పెద్దాయన ఓ వాక్యం చెప్పాడు. 'మన డబ్బాని ఎవడూ వాయించనప్పుడు, మన డబ్బాని మనమే గట్టిగా వాయించుకోవాలి. అలా వాయించుకోకపోతే మనం ఫోకస్‌లోకి రావడం కష్టం. వచ్చేశాక, మన చేతిలోని డబ్బాని మరొకరికిచ్చేస్తే, వాళ్లు ఆ డబ్బాని వాయిస్తారు. మన ఆఫీసరు ప్రస్తుతం యింకా మొదటి దశలోనే వున్నాడు. ఇప్పుడు మనకి కావలసింది వాడి డబ్బా మేటరు కాదు. జీవితమంతా పాపాలు చేసేసిన, నీచ నికృష్ట నీచ్‌కమీన్ కుత్తేగాడైనా, చచ్చేముందు ఒక్కసారి 'నారాయణ' అనే మాట పలికితే చాలట... అంతవరకు చేసిన పాపాలన్నింటినీ రద్దు చేసేసి స్వర్గంలో సీటు యిచ్చేస్తాడట ఆ దేవుడు! అంటే- ప్రతీ పనికీ ఓ అదనూ, ఓ అవకాశం వుంటాయన్న మాట. ఇన్నాళ్లూ మీరు ఆఫీసర్ చదివిన గేయాలు విన్నారా? లేదా? అనే పాయింట్ పక్కన పెట్టండి. మీరు బాబూ రావుని ఓవర్‌టేక్ చేసేసి, ఆఫీసర్‌కి క్లోజ్ అయిపోడానికీ టీవీ ప్రోగ్రామో మంచి అవకాశం" అన్నాడు చాలా సిన్సియర్‌గా.

అతను తన మీదంత శ్రద్ధ కనబరుస్తూ, అంత వివరంగా చెప్పాక రాయుడు రవంత చలించాడు. "ఇప్పుణ్ణేనేం చెయ్యాలో నువ్వే చెప్పు" అన్నాడు ఆసక్తిగా.

యాదగిరి ఓ సిగరెట్ వెలిగించి, మరో సిగరెట్ రాయుడికిచ్చాడు. రాయుడు ఎప్పుడైనా, ఎవరైనా యిస్తే వాళ్ల కంపెనీ కోసం కాలుస్తాడు తప్ప, ఓ అలవాటుగా మాత్రం సిగరెట్ కాల్చడు. యాదగిరి గాఢంగా ఓ దమ్ము లాగాక చెప్పాడు.

"మరేం లేదండి. ఇవాళ రాత్రి టీవీలో వచ్చే ప్రోగ్రామ్‌ని ఓ టేప్‌రికార్డర్‌లో రికార్డ్ చెయ్యండి. రాత్రంతా మేల్కొని ఆ గేయాలన్నీ కంఠతా పెట్టెయ్యండి"

రాయుడు చిన్నగా నవ్వి, తల అడ్డంగా ఆడిస్తూ "సారీ, యాదగిరీ! తెల్లార్లూ మేల్కొని వుండడం మనకి చేతకాని పని, రాత్రి పదిగంటలకి మంచం ఎక్కితే, పొద్దుట తొమ్మిది గంటలదాకా నిద్రలేచే ప్రసక్తే లేదు" అన్నాడు.

యాదగిరి తన అరికాలి మంట తన నెత్తికెక్కినట్టుగా ఇరిటేషన్ ఫీలవుతూ "మీరిలాంటి బుర్రలేని వితండవాదాలు చెయ్యకండి. ఏసీ రూముల్లో వుంటూ, ఏసీ కార్లలో తిరిగే నాయకులు కూడా, వాళ్ల పదవుల కోసం కిలోమీటర్లకి కిలోమీటర్ల దూరం పాదయాత్రలు చేస్తున్నారు. అలా ఎవరు చేయిస్తున్నారు? వాళ్ల అవసరం. మామూలప్పుడు ప్రతిరోజూ క్రమం తప్పకుండా, వేళపట్టున మందుకొట్టే, మహామహా నాయకులు కూడా కొన్ని ఉద్యమాలు చేబట్టినప్పుడు, మందు ముట్టుకోకుండా, కేవలం ఫ్లూయిడ్స్‌ని మాత్రమే తాగుతూ నిరాహారదీక్షలు చేస్తున్నారు. అలా ఎవరు చేయిస్తున్నారు? వాళ్ల అవసరం! అవసరమేనండీ, అన్నింటికీ ఆది గురువు. అలాగే మీరు కూడా మీ అవసరం కోసమే ఒకరోజు మేల్కొని వుంటున్నారు తప్ప, మీరొక్కరోజు మేల్కొని వుండడం వలన ఇరవైవేలు దాటేసిన తులం బంగారం లటుక్కుమని వెయ్యినూటపదార్లకి దిగిపోదు కదా? !" అన్నాడు.

## కొత్తగాలి...

**కంప్యూటర్**
**ఒకప్పుడు వాళ్లని కలిపింది**
**చాటింగ్ ద్వారా.. దూరంగా ఉన్నప్పుడు**
**ఇప్పుడదే వాళ్లని దూరం చేస్తోంది**
**వాళ్ల ప్రాజెక్టుల ద్వారా.. దగ్గరగా ఉన్నప్పుడు**

– రామకృష్ణ శర్మ, కరీంనగర్

రాయుడు కాస్సేపు ఆలోచించి, ఆర్గ్యు మెంట్ చెయ్యడానికి మరో పాయింటేదీ దొరక్క "సరేనయ్యా, నేను మేల్కొని, ఏం చెయ్యాలో చెప్పు" అన్నాడు.

యాదగిరి వివరంగా చెప్పాడు.

అతనేమీ ఏట్లో దూకమనలేదు. కొండ మీదనుంచి గెంతమనలేదు. రాత్రంతా మేల్కొని రికార్డ్ చేసిన గేయాల్ని కంఠతా పెట్టెయ్యమన్నాడు. రాయుడు ఒక్కసారి వింటే చాలు, అలా పట్టేసే ఏకసంతా గ్రాహి అని ఎవరూ చెప్పే శ్రమలేకుండా రాయుడే చాలాసార్లు చెప్పాడు కాబట్టి, ఆ పని చెయ్యడం పెద్ద బ్రహ్మవిద్యేమి కాదు అతనికి.

ఆఫీసుకొచ్చాక, అందరూ చూస్తుండగా, ఆఫీసరు దగ్గర ఆ గేయాల్ని దడదడమని అప్పజెప్పమన్నాడు. డైలాగుల్తో పొగడమ న్నాడు. చేతుల్తో చప్పట్లు కొట్టమన్నాడు. అన్నీ కూడా పైసా ఖర్చులేని పనులే! అవన్నీ చేస్తే మాత్రం ఫలితం అద్భుతంగా వస్తుందని చెప్పాడు.

అన్నీ విన్నాక రాయుడు, తన ప్రమోష న్‌కి అడ్డుపడుతున్న బాబూరావు సంగతి ఏంటని అడిగాడు.

దానికి యాదగిరి ఓ నగ్నసత్యాన్ని వివ రించాడు. "భగవంతుడు దగ్గరగా వుండే పూజార్ని అనుగ్రహించకుండా, అప్పుడ ప్పుడు వచ్చే భక్తుణ్ణే అనుగ్రహిస్తాడు. అలాగే మన ఆఫీసరు కూడా ఎప్పుడూ పొగిడే బాబూరావు పొగడ్తల్ని రొటీన్‌గా ఫీలై, కొత్తగా మెచ్చుకునే మీ మాటలకి వెరైటీగా ఫీలై మిమ్మల్నే అనుగ్రహిస్తాడు"

రాయుడికీ సలహా సూక్ష్మంలో మోక్షం ప్రసాదించే ఉపాయంలా అనిపించి సరే నని తల ఊపాడు. సాయంత్రం యింటికొ చ్చేటప్పుడే కొత్త బేటరీలు, ఓ ఆడియో క్యాసెట్ కొనుక్కొచ్చాడు. బ్యాటరీల్ని టేప్ రికార్డర్‌లో ఫిక్స్‌చేసి, క్యాసెట్ పెట్టి రెండు మూడుసార్లు హలో హలో అని మాట్లాడి, విని సంతృప్తి పడ్డాడు.

రాత్రి ఎనిమిదయింది. అందర్నీ నిశ్శ బ్దంగా వుండమని చెప్పి, టేప్ రికార్డర్ ఆన్ చేశాడు. టీవీ స్క్రీన్‌మీద ఏంకర్ కనిపిం చింది. "సాహితీ ప్రియులందరికీ స్వాగ తం. ఇప్పుడు అమృతవర్షిణి గేయకార్యక్ర మం ప్రసారమవుతుంది"

కరెంట్ పోయింది. "టప్" ఇల్లంతా అంధకారం అలుముకుంది. సరిగ్గా, ఆ ప్రోగ్రామ్ వచ్చేటప్పుడే కరెంట్ పోవ డంతో రాయుడు కరెంట్ షాక్ తిన్న కాకిలా గిలగిల్లాడిపోయాడు. "ఇప్పుడు కరెంట్ పోయిందేంటి ఖర్మ" అంటుంటే కొండమ్మ లేచి, తడుముకుంటూ వంటగది లోకి వెళ్లి ఓ కొవ్వొత్తి వెలిగించి తెచ్చింది.

"మెయిన్ స్విచ్ ఓసారి చూడరా, ఫ్యూజ్ పోయింటాది" అంది.

కాంచన ఓ స్టూల్ తెచ్చి మెయిన్ స్విచ్ బోర్డు దగ్గర వేసింది.

"నాలుగు రోజుల క్రితమే కొత్త ఫ్యూజ్ వేశాను. అప్పుడే ఎందుకు పోతుంది?" పద్మావతి చీకటిలోనే ఓ లాజిక్ తీసింది.

రాయుడు మెల్లగా తడుముకుంటూ యింట్లోనించి బైటకి వెళ్తే, పద్మావతీ అను సరించింది. వీధిలో అందరి యిళ్లలోనూ లైట్లు వెలుగుతున్నాయి. కరెంట్ పోయింది రాయుడి ఒక్కింటికే!

"ఇప్పుడెలా పద్మా? పోనీ, చిన్నారావు యింటికెళ్లి వాళ్ల టీవీలో ప్రోగ్రామ్ చూసొ చ్చేస్తాను" అన్నాడు రాయుడు.

పద్మావతి ఒప్పుకోలేదు. "చిన్నారావింటి కెళ్తే నేనొప్పుకోను. మొన్నోసారి ఆ చిన్నా రావు పెళ్లాం భాగ్యలక్ష్మిని మనం కొన్న కారు చూడ్డానికి రమ్మంటే ఆవిడేం నీలి గిందో తెలుసా? కార్లు మీకు కొత్తగానీ, మాక్కాదు. కారు మీరెప్పుడో ఎక్కుతారు. కానీ, మా ఆయన రోజుకి పదిగంటలు

కారులోనే తిరుగుతారంది. అంత టెంపరు చూపించే మనిషింటికి మీరెందుకెళ్లాలి?"

రాయుడికి చిర్రెత్తుకొచ్చింది. "ఔను పద్మా! వాళ్లాయన చేసేది కారు డ్రైవరు పని కాబట్టి, రోజుకి పదిగంటలు కారులో తిరక్క తప్పదు కదా" అన్నాడు. "అయితే తిరపతిరాజు గారింటికెళ్లి చూసొస్తా"నంటుండగా రాయుడి యింట్లోని లైట్లు వెలిగాయి. గబగబా యింట్లోకి వెళ్లారు.

"కరెంట్ వచ్చేసిందే" అంది పద్మ యింట్లోకి వస్తూ.

కొండమ్మ తన కోడల్ని కొరకొరమని చూస్తూ "కరెంట్ రాలేదు, మనమే తెచ్చుకున్నాం. ఫ్యూజ్ పోయిందని చెప్తే, అక్కడ చెకింగ్ చెయ్యకుండా, నాలుగు రోజుల కిందట వేసిన ఫ్యూజ్ అప్పుడే ఎందుకు పోతాదీ అని లాజిక్కు తీశావే తప్ప, మీ ఆయన్ని చూడనిచ్చావు కాదు. మహామహా మనుషులే, యివాళ వున్న వారు రేపు వుండడం లేదు. వెధవ ఫ్యూజనగా ఎంత? ప్రతీదానికీ లాజిక్కులు లాగడం గొప్ప కాదు.. పని జరిగే ఉపాయం ఆలోచించాలి" అంది.

ఆవిడే కొత్త ఫ్యూజ్ వేసింది కాబట్టి పద్మావతి మరేం మాట్లాడలేకపోయింది.

రాయుడు అత్తా కోడళ్ల ఫిలాసఫీల గురించి ఆలోచించకుండా టీవీ ఆన్‌చేసి దూరదర్శన్ ఛానల్ పెట్టాడు. గేయ కార్యక్రమం పూర్తయిపోయి, తదుపరి కార్యక్రమమేదో వస్తోంది. రాయుడు నెత్తి కొట్టుకుంటూ సోఫాలో కూలబడిపోయాడు. తనకొచ్చిన బంగారం లాంటి అవకాశం చెయ్యి జారిపోయిందని గిలగిల్లాడిపోయాడు.

కొండమ్మ కొడుకు పరిస్థితిని చూసి సహించలేక "పోతే పోయిందిలేరా. ఏది ఎలా జరగాలో అలాగే జరుగుతుంది. నువ్వేం బాధపడకు" అంది.

పద్మావతి ఆ మాటలకి ఒప్పుకోలేదు.

## హాస్యంలో అందెవేసిన చేయి



**కాశీ విశ్వనాథ్**

నాటక, కథా, సినిమా, టీవీ రచయితగా, నటుడిగా, దర్శకుడిగా ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు, నంది అవార్డులు, తెలుగు విశ్వవిద్యాలయంవారి పురస్కారాలు లభించాయి. నటుడిగా ఎన్టీఆర్ పురస్కారం పొందాను. ఇంతవరకూ 130 సినిమాలకు రచనలు చేసి, 45 సినిమాలు, సీరియల్స్‌లో నటించాను. 'ఉత్తమ సినిమా రచన- కొన్ని మౌలికాంశాలు' అనే నా పుస్తకానికి ఉత్తమ సినిమా గ్రంథం నంది అవార్డు లభించింది. గత శతాబ్దిలో ప్రదర్శించిన వేలాది నాటికల్లో ఉత్తమ సామాజిక విలువలు కలిగిన 58 నాటికల్ని ఎంపికచేసి అపూర్వ సంకలనాన్ని వెలువరించారు. వాటిలో నేను రాసిన 'మీరైతే ఏం చేస్తారు?' అనే నాటిక ఉండటం నాకు ఆనందదాయకం. అలాగే 97 మంది విశిష్ట కథా రచయితల్ని ఎంపిక చేసి, వారి ఒక్కొక్క కథతో 'కథా సాగర్' అనే సంకలనాన్ని కళాసాగర్‌వారు ప్రచురించారు. ఆ కథకుల్లో నేనూ ఒకడిని. గతంలో 'చతుర'లో వెలువడిన నా నవలలు సినిమాలుగా, టీవీ సీరియల్స్‌గా వెలువడ్డాయి.

చిరునామా:
**కాశీ విశ్వనాథ్**
31-30-37, నారాయణ స్ట్రీట్,
నియర్ లీలామహల్, దాబా గార్డెన్స్,
విశాఖపట్నం-530020

"పని జరిగే ఉపాయం చెప్పకుండా, అలాంటి ముసలి కబుర్లు చెప్తావేంటి? " అంది.

కొండమ్మ అఫెండయి "నావి ముసలి కబుర్లయితే, ఆ పడుచు కబుర్లేవో నువ్వే చెప్పు" అంటూ కాంచనని తీసుకుని గదిలోకి వెళ్లిపోయింది.

రాయుడి పక్కనే కూర్చుని పద్మ ఓ సలహా చెప్పింది. "మీ ఆఫీసరు తన గేయాల్ని టీవీలో వినమన్నాడు, పొగడమన్నాడే గానీ, వాటిని కంఠతా పెట్టి అప్పజెప్పమనలేదుగా. రేపు అందరూ పొగుడుతారు. మీరూ పొగుడుతారు. కానీ, మీకో ప్రత్యేకత కలగాలంటే మీరోపని చెయ్యాలి"

"ఏంటి? "

> **కొత్తగాలి...**
>
> **అవినీతిపై**
> **ఒక్క 'అన్నా' దీక్ష**
> **హజారోంకే**
> **బరాబర్ హై**
>
> – యు. విజయశేఖరరెడ్డి,
> కూకట్‌పల్లి

"రేపు మీతోపాటు నేనూ వస్తాను"

"నువ్వెందుకు? " కాస్త కంగారుపడుతూ అడిగాడు.

"మగాళ్లకి లేడీ ఫ్యాన్స్ వున్నారంటే పొంగిపోని యాక్టర్లు, రైటర్లు వుండరు. పైగా, మీ స్టాఫ్‌లో ఎవడూ వాడి పెళ్లాణ్ని తీసుకొచ్చి ఆఫీసర్ని అభినందించరు. మీరొక్కరే భార్యాసమేతంగా వెళ్తారు. అదో స్పెషాల్టీ! నెంబర్ టూ, మీ ఆఫీసర్‌కో శాలువా కప్పి, దండవేసి చప్పట్లు కొట్టి అభినందిద్దాం. నేను చదువుకునేటప్పుడు రెండు మూడుసార్లు డిబేట్ కాంపిటీషన్స్‌లో పాల్గొని బహుమతులు పొందాను కాబట్టి, నేనూ దడదడమని నాలుగు డైలాగుల్తో పొగిడాననుకోండి. ఆ దెబ్బకి ఫ్లాట్ అయిపోయి, మీకు వెంటనే ప్రమోషన్ యిచ్చెయ్యకపోతే నా పేరు వీరవెంకట పద్మావతే కాదు" అంది.

భార్య చెప్పిన ఐడియా బ్రహ్మాండంగా నచ్చింది రాయుడికి. తన ప్రమోషన్ వచ్చే టైమ్ దగ్గరపడిపోయింది కాబట్టే, తన భార్యకి యింత గొప్ప ఐడియా తట్టిందనుకున్నాడు. మర్నాడు ఉదయం స్కూటర్ మీద దంపతులు బయల్దేరి, దారిలో రెండువందలిచ్చి శాలువా, నూటయాభై యిచ్చి కాస్త పెద్దసైజు పూలదండ కొన్నారు. రాయుడు ఆఫీసుకెళ్లేసరికి ఆఫీసరు హాల్లోనే నిలబడి స్టాఫ్‌తో మాట్లాడుతున్నాడు. అందరూ నిలబడే వున్నారు. రాయుడు భార్యాసమేతంగా హడావిడిగా రావడం, అందులోనూ పూలదండ పట్టుకుని రావడం చూసి యాదగిరి కంగారుపడి వాళ్లని ఆగమని సైగ చేశాడు. కానీ, రాయుడు అదేమీ పట్టించుకోకుండా గబగబా ఆఫీసరుకి శాలువా కప్పి, దండవేసి చప్పట్లు కొట్టాడు. పద్మావతి తప్ప మరెవరూ చప్పట్లు కొట్టలేదు. రాయుడు తన ధోరణిలో చెప్పుకుపోయాడు.

"నా మిస్సెస్ సార్" అన్నాడు రాయుడు.

ఆఫీసరు భావరహితంగా, జీవరహితంగా చూసి, "ఏమిటిదంతా? " అన్నాడు.

"అభినందన సార్! మీ ప్రోగ్రామ్ విన్నాక మిమ్మల్ని ఎలాగైనా పరిచయం చెయ్యమని మా ఆవిడ రాత్రంతా ఒకటే గొడవ సార్.. అందుకే తీసుకొచ్చాను" అన్నాడు రాయుడు ముఖమంతా నోరు చేసుకుని నవ్వుతూ.

"మీ మిస్సెస్ కూడా విందా? " ఆఫీసర్ అదే మూడ్‌లో అడిగాడు.

వెంటనే పద్మ అందుకుని మాట్లాడింది.

"ఔను సార్, నేనూ మా అత్తగారూ, ఆడ పడుచూ విన్నాం. వినేదాకా ఈయన వూరుకోలేదు. పక్కింటివాళ్లని, ఎదురింటి వాళ్లని కూడా పిలిచి, కూల్‌డ్రింకులిచ్చి మరీ ఆ ప్రోగ్రామ్ చూపించారు"

"బాగున్నాయా? "

"బాగున్నాయని చెప్పడవంటే.. ఉత్తుంగ శృంగ తరంగాలయిన హిమాలయ పర్వతాన్ని పాస్‌పోర్ట్ సైజులో చూపించినట్లే అవుతుంది సార్! అమృతవర్షిణి అని మీ గేయాలకి పేరు పెట్టినందుకు, మేవంతా ఆ వర్షంలో తడిసిపోయామంటే నమ్మండి. మీ గేయాల్ని శ్రద్ధగా వింటే, నగరానికో నన్నయ్యభట్టు, పేటకో పోతనామాత్యుడు పుట్టుకొస్తాడు. మీరాగేయాల్ని గ్రంథంగా వేయించండి. జ్ఞాన్‌పీఠ్ అవార్డ్ తప్పకుండా వస్తుందని నేను ఘంటాపథంగా చెప్పగలను" పద్మావతి అనర్గళంగా చెప్పుకుపోతున్నా ఎవరూ చప్పట్లు కొట్టలేదు.

ఆఫీసరుగారు వస్తున్న ఏడుపుని ఆపుకుంటూ మెల్లగా దండని, శాలువాని తీసి పక్కనున్న టేబిల్ మీదపెట్టి కర్చీఫ్‌తో కళ్లు తుడుచుకుంటూ తన ఛాంబర్‌లోకి వెళ్లిపోయాడు.

రాయుడికి, పద్మావతికి ఆఫీసరుగారి ప్రవర్తన అర్థంకాలేదు. వరుసల్లో వున్న వారంతా సన్మానసభలో వున్నట్లు కాకుండ, ఏదో సంతాపసభలో వున్నట్టుగా విషాదవదనాలతో ఎందుకు కనిపిస్తున్నారో అర్థం కాలేదు. "ఆఫీసరుగారు ఏడుస్తున్నారేంటి? " రాయుడు సణిగాడు.

బాబూరావు వ్యంగ్యంగా జవాబు చెప్పాడు. "ఏడ్చేవాణ్ణి మరొకడొచ్చి వెక్కిరిస్తే అప్పుడు ఏడ్చేవాడి మనసెలా వుంటుంది? "

"చాలా దరిద్రంగా వుంటాది"

"కదా! ఇప్పుడు ఆఫీసరుగారి మనసు కూడా అదే పరిస్థితిలో వుంది. ఉండడం కాదు, మీరే ఆ మనసుని గిల్లేశారు! నిన్న రాత్రి టీవీలో ఆయన ప్రోగ్రామ్ రాలేదు"

"రాకపోవడవేంటండీ బాబు.." రాయుడు దబాయిస్తూ చెప్పబోతే బాబూరావు సీరియస్‌గా కేక వేశాడు.

"మీరు మూసుకుంటే మేం మాట్లాడతాం. నిన్నరాత్రి ఆయన ప్రోగ్రామ్ రాలేదని, యివాళ తెల్లవారుఝామునించి చంటిగుంటల్లా గుక్కపెట్టి ఏడుస్తుంటే, మేం ఓదారుస్తున్నాం. ఎత్తుకుని తిప్పితే బావుణ్ణనుకున్నాం గానీ, అది కుదిరేపనికాదని విత్‌డ్రా చేసుకున్నాం. అదే టైములో మీరొచ్చి శాలువా కప్పి, దండవేసి, భార్యాసమేతంగా యీ మహాజనం మధ్య మరపురానంత అవమానం చేశారు. అది భరించలేకే... యిక్కడే తాడుంటే, ఉరేసుకు చద్దాం అనుకున్నారు. కానీ, తాడులేదు. కత్తివుంటే పొడుచుకునేవారు, కానీ కత్తి దొరకలేదు. అందుకే, ఆ కార్యక్రమాన్ని రద్దు చేసుకుని, మిమ్మల్ని తిట్టలేక తనలో తానే కుమిలి కుమిలి ఏడుస్తున్నారు"

రాయుడు, పద్మావతి అనూహ్యమైన యీ వార్తకి, వాతావరణానికి కంగుతిన్నట్టుగా ఫీలవుతూ ఒకర్నొకరు చూసుకున్నారు.

"దూరదర్శన్‌లో అమృతవర్షిణి ప్రోగ్రామ్ ప్రసారమవుతుందని యాంకర్ చెప్పింది కదండి"

రాయుడు కాస్త దబాయించబోయాడు గానీ, గొంతుమాత్రం ఎక్కడో అగాధంలోనించి వస్తున్నట్టే వచ్చింది.

"అదీ అసలు సంగతి! యాంకర్ ప్రోగ్రామ్ పేరు చెప్పగానే టీవి ఆఫ్ చేసేశారన్నమాట. అమృతవర్షిణి అనేది ఆఫీసరుగారి గేయాల పేరు కాదుట. ఆ ప్రోగ్రామ్ పేరు. ఆ ప్రోగ్రామ్‌లో ఒక్కో వారం ఒక్కో కవిగారి చేత గేయాలు చదివిస్తారు. కానీ, నిన్నరాత్రి ఏదో కారణాల

వల్ల ఈయన ప్రోగ్రామ్ కాకుండా మరెవరి ప్రోగ్రామో టెలీకాస్ట్ చేశారు. ఆయన ఆఫీసులో గేయాలు చదివేటప్పుడు మీరెప్పుడూ వినరు. విన్నా, వాటి గురించి మాట్లాడరు. కనీసం టీవీలో వచ్చినప్పుడైనా వింటారనుకుంటే, అదీ లేదు. ఇప్పుడిలా భార్యని కూడా తీసుకొచ్చి స్టాఫ్ అందరి ముందు అవమానించడాన్ని ఎవరూ తట్టుకోలేరు"

ఏం చెయ్యాలో తెలీక బిక్కచచ్చిపోయిన దంపతుల్ని యాదగిరి బైటకి తీసుకెళ్లి "ఏంటండీ యీ గోల?" అని అడిగాడు.

ఆ దంపతులు నిన్నరాత్రి తమ యింట్లో

> ## కొత్తగాలి... 
>
> **కష్టాల వెంటే సుఖాలు**
> **సుఖాల వెంటే కష్టాలు**
> **కష్టసుఖాలు కావడికుండలు**
>
> – కాళిదాసు,
> కరీంనగర్

కరెంట్ పోయిన విషయం చెప్పారు.

యాదగిరి నెత్తికొట్టుకుంటూ "ఛఛఛ.. సీక్వెన్సంతా చెత్త చేసేశారండి. కరెంటు పోయినప్పుడు మరో యింటికెళ్ళి టీవి చూడాలన్న ఐడియా వచ్చింది. ప్రోగ్రామ్ చూడకపోయినా, ఆఫీసరుకి సన్మానం చేసి, ప్రోగ్రామ్ అద్భుతం అని పొగిడితే మీకు లాభం కలుగుతుందనే ఐడియా కూడా వచ్చింది. కానీ, నాకో ఫోన్‌కొట్టి నిన్నరాత్రి అడిగినా, యివాళ పొద్దుట అడిగినా యింత గొడవ జరిగేది కాదుగా. ఈ ఐడియా మాత్రం మీ యిద్దరికీ రాలేదు. ఛఛ...! ఈటీవి ప్రోగ్రామ్ ఓ అవకాశంగా తీసుకుని మీరు ఆ ఆఫీసరుకి గోడకి కొట్టిన సున్నంలా అంటుకుపోతారనుకున్నానుగానీ, గోడక్కొట్టిన బంతిలా దూరంగా వెళ్లిపోతారనుకోలేదు"

పద్మావతి మనసు దహించుకుపోతుండడం వల్ల, అక్కడ వుండి మౌనం పాటించడం కంటే యింటికి వెళ్లిపోతే మంచిదనిపించి, ఆఫీసు బైటకి వచ్చి, ఆటో ఎక్కి యింటికి వెళ్లిపోయింది.

రాయుడికి రావలసిన ప్రమోషన్ పర్వంలో యిదొక విషాద సంఘటనగా మారిపోయింది.

★ ★ ★

పద్మావతి యింటికి చేరుకోగానే కొండమ్మ వంట గదిలోనించే కోడల్ని చూసింది.

పద్మావతి ఆమెను చూడనైనా చూడకుండా తన గదిలోకి వెళ్లి తలుపులు మూసి, మంచంమీద పడుకుంది.

కొండమ్మ సణుగుడు లేకుండా ఆలోచించింది. నిన్నరాత్రి పద్మావతి రాయుడికిచ్చిన సలహా ఫలించివుంటే, యిప్పుడు కోడలి ముఖంలో కోటిసూర్యుల కాంతి ధగధగలాడేది! కానీ, పద్మావతి ముఖంలో ఎప్పుడూ వెలిగే ట్వంటీఫైవ్ వాల్ట్సు బల్బు టప్‌మని మాడిపోయినట్టుగా ఆమె ముఖం నిస్తేజంగా కనిపించింది. 'ఏం జరిగిందమ్మా?' అని అడిగితే పద్మావతి చెప్పదు. చెప్పకపోయినా ఫర్వాలేదు గానీ, తనమీద కస్సుమంటూ లేస్తేనే గొడవ ఆరంభమవుతుంది. పనిమనిషి అనుష్క చేత అడిగిస్తే... యింకా పెద్ద ఘర్షణే జరగొచ్చు! పనిమనిషిచేత అడిగించినందుకు ప్రిస్టేజీ ఫీలవుతుంది తప్ప ఆఫీసులో ఏం జరిగిందో తెలీదు. నిన్నరాత్రి పద్మావతి తన భర్తకి చెప్పిన ఐడియా వాస్తవంగా ఎంతవరకు సక్సెస్ అయిందో తెలుసుకోవాలనే కుతూహలం కొండమ్మకి వున్నా, ఆ కోరిక తీరే మార్గం మాత్రం కనబడ్డం

లేదు. కాంచన కాలేజీనించి వచ్చేవరకు ఆగింది. రాగానే పద్మావతి విషయం చెప్పింది.

చెప్పగానే కాంచన వెళ్లి పద్మావతి గది తలుపులు కొట్టెయ్యలేదు. ఆలోచనలో పడింది. ఓ రెండు నిమిషాలు తర్వాత తల అడ్డంగా ఆడించి "ఊహూఁ! వదిన్ని నేను అడిగితే అబద్ధం చెప్తుంది తప్ప నిజం చెప్పదు. ఎందుకంటే అన్నయ్యకీ, వదినకీ, ఆఫీసులో పరాజయం ఎదురైవుండాలి. పరాభవం జరిగుండాలి. లేకపోతే యిలా తలుపులు బిడాయించుకు పడుకోదు. కరెక్టుగా అక్కడేం జరిగిందో అన్నయ్యని అడిగినా నిజం చెప్పడు. ఎందుకంటే యీ ప్రాజెక్టులో వదిన కూడా ఇన్వాల్వ్ అయింది కాబట్టి చెప్పడానికి భయపడతాడు"

కాంచన చెప్పిందంతా సమంజసంగానే వున్నట్టనిపించింది. "మరైతే ఎలా తెలుస్తుందే? " అంది కొండమ్మ.

కాంచన కాస్సేపు ఆలోచించి "యాదగిరిని అడుగుదాం" అంటూ లేండ్‌ఫోన్ దగ్గరున్న టెలీఫోన్ డైరీ తీసి అందులో వున్న యాదగిరి నెంబర్‌కి డయల్‌చేసి మాట్లాడింది. అతను జరిగినదంతా వివరించాడు. కాంచన ఫోన్ పెట్టేసి, అతను చెప్పిన విషయంలోని సెంటర్ పాయింట్‌ని కొండమ్మకి చెప్పింది.

అక్కడే వున్న అనుష్క ఆ మాటలకి కిసుక్కుమని నవ్వబోయి తమాయించుకున్నా, కొండమ్మ మాత్రం నవ్వలేదు. కొద్దిగా నిట్టూర్చి చెప్పింది. "అంతేనమ్మా! తెలివితేటలు మనిషికి ఎంత ఉపకారం చేస్తాయో, అతితెలివి అంతే అపకారం చేస్తుంది. ఇవాళ మీ వదిన ఉపయోగించింది అతితెలివి. నా పెళ్లి విషయంలో మా నాన్న, పెళ్లైన కొత్తలో నేను.. చెరొకసారి అతితెలివి వుపయోగించి మాడు పగిలిపోయేలా దెబ్బతినేశాం. అప్పట్నించీ నేను తెలివి ఉపయోగించినా వుపయోగించకపోయినా, అతితెలివి మాత్రం వుపయోగించడం మానేశాను"

కాంచనకి ఆ విషయం మీద ఆసక్తి పెరిగింది. "నువ్వు ప్రతీ విషయంలోనూ ఆచితూచి వ్యవహరిస్తావు. అలాంటి నువ్వు అతితెలివితో ఎలా దెబ్బతినేశావో చెప్పవా? " అంటూ అడిగింది.

అనుష్క గూడా చెప్పండి మామ్మగారూ అంటూ కాంచనతో వంత పలికేసరికి కొండమ్మకి చెప్పక తప్పలేదు. ఆమె సుదీర్ఘంగా చెప్పిందాన్ని క్లుప్తంగా చెప్పాలంటే..

కొండమ్మ తండ్రి సన్యాసిరాజు తన కూతురి కోసం సంబంధాలు వెదుకుతున్న సమయంలో అతనికి తారసపడ్డాడు.. సురకత్తుల సూరిబాబు! అతనికి వెనక ముందు ఎవరూ లేకపోయినా, చూడ్డానికి నిగనిగలాడే రూపం వుండడంతో, ఆ కుర్రాణ్ణి ఎలాగైనా తన అల్లుణ్ణి చేస్కోవాలనుకున్నాడు. కుర్రాడికి అప్పటికి తిరగడం తప్ప మరో ఉద్యోగం లేదు. అతని జాతకాన్ని జోగయ్యపంతులుగారికి చూపించి, యీ కుర్రాడు ముందు ముందు ప్రయోజకుడు అవుతాడో, లేదో కాస్త చూసి చెప్పమన్నాడు. పంతులుగారా జాతకాన్ని నాలుగుసార్లు పరీక్షించాడు. ఆయనేం చెప్పినా డబల్ మీనింగ్‌లోనే చెప్తాడు తప్ప తిన్నగా చెప్పడు. ఈ సూరిబాబు ఎప్పటికైనా ఆంధ్రాలోని ఆడియన్స్‌కి సినిమాలు చూపించేవాడవుతాడని దబాయించి మరీ చెప్పాడు. సినిమాలు చూపించేవాడు డైరెక్టర్! డైరెక్టరంటే దర్శకుడు! మార్గదర్శి అంటే మార్గాన్ని చూపించేవాడు కాబట్టి.. సినిమా దర్శకుడంటే సినిమా చూపించేవాడనే అర్థం చెప్పుకోవాలి అని తనలో తనే అర్థాలు, తాత్పర్యాలు చెప్పుకు

న్నాడు. పెళ్లయేనాటికి ఏ ఉద్యోగం లేక పోయినా, పెళ్లయ్యాక జాతకరీత్యా సినిమా డైరెక్టరు ఉద్యోగం వెదుక్కుంటూ వస్తుందనే నమ్మకంతో పెళ్ళి జరిపించే శాడు. పెళ్లయిన రెండునెల్లదాకా, కొండమ్మ దగ్గరకి వచ్చిన వాళ్లంతా "మెద్రా సొస్తే మాకు సినిమా యాక్టర్లనీ, షూటిం గునీ చూపిస్తావా? " అని అడిగేవారు.

"మా ఆయన సినిమా డైరెక్టరవుతాడు కాబట్టి, సినిమా యాక్టర్లనే మాయింటికి పిలిపించి మీకు చూపించేస్తాను" అన్చె ప్పేది కొండమ్మ.

మూడోనెల గడుస్తుండగా సూరిబాబుకి

## కొత్తగాలి...

**అప్పుడు**
**తోకాడిస్తూ వస్తే కుక్క**
**ఓ నేస్తం, ఓ నెయ్యం**
**ఇప్పుడు**
**'రేబిస్' దెయ్యం.. భయ్యం**

– పాయసం సుబ్రహ్మణ్యా మహర్షి, నెల్లూరు

విశాఖపట్నం పూర్ణాథియేటర్లో కేబిన్‌లో ప్రొజెక్టర్ నడిపే ఆపరేటరు ఉద్యోగం వచ్చింది.

కొండమ్మ తండ్రి జోగయ్య పంతులు మీద కస్సుమంటూ లేచి "ఏంటండీ! మా అల్లుడు సినిమా డైరెక్టరవుతాడని మీరు చెప్పారు. కానీ, ఆడు చూస్తే సినిమాహాల్లో ఆపరేటరు ఉద్యోగంలో సెటిలైపోయాడు. మీ జ్యోతిషం ఎందుకిలా ఉల్టాపల్టా అయి పోయింది" అని అడిగాడు.

జోగయ్య ఫక్కుమంటూ ఓ దిక్కుమా లిన నవ్వు నవ్వి "మీ అల్లుడికంత సీన్ లేదు. సినిమాహాల్లో ప్రొజెక్టరులో రీల్స్ పెట్టి, తెరమీద బొమ్మేసి ప్రేక్షకులకి చూపి స్తాడు కదా ఆపరేటరు? నేన్చెప్పిందీ అదే! నీకొచ్చిన డౌటు గురించి అప్పుడే అడి గుంటే నేనే సందేహ నివృత్తి చేసేవాణ్ణి. కానీ, పెద్ద పండితుల్లా నీకు నువ్వే అర్థాలు, తాత్పర్యాలు చెప్పేసుకుని అతితెలివి ప్రద ర్శించావు" అన్నాడు.

ఈ సంఘటన జరిగిన రెండునెల్ల తర్వాత మరో సంఘటన జరిగింది. ఓ రోజు కొండమ్మ, సూరిబాబు గుడికి వెళ్లి వస్తుండగా, సూట్ వేసుకున్న తెల్లగా, సన్నగా వున్న ఓ ముసలాయన రోడ్డు దాటుతున్నాడు. ఎదుట్నించి స్పీడ్‌గా లారీ వస్తోంది. ఆ ముసలాడు సరిగా రోడ్డు మధ్యనున్నాడు. అది చూసిన సూరిబాబు పరుగెత్తుకుంటూ వెళ్ళి, ఆ ముసలాయన్ని విసురుగా ఓ పక్కకి లాగెయ్యకపోతే, అతను లారీ కింద పడి చచ్చేవాడే! ఆ ముసలాయన రెండుమూడు వాక్యాలకంటే ఎక్కువ మాట్లాడలేదు. ఆ మాటల్లో ఒకటి తేంక్స్ చెప్పడంకాగా, మిగతా మాటలు సూరిబాబు వుండే అడ్రస్ గురించి అడగ డమే! అంతే తప్ప ఆ ముసలాడు సూరిబా బుకేం డబ్బివ్వలేదు. ఇలా ప్రాణరక్షణ చేసిన నేలబారు మనుషులకి గొప్పింటి వాళ్లు బోలెడంత డబ్బివ్వడం, కొండమ్మ కొన్ని సినిమాల్లో చూసింది. కానీ, అలాంటి సీన్లు సినిమాల్లోనే వుంటాయి తప్ప నిజజీవితంలో వుండవేమోనని యీ సీన్ చూశాక అనుకుంది. దూరంగా పార్క్ చేసిన తన కారు దగ్గరకి వెళ్ళిపో యాడా ముసలాయన.

మర్నాడు సూరిబాబుండే చిన్నపాటి యింట్లోకి ఓ అందమయిన, ఖరీదయిన యువతి వచ్చింది. ఆమె షికారుకొచ్చిన శ్రీమహాలక్ష్మిలా కనిపిస్తోంది. ఆమె వయసు యిరవైదాటినా పాతికలోపే వుంటుంది. ఆ అమ్మాయి పేరు ఉష. ఆమె నిన్న రోడ్డుమీద కనిపించిన ముసలా

యన తరపున వచ్చింది.

ఆ విషయం వచ్చిన ఆ అమ్మాయి చెప్పాక కొండమ్మ ఆమె కూర్చోడానికి ముక్కాలిపీట వేసింది. "నిన్న మా ఆయన ప్రాణాలకి తెగించి, మీ తాతగారిని కాపాడుండకపోతే..."

ఆ మాటలు పూర్తవకముందే "షటప్" అని అరిచింది ఉష. "ఆయన మా తాతగారు కాదు, నా హజ్బెండ్. నిన్న మీ ఆయన చేసిన సాయానికి ప్రత్యుపకారం చేద్దామనుకున్నారట, కానీ, దగ్గర చెక్కుబుక్కు లేకపోవడం వలన ఏమీ యివ్వలేకపోయారట. అందుకే, మీరెంత అడిగితే అంతా యిమ్మని చెప్పి నన్ను పంపించారు. చెప్పండి. మీకెంత కావాలి?" ఎక్కడా ఆగకుండా ఉష దడదడమని అడిగేసింది.

ఆమె చూస్తే మహాధనవంతురాల్లా వుంది. మరీ వందా, రెండొందలు అడిగితే నామోషీగా వుంటుంది. అలాగని రెండు వేలు మూడు వేలు అడిగేస్తే, వీళ్లకి ఆశ ఎక్కువనుకుంటుంది. అంచేత, ఎంత అడగడమాని ఆలోచించుకుంటూ వుండగానే ఉషే మళ్లీ అసహనంగా అడిగింది.

"ఎంత కావాలంటే చెప్పరేం? చెప్పండి. పదివేలు కావాలా? పాతికవేలా?"

అంతే! ఆ దంపతులిద్దరి మనసులకి కరెంట్ షాక్ కొట్టినట్టు గిలగిల్లాడిపోయారు. ఆరంభంలోనే పాతిక వేలదాకా ఉష వెళ్లిపోయింది. ఓ వెయ్యి అడిగితే బాగుంటాదేమో ననుకునేవాళ్లకి పాతికవేలనే మాట నివ్వెరపాటుని కలిగించింది.

"నాకు వేరే పనుంది. మీ దగ్గర యింతసేపు ఉండలేను. ఎంత కావాలంటే మాట్లాడరేం? నేనే ఫైనల్ ఫిగర్ చెప్తాను. రెండు లక్షలు.. ఓకేయేనా?" అంది ఉష.

మొగుడూ పెళ్లాలకి కళ్లు బైర్లు కమ్మినట్టయింది. రెండు లక్షలనే మాట చెవుల్తో వినడమే తప్ప యింతవరకు కళ్లతో చూడలేదు. తమ జీవితంలో అంత డబ్బుని చేత్తో పట్టుకుని చూళ్లేదు. ఇప్పుడా అవకాశం వచ్చింది. రెండు నిమిషాలు టైమ్ ఇమ్మని చెప్పి, సూరిబాబుని ఓ మూలకి లాక్కుపోయి, కొండమ్మ గొంతు తగ్గించి మాట్లాడింది. "ఈవిడకి బోలెడంత డబ్బే కాదు, మొగుడిమీద ఒల్లమాలినంత ప్రేమ కూడా వున్నది. లేకపోతే, మొగుణ్ణి రక్షించినందుకు ఓ అయిదొందలో, వెయ్యో చేతిలో పెట్టి వెళ్లిపోకుండా ఏకంగా రెండు లక్షలు యిచ్చేస్తానంటాదా? మనం యింకొంచెం ఓరిస్తే యింకా ఎక్కువే యిచ్చేస్తాది. దాంతో దరిద్రం తీరిపోద్ది"

సూరిబాబు ఆ మాటలకి ఒప్పుకోకుండా "మరీ అత్యాశకి పోవడం మంచిది కాదేమో" అని సణిగాడు.

"ఇది అత్యాశే కాదు. ఎదుటివాళ్ల మన స్తత్వాన్ని యిలాచూస్తే అలా కనిపెట్టేసే శక్తి నాకుంది కాబట్టి ఎంత తెలివిగా, ఓ పది పదిహేను లక్షలు రాబడతానో నువ్వే చూడు" అన్చెప్పి భర్తని తీసుకుని ఉష దగ్గరకి వెళ్లింది.

"అమ్మగారూ, మీ అంతటి మనుషులు మాలాంటోళ్ల యింటికి రావడమే చాల్చాలు. మీకెంత కావాలని మీరు అడ

**కొత్తగాలి...**

**పగలు, రాతిరి**
**కాలచక్రం**
**సుఖము, దుఃఖమూ**
**జీవనచక్రం**

– కె.ఎస్. ఆచార్యులు,
విజయనగరం

గడం.. మాకింత కావాలని మేం చెప్పడం ఏమీ బాగోదు. అంచేత నేనోమాట చెప్పాలనుకుంటున్నాను" అంది.

"ఏంటది? "

"మీ దృష్టిలో మీ ఆయనగారి విలువెంత అనుకుంటున్నారో, అంత విలువనీ డబ్బు రూపంలో మాకిప్పించండి"

ఉష రెండు క్షణాలపాటు ఆలోచించి, కొండమ్మచేత ఆ మాటని మరోసారి చెప్పించుకుంది. కొండమ్మ అక్షరం పొల్లు పోకుండా ఆ మాట మళ్లీ చెప్పింది.

"మీరు బాగా ఆలోచించుకునే యీ కోరిక కోరుతున్నారా? "

"ఒకటికి వెయ్యిసార్లు ఆలోచించుకునే కోరుతున్నాను"

ఉష తన పర్సు తెరచి ఓ కాయిన్ తీసి కొండమ్మ చేతిలో పెట్టింది.

కొండమ్మ నివ్వెరపోయి "ఇదేటండీ ఏభై పైసలు చేతిలో పెట్టారు? " అడిగింది.

ఉష బుసలు కొడుతున్న ఆడనాగులా కొండమ్మ వైపు చూసింది.

"మా ఆయన్ని రక్షించినందుకు మీకెంత కావాలని అడిగితే మీరేం చెప్పారు? మీ దృష్టిలో మీ ఆయనగారి విలువెంత అనుకుంటున్నారో, అంత విలువనీ కేష్ రూపంలో మీకిమ్మన్నారుగా! అందుకే... నా దృష్టిలో మా ఆయన విలువ కేవలం ఏభై పైసలు. అందుకే, మీకా ఏభై పైసలే యిచ్చాను"

కొండమ్మ రివరివలాడిపోతూ "క్షమించండి. మీ దృష్టిలో మీ ఆయన విలువ మరీ యింత చీప్ అని తెలీక అడిగేశాను. దయచేసి నా మాటల్ని చెరిపేసి, మొదట మీరు చెప్పిన ఆ రెండు లక్షలే యిప్పించెయ్యండి" అంది వినయంగా.

"ఇప్పించను. ఎందుకు యిప్పించాలి? ఆ ముసలాడికి వందకోట్ల ఆస్తి వుంది. వాడు ఛస్తే, ఆ ఆస్తంతా నాకే దక్కుతుంది. ఆ డబ్బుతో నేనూ నా బోయ్ ఫ్రెండు మనోహర్ హ్యాపీగా బతికేయొచ్చనుకున్నాను. కానీ, యిప్పుడా ముసలాడి వయసు డెబ్బయ్ అయిదయితే, మరో పాతికేళ్లు గ్యారంటీగా బతుకుతాడని జ్యోతిష్యులు చెప్పారు. అంతవరకు మేం వెయిట్ చెయ్యడం కష్టమని చెప్పి, నిన్ననే ఓ లారీ డ్రైవర్కి పాతికవేలు డబ్బిచ్చి, లారీ ఏక్సిడెంట్ జరిపించి ఆ ముసలాణ్ణి లేపెయ్యడానికి ప్లాన్ చేశాను. కానీ, నీ మొగుడు పెద్ద సూపర్మేన్లా వచ్చి, ఆ ముసలాణ్ణి సేవ్ చేసి నా ప్లాన్ అంతా పాడు చేశాడు. అయినా, ఆ ముసలాడు చెప్పాడు కదాని వచ్చి, మీకు రెండు లక్షల దాకా ఆఫర్ యిచ్చాను. కానీ, మీరు అతి తెలివికిపోయి, మొదటికే మోసం తెచ్చుకున్నారు" అన్చెప్పి వెళ్లిపోయింది.




కొన్ని రోజులు గడిచాయి.

వస్తుందీ వస్తుందీ అనుకున్న ప్రియాంక రాయుడింటికి రాలేదు. కానీ, ఇంతవేగంగా రారనుకున్న మాధవరావు, కృష్ణవేణి ఏలూరు నించి వచ్చారు. వాళ్లిద్దరు భార్యాభర్తలు. ఏడాది క్రితం ఏలూరు నించొచ్చి వాళ్లబ్బాయికి కాంచననిచ్చి పెళ్లిచేయడానికి కొండమ్మ అండ్ ఫ్యామిలీతో మాట్లాడుకున్నారు. రెండు లక్షల కట్నం ఇవ్వడానికి, అమ్మాయి చదువు పూర్తవగానే పెళ్లి చేయ

డానికి నిశ్చయించుకున్నారు. పెళ్లి ముహూర్తాల గురించి ఇన్నాళ్లూ ఎందుకు రాలేదంటే.. కాంచనకి ఇంకా చదువు పూర్తవలేదు కాబట్టి..

"ఇప్పుడెందుకొచ్చారు? "

ముహూర్తాల గురించి మాట్లాడ్డానికి కాదు... కట్నం గురించి మాట్లాడ్డానికి! ఏడాది క్రితం వచ్చినప్పుడు రాయుడు క్లాస్ త్రీ ఎంప్లాయీ అని చెప్పారు. అద్దె కొంపలో ఉంటున్నామన్నారు. కానీ, ఇప్పటి పరిస్థితి ఏంటి? రాయుడు రీజినల్ మేనేజర్ అయ్యాడు. మధురవాడలో బంగళా కట్టిస్తున్నాడు. ఇంటిముందు కారుంది. ఇంట్లో పనిమనిషి ఉంది. లక్షల్లో ఆదాయం వుంది. కావున.. పది లక్షల కట్నం, ఓ కారు, కడుతున్న బంగళాలో ఓ పోర్షను, అమ్మాయి పేర్న రాయాలి. ఇవీ వాళ్లు కోరిన కోరికలు. ఆ కోర్కెలు నెరవేర్చకపోతే ఈ పెళ్లి జరగదని వాళ్లు చేసిన హెచ్చరిక!

వాళ్ల హెచ్చరిక విన్న పద్మావతి పెద్దగా స్పందించలేదు.

రాయుడు కంగారుపడ్డాడు.

ముఖ్యంగా కొండమ్మ దడదడమంటున్న గుండెని చిక్కబట్టుకుని కొడుకు, కోడలివైపు చూసింది.

వాళ్లిద్దరూ "ఉత్తుత్తినే మీకెవరో చెప్పారు. నాకు ప్రమోషన్ రావడం ఉత్తుత్తినే! బంగళా కట్టించడమూ ఉత్తుత్తినే!" ఇలా ఆ దంపతులు అన్ని విషయాలు ఉత్తుత్తినే అని చెప్పినా, మగపెళ్లివారు నమ్మలేదు.

"అన్నీ ఉత్తుత్తినే అయితే, ఇంటి ముందుకి కారెలా వచ్చింది? ఇంటి తలుపుకి రీజినల్ మేనేజర్ బోర్డెలా వచ్చింది? ఇవన్నీ ఉత్తుత్తినే అయితే, మీ పక్కింటి వాళ్లకి, ఎదురింటివాళ్లకి స్వీట్ పేకెట్లు పంచిపెట్టి మరీ, ఎందుకు పబ్లిసిటీ ఇచ్చారు? పైగా, మీకు రెండేళ్ల క్రితమే ప్రమోషన్ వచ్చిందని వాళ్లకి చెప్పారు. కానీ, మేం లాస్ట్ ఇయర్ వచ్చినప్పుడు మీరింకా క్లాస్ త్రీ ఉద్యోగంలోనే వున్నానని చెప్పారు. మీరు అబద్ధం చెప్పినా, లోకులు అబద్ధం చెప్పరుగా" మాధవరావు స్వరం పెంచే మాట్లాడుతున్నాడు.

రాయుడికి ఈ సీన్ ఏంటో అర్థం కాక "ఇంతకీ, ఈ విషయాలు ఏలూరులో వున్న మీకు చెప్పిన అడ్డగాడిదెవడండీ? " అని అడిగాడు.

"ఇంకెవరండి? మీ ఎదురింట్లో వుండే ఆదినారాయణ. కిందటి ఏడాది మేం వచ్చినప్పుడు మా ఫోన్ నెంబరు తీసుకున్నాడు. మొన్నామధ్య మీవాళ్లు స్వీట్ పేకెట్లు ఇచ్చి మరీ మీ ప్రమోషన్ గురించి చెప్పారట. మంచి విషయం ప్రచారం చెయ్యడానికి ఆయన కంకణం కట్టుకున్నాడట. అందుకే, ఈ మంచి విషయం గురించి ఫోన్‌చేసి మరీ నాకు చెప్పాడు. ఇప్పుడు మేం చెప్పిన కట్నకానుకలు ఇవ్వడానికి ఇష్టపడితే మాకో ఫోన్ కొట్టండి. ముహూర్తాలు పెట్టుకుందాం. లేదంటే, గతంలో మనం అనుకున్న ఒప్పందమంతా ఉత్తుత్తినే అనుకుని మర్చిపోండి" అన్చెప్పి ఆ దంపతులు వెళ్లిపోయారు.

కొండమ్మకి శివాలెత్తిపోయి కొడుకునీ కోడల్నీ మాటలతో చెండాడి ఎండగట్టింది.

"మీరు మీ చెల్లెలి పెళ్లి ఎలాగూ చెయ్యలేరని, నేనే నానాతంటాలు పడి ఆ ఏలూరు సంబంధం కుదిర్చాను. మీరేమో దిక్కుమాలిన ఫాల్స్ ప్రిస్టేజ్‌కి పోయి గేస్ కబుర్లు ప్రచారం చేశారు. స్వీట్ పేకెట్లు పంచి మరీ ప్రచారం చేశారు. మన ఎదురింటోడు మీరిచ్చిన స్వీట్ తింటూనే, ఏలూరుకి ఫోన్ చేసి మరీ చెప్పాడు. వాళ్లొచ్చి మన నెత్తిన పిడుగు పడేశారు. ఎవరో ప్రియాంక ఈ ఇంటికొ

నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం..

## శ్రీపాదవారి సూటిదనం!

నిన్నటి నిజం

శ్రీపాదవారి చారిత్రక నవల 'వీరపూజ' ముద్రణకు- 'దేశోద్ధారక' కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు వెనుకడుగు వేయాల్సిన పరిస్థితి తలెత్తిన రోజులవి. మొదటి ప్రపంచ యుద్ధం ముమ్మరంగా జరుగుతున్నప్పుడు ఆ పుస్తకంలో యుద్ధానికి సంబంధించిన ఆక్షేపణలు ఉన్నాయి. అందువల్ల ఆ గ్రంథాన్ని నిశితంగా పరిశీలించడం కోసం చెన్నాప్రగడ భానుమూర్తికి పంపించారు. చెన్నాప్రగడ వారికి అయిదు రాత్రులు పట్టింది ఆ పుస్తకం పరిశీలించడానికి. నాలుగో రోజు సాయంత్రం శ్రీపాదవారు వెళ్లేటప్పటికి- అక్కడ రాయప్రోలు సుబ్బారావు కూర్చుని ఉన్నారు.



భానుమూర్తి వారిద్దరికీ పరస్పరం పరిచయం చేయించారు. లోకాభిరామాయణం సాగుతున్న ఆ సందర్భంలో శ్రీపాద- రాయప్రోలువారల సంభాషణ టాగూరుతో ప్రారంభమై గాంధీవద్దకు వచ్చింది. 'గాంధీగారు నేటాలు నుండి వచ్చాక మనదేశం కొత్త దారిన పడుతుంది' అని రాయప్రోలువారు అన్నారు. 'ఆ కొత్తదారి పెడదారి అవుతుంది' అని శ్రీపాదవారు వాదించారు. ఎవరి కారణాలు వారు చెప్పుకున్నారు. ఆ తర్వాత రాజమహేంద్రవరంలో అఖిలాంధ్ర కవిపండిత పరిషత్తు జరిగినప్పుడు అధ్యక్షునిగా రాయప్రోలువారిని పెట్టేందుకు శ్రీపాదవారు వ్యతిరేకించారు. రాయప్రోలువారెంత గొప్పవారైనప్పటికినీ సాహిత్య రంగంలో కొద్దికాలంగా మౌన ముద్రాంకితులై వున్నారనీ, కొందరు సమర్థులైన కొత్త వారు చొచ్చుకువస్తున్నారనీ, అటువంటి వారిని పెడదామని ఆయన సలహా ఇచ్చారు. శ్రీపాదవారి మాటను ఆ సమితివారు వినలేదు. అయినా శ్రీపాదవారు ఏ సందర్భంలోనూ తమకేర్పడిన అభిప్రాయాల్ని ఇష్టమైన రీతిలో మార్చుకునేవారు కాదు. పైగా గౌరవంగానే నిక్కచ్చిగా తమ భావాల్ని, అభిప్రాయాల్ని చెప్పేవారు. ఖద్దరుపై శ్రీపాదవారికి నమ్మకం లేదు. స్వపరిపాలనాధికారం సంపాదించే యోగ్యత ఖద్దరులో లేదనీ, పైగా దేశీయుల్లో విభేదాలకు రూపకల్పన చేసే శక్తి దానికుందనీ వారి నమ్మకం. శ్రీపాదవారి ఈ నిర్భీకత, సూటిదనం సాహిత్య రంగంలో అజారామరం, చిరస్మరణీయం.

నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం..

చ్చినప్పుడు చూపించడానికి అప్పుచేసి కారు కొనేసినా ఆవిడింకా రాలేదు. కానీ, ఏనాడో కుదుర్చుకున్న సంబంధం మాత్రం ఉస్కో అయిపోయింది" కొండమ్మ ఫుల్‌స్టాప్ లేకుండా మాట్లాడుతోంది.

పద్మావతి చాలాసేపు విన్నాక, ఒక్కమాటతో పరిష్కారాన్ని చెప్పేసింది.

"ఏది జరిగినా మన మంచికే అని నువ్వేగా పదేపదే చెప్తుంటావు. ఈ సంబంధం పోవడం కూడా అలాగే అనుకో. ఒకట్రెండు నెలల్లో మీ అబ్బాయికి ప్రమోషన్ వచ్చేస్తుంది. ఆ తర్వాత రెండు మూడు నెలల్లో మరో సంబంధం చూస్తాం. ఆ తర్వాత నాలుగైదు నెలలకి పెళ్లి చేసి పారేస్తాం. బస్! అనవసరంగా సణుగుడు ప్రోగ్రామ్ పెట్టి, నా బుర్ర తినెయ్యకు"

కొండమ్మ ఆ తర్వాత మాట్లాడకపోవడానికి కారణం.. కాంచన పెళ్లి బాధ్యతని కొడుకూ కోడలూ స్వీకరించడం కాదు. వాళ్లతో వాదించినా, మొత్తుకున్నా వాళ్లు 'ప్రియాంక ఫోబియా' నుంచి ఇంత వేగం బయటపడరని అర్థమయ్యే మాట్లాడ్డం ఆపింది.

★ ★ ★

గడియారంలో గంటల ముల్లులా రోజులు మెల్లగా ముందుకు నడుస్తున్నాయి. ప్రియాంక నుంచి ఫోన్లు వస్తున్నాయి, కానీ మనిషి రావటం లేదు.

ఓ రోజు జగన్నాథంపంతులు ముక్కుపొడి దట్టిస్తూ, వెకిలిగా నవ్వుకుంటూ రాయుడు ఇంటికి వచ్చి, ఇంటి ముందున్న కారుని, ఇంటిని మార్చి మార్చి డిఫరెంట్ ఏంగిల్స్‌లో చూస్తుంటే లోపల్నించి పద్మావతి వచ్చి, అతన్ని లోపలికి తీసుకెళ్లింది. అతన్ని కూర్చోబెట్టి మజ్జిగ యిచ్చాక వంట గదిలో వున్న కొండమ్మని పిలిచాడు

"ఇహ్హిహ్హిహ్హి... కొండమ్మగారూ, ఆ రోజు నేను జాతకం చూసి మీ కొడుకూ కోడలూ పరుగుల మీద పరుగులు తీస్తారమ్మా అంటే మీరు నమ్మలేదు. కానీ, ఇప్పుడు పరుగులు తీశారా? లేదా? " అని అడిగాడు. కొండమ్మ తన మనసులోని కోపానికీ, ఛీత్కారానికీ మాటల రూపం ఇచ్చింది.

"ఎందుకు తియ్యలేదండి? కారు కొంటానికి అప్పులోడి దగ్గరకి పరుగులు తీశారు. వీళ్లు కొట్టిన గేస్ బెడిసికొట్టి మగపెళ్లివారు మా సంబంధం వదిలేసుకున్నారు. ఇక మీద వీళ్లెక్కడికి పరుగులు తీస్తారో? "

పద్మావతిగారికి అత్తగారి మాటలు ఎప్పుడూ నచ్చనట్టే, ఇప్పుడూ నచ్చలేదు. అంచేత, ఆ మాటల గురించి పట్టించుకోకుండా అడిగింది.

"పంతులుగారూ, ఇందాక బైట నిలబడి మా యింటిని, మా కారుని మార్చి మార్చి చూశారు, దేనికి? "

"మరేం లేదు. మీ కారుకీ, ఈ యింటికీ వాస్తు ప్రకారం మేచ్ అయిందా? లేదా? అని చూశాను"

"మేచ్ అయిందా? " ఎంతో ఆసక్తిగా అడిగింది పద్మ.

"వ్చ్! అవలేదు. ఆ కారు చూస్తే పుష్పక విమానంలా వుంది. ఇల్లు చూస్తే... సూపర్‌సైజ్ చెత్తకుండీలా వుంది. మీ ఇంటికీ, మీ కారుకీ మేచ్ అవకపోతే, మీ లైఫ్ ఎప్పటికీ కొయ్యగుర్రం మీద ప్రయాణమే. అంటే, ఏంటో అర్థమయిందా? కొయ్యగుర్రం నిల్చున్నచోటే వూగుతుంది తప్ప ముందుకు మాత్రం వెళ్లదు"

పద్మావతి ఆలోచించి "అద్దింటికి వాస్తు ప్రభావం ఉండదంటారుగా? " అంది.

"ఎహ్హెహ్హె.. ఏంటమ్మా చదువుకున్నవారై ఉండి కూడా అలా మాట్లాడతారు? అద్దె కారులో వెళ్తే యాక్సిడెంటు జరగదా? సొంతకారులో వెళ్తేనే జరుగుతుందా? "

వారి సంభాషణ వాస్తు గురించి, కొత్త ఇంటి గురించీ సాగుతుంటే కొండమ్మలో ఓ కొత్తభయం ప్రవేశించింది. ఆ భయమే ఆమెచేత మాట్లాడించింది. "చూడండి పంతులుగారూ, ఇప్పటికే ఈ మొగుడూ పెళ్లాల కోరికలు పిచ్చెక్కిన గుర్రాల్లా పరుగులు తీస్తున్నాయి. మీరిప్పుడు ఇల్లు బాగులేదని చెప్తే, ఎక్కడో అప్పుచేసి ఆ యిల్లు కొనేస్తారు. అప్పుడొచ్చి మీరేం అంటారు? ఇల్లూ బెష్టు, యింటి ముందున్న కారూ బెష్టు.. కానీ ఆ రెండూ వున్న ఇంట్లో ఆ ముసలమ్మ వుండడమే వరస్ట్ అంటారు. అంచేత, మీరికమీదట మా వాళ్లకి జాతకాలు చెప్పి పరుగులు తీయించకండి"

పంతులుగారి దగ్గరున్న సెల్ ఫోన్ మోగకపోతే కొండమ్మ ఇంకా ఏం అనేదో, పంతులుగారు ఏం చెప్పేవారో గానీ, ఆయన ఫోన్‌లో మాట్లాడుకుంటూ బైటకి వెళ్లిపోయాడు.

★ ★ ★

రాయుడు కారు కొన్నాడన్న మాటేగానీ- దానిలో ఒక్కరోజూ ఆఫీస్‌కి వెళ్లలేదు. ఇంటికి కారు వచ్చేసిన మర్నాడే ఆఫీసుకి కారులో వెళ్లమని ప్రోత్సహించినా, అతను

వెళ్లలేదు. వాళ్ల జియ్యమ్‌గారు చేసేది పెద్ద ఉద్యోగమే అయినా, కొన్ని విషయాల్లో అతని ఆలోచనలు అధమస్థానంలో వుంటాయి. అతను దిక్కుమాలిన టైపు బట్టలు వేస్కోవడంతో పాటు, తన ఆఫీసులో పనిచేసేవాళ్లు కూడా అంతకంటే హీనమైన బట్టలేస్కోవాలని ఆశిస్తాడు. అలా కాకుండా ఎవరైనా కాస్త షోగ్గా తయారై వస్తే వాళ్లని ఎగాదిగా చూసి, ఏదో ఒకటి కామెంట్ చేస్తాడు. అలాంటి సంకుచిత స్వభావుడి దగ్గరకి రాయుడు కారులో వెళ్తే, ఆఫీసులోనే నేలమీద పడి దొర్లిదొర్లి ఏడుస్తాడు. ఈ విషయం రాయుడికి తెలుసు. అందుకే ఆఫీసుకి కారు తీసుకువెళ్లడం లేదు.

"ఆఫీసర్‌కి జడిసి కారుని ఇంటిముందే పెట్టుక్కూర్చుంటే, శివాలయంలో వుండే నందీశ్వరుడికీ, మన కారుకీ వున్న తేడా ఏంటీ?" అని పద్మావతి అడిగింది.

తమకి కారున్న సంగతి కాశ్మీర్ బోర్డర్ దాటి పాకిస్థాన్ అంతా పాకకపోయినా, కనీసం రాయుడు పనిచేసే ఆఫీస్ వరకైనా వెళ్లాలి కదా! ఇదీ పద్మావతి ఆవేదన!

"మా ఆఫీసరు శెలవు పెట్టినప్పుడు ఆఫీసుకి కారులో వెళ్లి మా స్టాఫ్ అంతట్నీ ఆశ్చర్యంలో ముంచేస్తాను" అని భార్యకి భరోసా యిచ్చాడు రాయుడు.

ఆ భరోసాని నిలబెట్టుకునే అవకాశం వచ్చింది. ప్రస్తుతం ఆఫీసరుగారు ఆలోచిస్తున్నది ఎవరికి బ్రాంచ్ మేనేజరు ప్రమోషను ఇవ్వాలని కాదు. గోడౌన్లో వరసగా దొంగతనాలు జరిగిపోతున్నాయి. కానీ, పోలీసులు ఆ దొంగని పట్టుకోకపోగా, ఆ దొంగని పట్టుకోవలసిన బాధ్యత కూడా తనదేనంటున్నాడు. ఇంటి దొంగని ఇంత వరకు పసిగట్టలేదన్న బాధతో తల బాదుకుంటున్న తరుణంలో సడన్‌గా మూడు రోజులు శెలవు పెట్టాల్సిన అవసరం ఏర్పడింది. ఆయన మరదలుకి గుంటూరులో వివాహం జరుగుతోంది. ఆ పెళ్లి జరిపించాల్సిన పెద్ద తలకాయ కూడా తనే! తను లేనప్పుడు ఆఫీసు నిర్వహణ బాధ్యతంతా రాయుడే చూస్కోవాలని కూడా చెప్పాడు.

ఆఫీసరు శెలవుపెట్టి మరో వూరు పెళ్లికి వెళ్తున్నాడని రాయుడు పద్మావతికి చెప్పగానే, ఆమె కప్‌బోర్డ్‌లో నుంచి పెళ్లినాటి సూట్ తీసి ఇస్త్రీ చేయించింది.

"ఇదెందుకు?" అని యిబ్బంది పడుతూనే అడిగాడు రాయుడు.

## సమయస్ఫూర్తికి జేజేలు!

రాజమండ్రిలో పాండవ నాటకం ప్రదర్శిస్తున్నారు. అప్పటికే పింగళి లక్ష్మీకాంతం, అతని అన్న నర్సయ్య చాలా నాటకాల్లో నటించారు. నాటకం మధ్యలో స్టేజీకింద హడావుడిగా తిరుగుతున్న పింగళిని చూచి ఒకాయన, 'ఎవరు నాయనా నీవు? ఇలా తిరుగుతున్నావు?' అని చిరాకుగా అడిగారు.



దానికి పింగళిగారు స్టేజీ పైనున్న భీమ పాత్రధారియగు తన అన్నవైపు చూపిస్తూ...

'వీర రసావతారుడని
విశ్రుతి కెక్కిన నాటకుండు వా
శ్చూరుడు మాన్యసింహునకు కూరిమితమ్ముడ!
వీరశోకశృంగారరస ప్రధానముల
నాయకవేషధరుండ, సత్కవిన్,
పేరున కేను కాంతుడ
పవిత్రపు పింగళి వంశజాతుడన్'

అని ఆశువుగా పలికారు. దాంతో అక్కడున్న పండితులందరూ పింగళి సమయస్ఫూర్తికి సెభాష్ అని మెచ్చుకున్నారు.

"ఎందుకేంటి? రోజూ మీరు ఆఫీసుకి కారులో వెళ్తున్నారా? లేదు. సూట్ రెగ్యులర్‌గా వేసుకుంటున్నారా? లేదుగా.. కానీ అరుదుగా ఆఫీసుకెళ్ళే కారులో అరుదుగా వేసుకునే సూట్ వేసుకుంటే.. అదో అరుదైన కాంబినేషన్" అంటూ రాయుడిచేత సూట్ తొడిగించింది. అప్పుడప్పుడు పెట్టుకునే కూలింగ్ గ్లాసులు అందించింది. రాయుడు కారు స్టార్ట్ చేసి ముందుకొస్తుంటే, ఆమె ఎదురొస్తూ ఓ ముఖ్య విషయం చెప్పింది. "కారు ఖరీదెంత? అని ఎవరడిగినా నాలుగు లక్షలని చెప్పండి. ఒకవేళ అడక్కపోయినా మీ అంతట మీరైనా మాటల్లోమాటగా, నాలుగు లక్షలనే మాట కూడా చెప్పెయ్యండి"

> **కొత్తగాలి...**
>
> **అబ్బాయి పరీక్ష తప్పుతాడు**
> **అమ్మాయి**
> **నెల తప్పుతుంది**
> **రైలు**
> **పట్టాలు తప్పుతుంది**
>
> – *ఉలి*, జగిత్యాల

"అలాగే.. అలాగే.." అంటూ రాయుడు కారుని ముందుకు పోనిచ్చాడు.

కారు ఆఫీస్ కాంపౌండ్‌లో కొచ్చేసరికి పదిన్నరయింది. ఆసమయానికి అందరూ సిన్సియర్‌గా పని చేసుకుంటూనో, చేస్తున్నట్టు నటిస్తూనో బిజీగా వున్నారు.

కాంపౌండ్‌లో కారు దిగి రాయుడు ఓసారి చుట్టూ పరికించి చూశాడు. ఎవరైనా తనని చూసి ఆశ్చర్యపోయినా.. కనీసం విష్ చేసినా బావుణ్ణనుకున్నాడు. కానీ, ఎవరూ అక్కడ కనిపించకపోవడం వల్ల ఆ కోరిక నెరవేరలేదు. ఆఫీసు హాల్లోకి వెళ్లి, అందరూ తనవైపు చూసేలా రెండుసార్లు గొంతు సకిలించాడు.

అందరూ తలెత్తి చూశారు.

బాబూరావు ఎగతాళిగా నవ్వుతూ "ఏంటండీ, ఇవాళ ఈ ఫ్యాన్సీడ్రెస్? " అన్నాడు.

రాయుడు గతంలోలా వూరుకోకుండా మాటకి మాట విసిరాడు. "ఇది ఫ్యాన్సీ డ్రెస్ కాదు, ఇదే నా ఒరిజినల్ గెటప్. రోజూ ఆఫీస్‌కొచ్చేది మధ్యతరగతి మానవుడనే మారువేషంలో! పబ్లిక్ హాలిడేస్‌లో నేను తిరిగేది నా కారులోనే కాబట్టి, దానికి తగ్గట్టుగా నేనూ తయారవ్వాలిగా" అంటూ అందరికీ తన కారు చూపించడానికి బైటకి రమ్మని కారు దగ్గరికి తీసుకువెళ్లాడు.

బాబూరావు అందరికంటే ఎక్కువ ఇంట్రెస్ట్ చూపిస్తూ కారు దగ్గరికి వెళ్లడానికి కారణం ఉంది. రాయుడి మీద ఆఫీసరుకి చాడీలు చెప్పి ప్రమోషన్ విషయంలో ఓవర్‌టేక్ చెయ్యడానికి ఆ కారు ఉపయోగపడుతుందని అతనికి నమ్మకం కుదిరింది.

ఎర్రటి ఎండలో ధగధగలాడిపోతున్న కారుని చూపించి 'ఎలా ఉంది? ' అన్నట్టుగా కనుబొమ్మలెగరేశాడు రాయుడు.

"కారు కొత్తదా? సెకెండ్ హ్యాండా? " కొలీగ్ వనజ అడిగింది.

"హ్యాండ్ మారిందన్న మాటేగానీ, కొత్త వెహికలే. మా ఫ్రెండుకి సడన్‌గా డబ్బు అవసరం వచ్చి, సింగిల్ పేమెంట్‌లో అయితే నాలుగు లక్షలకి కారు ఇచ్చేస్తానన్నాడు. నేను వెంటనే కేష్ ఇచ్చేసి, కారు తీసేస్కున్నాను" నవ్వుతూ చెప్పాడు.

నాలుగు లక్షలంటే నాలుగు రూపాయల్లా అతను మాట్లాడ్డం అందరికీ ఆశ్చర్యం కలిగిస్తే, బాబూరావుకి మాత్రం అసూయ కలిగించింది.

"మీరు ఆఫీసులో కారు లోన్ పెట్టినట్టు లేరే" త్రినాథ్ అనే కొలీగ్ చేత అడిగించాడు బాబూరావు.

ప్రశ్నించినవాణ్ణి ఓ అమాయకుల్లాగా, ఓ వెర్రి వెంగళప్పలా చూశాడు రాయుడు. "ఆఫ్టరాల్ నాలుగు లక్షల కోసం ఆఫీసులో లోన్లు, వరల్డ్ బేంకి నుంచి అప్పులు చెయ్యాలా? మా ఫ్రెండు అలా అనగానే బీరువాలో నించి నాలుగు లక్షలు తీసి ఇచ్చేశాను.. దట్సాల్"

"మీ బీరువాలో ఎప్పుడూ నాలుగు లక్షలుంటాయా?" బాబూరావు వ్యంగ్యంగానే అడిగాడు.

"నాలుగు లక్షలే వుంటాయని నేను చెప్పలేదే! అందులో ఉన్న డబ్బులో నించి నాలుగు లక్షలు తీసిచ్చానని చెప్పాను. ఇంట్లో అర్జంటు పనుల కోసం ఆ మాత్రం చిల్లర వుంచుకుంటాం గదా"

ఈ మాటతో బాబూరావు మరింత కుతకుతలాడిపోయాడు. "సడన్‌గా కారు కొనాలని ఎందుకనిపించింది?" ఈ ప్రశ్న అడక్కుండా వుండలేకపోయాడు.

"ఎవరైనా కారు ఎందుకు కొంటారో.. నేనూ అందుకే కొన్నాను. రేపు మేనేజరు ప్రమోషన్ వచ్చాక గుంటూరులో ఎలాగూ కొనాల్సిందే కదా! అప్పుడు చేసే పనే, ఇప్పుడు చేసేను. మంచి పని అయినపుడు రేపు చెయ్యాల్సింది ఇవాళే చేయమని పెద్దలు చెప్పేరు గదా"

ప్రమోషన్ గురించి రాయుడు అంత నమ్మకంగా చెప్పేసరికి బాబూరావు గుండె గుబగుబలాడింది. "ప్రమోషన్ మీకే వస్తుందన్న నమ్మకమేంటి?" ఆ ప్రశ్న బాబూరావు అడగలేదు. తన ఫ్రెండు గిరిబాబుతో అడిగించాడు.

"ఆరు తర్వాత ఏం వస్తుంది?" వ్యంగ్యంగా అడిగాడు బాబూరావుని.

"ఏడు"

"కదా! అలాగే ఆఫీస్ సూపర్నెంట్‌గా పనిచేసేవాడికి నెక్స్ట్ వచ్చేది బ్రాంచ్ మేనేజరు ఉద్యోగమే కదా! పైగా నాకు ప్రస్తుతం శుక్రమహాదశ నడుస్తోంది. ఇప్పుడు నన్ను ఎవరు దెబ్బకొట్టాలని ప్రయత్నించినా, అది ఆకాశం మీదకి రాయి విసిరినట్టే అవుతుంది. ఆ రాయి ఎలాగూ ఆకాశానికి తగలదు. పైగా అది తిరిగొచ్చి విసిరినవాడి నెత్తిమీదే పడే ప్రమాదముంది. నా ప్రమోషన్ అదిగో ఆన్ ద వే" అంటూ రాయుడు నవ్వుతూ తన చేతిని ఓవైపు చూపించాడు.

చూపించిన చెయ్యి అలాగే వుండిపోయింది. అతని ముఖంమీద నవ్వు సడన్‌గా ఎగిరిపోయింది. అందుకు కారణం.. ఆ వైపునించి బైక్‌మీద వస్తున్న వ్యక్తి!

అతను.. జియ్యమ్ సుందర్రావు!

ఆఫీసరు శెలవు పెట్టి వూరికి వెళ్ళాడన్న నమ్మకంతోనే కారు తీసుకొచ్చాడు. కానీ, జియ్యమ్ సడన్‌గా ప్రత్యక్షమైపోయాడు. తను టకప్ చేసుకొస్తేనే నఖశిఖ పర్యంతం ఎగాదిగా చూసే ఆఫీసరు.. ఇవాళ సూట్‌లో చూస్తే ఎంత అసూయపడతాడో! ఆఫీసరు కంటపడకుండా మాయమైపోవాలనుకున్నాడు.. కానీ, మాయమవలేకపోయాడు. కనీసం ఎక్కడైనా దాక్కుందామనుకున్నా ఆ కాంపౌండ్‌లో ఆ అవకాశం లేదు.

జియ్యమ్‌గారిని అందరూ నిశ్శబ్దంగా విష్ చేశారు. రాయుడు తన ముఖాన్ని పక్కకి తిప్పుకున్నాడు.

"ఏంటయ్యా అందరూ యిక్కడ నిలబడ్డారు? కొంపదీసి స్ట్రైక్ చేస్తున్నారా?" ఆఫీసరు వచ్చీ రాగానే అడిగాడు.

"ఈ కారు చూడ్డానికి రమ్మని రాయుడు గారు స్వయంగా ఇన్వయిట్ చేస్తే, కొలీగ్ కదాని రాక తప్పింది కాదు సార్" అని బాబూరావ్ చెప్పాడు.

సూట్ వేసుకున్న రాయుణ్ణి చూస్తూ "ఎవరా జెంటిల్మన్?" అన్నాడు.

"ఆయన జెంటిల్మన్ కాదండి.. మన

రాయుడుగారే" ఆ మాటా బాబూరావ్ కాస్త అక్కసుగా అన్నాడు.

"ఆయన రాయుడే అయితే, యీ ఫ్యాన్సీ డ్రెస్సేంటి? "

"అది ఫ్యాన్సీ డ్రెస్ కాదట సార్! ఆయన ఆఫీసు బైట వున్నప్పుడు యీ డ్రెస్ వేసు కుంటారట. సూట్ వేసుకుని ఆఫీసుకొస్తే దిష్టి పెట్టేస్తామని, ఎప్పుడైనా కారులో వచ్చినప్పుడే, యీ డ్రెస్ వేసుకుంటారట"

ఆ రోజు ఆఫీసర్ రావడమే మహా చిరాగ్గా వచ్చాడు. గుంటూరులో పెళ్లి చేస్కోవలసిన మరదలు ఎవరితోనో లేచి పోవడం వలన పెళ్లి ఆగిపోయింది. అలా లేవదీసుకుపోయినవాణ్ణి చంపెయ్యాలనీ, నరికెయ్యాలన్నంత కోపంతో, లీవ్ కేన్సిల్ చేసుకొస్తే ఎప్పుడూ కాలికింద చెప్పులా గుండే రాయుడు ఇక్కడ సూట్ వేసుకుని, సొంత కారులో ఆఫీసుకొచ్చాడని తెలి సింది. తన పేటలో వున్నవాళ్లంతా తన కంటే ముష్టివెధవల్లా వుండాలనుకునే అత నికి తన అండర్లో వున్న రాయుడే యివాళ కింగ్ ఆఫ్ కాంబోడియాలా కనిపించాడు. అతని కడుపులో రేగిన మంటని మరింత ప్రజ్వలింపజేస్తూ బాబూరావు మరికొన్ని చెప్పాడు.

"రాయుడిగారింట్లో చిల్లర ఖర్చుల కోసం దాచుకున్న అనేకానేక లక్షల్లో నించి ఓ నాలుగు లక్షలు తీసి, ఆ కారు కొనేశారట. బహుశా, అనిల్ అంబానీ, ముఖేష్ అంబానీ, లక్ష్మీమిట్టల్ లాంటివాళ్ల బీరు వాల్లో కూడా అంతంత చిల్లర వుండదను కుంటాను.."

ఆ మాట వినగానే ఆఫీసరుకి గతంలో ఇనస్పెక్టర్ శంకరయ్య అందించిన క్లూ గుర్తుకొచ్చింది. గోడౌన్‌లో జరిగిన ఇన్ని దొంగతనాలు ఓ యింటి దొంగే చేస్తు న్నాడు. ఆఫీసులో ఎవరికైతే స్థలాలు, పొలాలు, కార్లు, వేన్‌లు వుంటాయో, వాళ్లే యీ దొంగతనాలు చేస్తున్నట్లు లెక్క...! ఆ ప్రకారం బీరువాలో అనేక లక్షలు చిల్లర ఖర్చుల కోసం దాచుకున్న రాయుడే ఆ దొంగయివుండాలి. ఆ లక్షల్లో నించి ఓ నాలుగు లక్షలు తీసి కారు కొనేసిన రాయుడే ఆ దొంగ అనడానికి యింతకంటే ఏం కావాలి? దొంగతనంలోని నిజాల గురించి తను ఆలోచించడం కంటే, పోలీ సులకే అప్పగించడం మంచిదనిపించి పోలీసులకి ఫోన్‌చేసి, ఇనస్పెక్టరు శంకర య్యకి రాయుడి గురించి చెప్పాడు.

పావుగంట తర్వాత ఇనస్పెక్టర్ శంక రయ్య కానిస్టేబుల్స్‌తో వచ్చేవరకు వాళ్లొ చ్చింది తన గురించేనని రాయుడికి తెలీదు. ఆ కాంపౌండ్‌లోకి పోలీసులు రావడం అదే మొదటిసారి కావడంవల్ల యీ చోద్యం చూడ్డానికి ఆ బిల్డింగ్‌లో పని చేసే మిగతా ఉద్యోగులూ వచ్చారు.

శంకరయ్య ఆఫీసరుగారి చాంబర్‌లోకెళ్లి మాట్లాడాక హాల్లోకొచ్చి నిలబడ్డాడు. ఇండి యాకి అగ్గెట్టేసిన ఇంటర్నేషనల్ ఉగ్రవా దిని పట్టేసినంత హంగామా చేస్తూ అంద రికీ వినబడేలా బిగ్గరగా చెప్పాడు.

"మీ కంపెనీ గోడౌన్‌లో గత మూడు సార్లు దొంగతనం చేసిన గజదొంగ ఎవరో తెలుసా? ఆ మధ్య హైదరాబాద్ లుంబినీ పార్క్‌లోనూ, గోకుల్ చాట్‌లోనూ బాం బులు పెట్టి, నలభై ముగ్గురు మరణాలకి ప్రధాన సూత్రధారి ఎవరనుకున్నారు? ఎక్కడున్నాడు? గంధంచెక్కల దొంగ వీర ప్పన్‌లా అడవిలో దాక్కోలేదు. అంతర్జా తీయ ఉగ్రవాది బిన్‌లాడెన్‌లా అండర్ గ్రౌండ్‌లో దాక్కోలేదు. జనారణ్యంలో, సభ్యసమాజంలో మీ మధ్యనే దాక్కు న్నాడు. ఆ దొంగలకి దొంగే సూట్ వేసు కున్న సురకత్తుల సుబ్బారాయుడు" అంటూ చేత్తో రాయుణ్ణి చూపిస్తుంటే, అందరూ ఆశ్చర్యంగా అతడివైపే చూ

శారు. అందరికంటే ఎక్కువగా ఆశ్చర్యపో యింది... ఆఫీసర్‌గారే!

అతను ఇనస్పెక్టర్ని ఓ మూలకి తీసుకెళ్లి మెల్లగా అడిగాడు "మీరు బాంబులూ గీం బులూ అంటున్నారు, రాయుడు యిన్ని నేరాలు ఎక్కడ చేసాడు? "

శంకరయ్య మీసాలు దువ్వుకుంటూ "ఇది మా పోలీస్ స్టయిలండి. మేం పాతికో, ముప్ఫయ్యో నేరాలు. ఆరోపిస్తే, ఆ నేరస్థుడు గడగడమంటూ వణికిపోతూ, అబ్బెబ్బే, ఆ నేరాల్తో నాకెలాంటి సంబంధం లేద్సార్.. నేను కేవలం యీ గోడౌన్‌లో దొంగతనం ఒక్కటే చేశానని ఒప్పేసుకుంటాడు" అన్చెప్పి శంకరయ్య మళ్లీ హాలు మధ్యకి వచ్చాడు.

రాయుడికి యిదంతా అనూహ్యంగా, అయోమయంగా వుంది. అందరి ముందు తనమీద మోపిన అభియోగం, అవమానా ల్నించి తప్పించుకోడానికి తన తలతీసి ఎక్కడయినా దాచుకోవాలని మనసులో అనుకున్నాడు. కానీ బాడీ నించి తలకా యని ఎప్పుడు కావాలంటే అప్పుడు తొల గించే అవకాశం లేదు కాబట్టి, ఆ పని చెయ్యలేకపోయాడు.

"సార్, నేను దొంగతనాలు చెయ్యలే దండి. మీరు చెప్పిన బాంబు కేసుల గురించి అందర్లాగే నేనూ టీవీల్లో చూసాను.. కొన్ని మిస్సైపోయాను. నేను పక్కా నిర్దోషిని సార్" అన్నాడు ప్రాధేయ పడుతూ రాయుడు.

శంకరయ్య మేకని చూసిన పులిలా చిన్నగా నవ్వి రాయుడి నేరాల గురించి మరికొన్ని వివరాలు చెప్పుకుంటూ పోయా డు. "ఓ సినిమాలో ఫ్యాక్షనిస్ట్ హీరో ఫస్ట్ రీల్లో డాన్స్ మాస్టర్‌గా కనిపిస్తాడు. ఆ తర్వాత వచ్చే ఫ్లాష్‌బ్యాక్‌లో అతను నర్సిం హనాయుడనే ఫ్యాక్షనిస్ట్ అనీ, పాతిక, ముప్ఫైమందిని నరికేసాడని తెలుస్తుంది. మీరంతా ఆ సినిమా చూసారు. చూడక పోయినా ఫర్లేదు.. యీ సుబ్బారాయుణ్ణి చూస్తే చాలు! ఈయనగారు పాకిస్థాన్‌లో ఉగ్రవాది ట్రైనింగ్ పొందిన షేక్ దాల్మియా! ఇక్కడొచ్చాక ఆ అసలు పేరుని చెరిపేసి, సురకత్తుల సుబ్బారాయుడిగా పేరు మార్చుకుని, విశాఖపట్నంలో బాం బులు పెట్టడానికి ప్రయత్నిస్తున్నాడు. ఈ సంగతి నాకు మా ఇంటలిజెన్స్ డిపార్ట్ మెంట్ ద్వారా ఏనాడో తెల్సింది"

అక్కడున్న స్టాఫ్ అంతా వూపిరి బిగపట్టి, రెప్పవెయ్యకుండా రాయుణ్ణే చూస్తూ 'ఇంత కాలం మన మధ్యనున్నది పాకిస్థాన్ ఉగ్ర వాదా?' అని భయంగా అనుకుంటున్నారు.

## కొత్తగాలి...

నేత చరిత
నేర చరిత
దేశ భవిత
రక్త చరిత

– ఎ. సూర్యప్రకాశ్,
నిజామాబాద్

శంకరయ్య కాస్త గర్వంగా మళ్లీ చెప్పడం ఆరంభించాడు. "ఈయనే మీ గోడౌన్లో దొంగతనాలు చేస్తున్నాడనే విష యాన్ని నేనెలా కనిపెట్టానో చెప్పేస్తాను వినండి. నెంబర్ ఒన్.. మీ కంపెనీ జన రల్ మేనేజర్‌గారే శవాలమీద చిల్లర ఏరు కునే వెధవలా దిక్కుమాలిన డ్రెస్సులో మేనేజ్ అవుతుంటే.. ఇతని అండర్లో క్లాస్ త్రీగా పనిచేస్తున్న రాయుడు సూటుల్లో తిరుగుతున్నాడంటే అర్థం ఏంటి? నెంబర్ టూ.. రాయుడు కారు కొనడం వెనక ఎలాంటి నేరచరిత్ర లేకపోతే, ఇన్నాళ్లూ మీకెందుకు చెప్పలేదు"

ఆ మాట విన్న వారందరికీ మనసులో అదే ప్రశ్న ఉదయించింది. శంకరయ్య మరో పాయింట్ చెప్పాడు. ఎంత ఆరితేరిన దొంగయినా ఎక్కడో ఓచోట పొరపాటు చేసి దొరికిపోతాడు. రాయుడు కూడా అంతే! ఏనాడూ ఆఫీసుకి కారు తీసుకురానివాడు, ఇవాళ ఎందుకు తీసుకొచ్చి ఎగ్జిబిషన్ షో ఇచ్చాడు? ఇవాళ మీ ఆఫీసరుగారు శెలవు పెట్టారు కాబట్టి.. ఆయనకి తెలియకుండా మీకందరికీ చూపించాలనే తహతహని దాచుకోలేకపోయాడు కాబట్టి తీసుకువచ్చాడు. ఆఫీసర్‌కి ఆ కారు సంగతి తెలిస్తే ఆరాలు తీస్తాడు కాబట్టి, ఆయన శెలవు పెట్టినప్పుడే తీసుకొచ్చాడు. కానీ దేవుడి దయవల్ల ఆఫీసరుగారి మరదలు లేచిపోయింది కాబట్టి..."

ఆఫీసరుగారు అతని భుజంమీద చెయ్యేసి టక్కుమని ఆపి, మరో చెయ్యి నోటికి అడ్డం పెట్టుకుని మెల్లిగా గొణిగాడు. కానీ, ఆ సీక్రెట్ మేటరేంటో అందరూ ఊహించుకోగలిగారు.

"దేవుడి దయవల్ల మా మరదలు లేచిపోవడమేంటయ్యా? మాఇంటి వ్యవహారాలు ఇక్కడెందుకు? మనకు కావాల్సిన దొంగ దొరికాడు కాబట్టి, ఇక మీరు మీ పద్ధతిలో ప్రొసీడ్ అవ్వొచ్చు కదా? " అన్నాడు ఆఫీసరు.

రాయుడికిదంతా అయోమయంగా, అగమ్యగోచరంగా కనిపించింది. ఈ కేసులో నుంచి ఎలా బైటికి రావాలన్న విషయాన్నే ఆయన మస్తిష్కం ఆలోచిస్తోంది. సలహా ఇవ్వడానికి యాదగిరి కూడా సందిగ్ధ పరిస్థితిలోనే వున్నాడు. కాకపోతే అతను ఆలోచిస్తున్నది రాయుణ్ణి ఎలా బైటపడెయ్యాలనే! అందుకే కాస్త ధైర్యం చేసి ఇనస్పెక్టర్ శంకరయ్యతో మాట్లాడాడు.

"సారీ సార్! మీకేదో రాంగ్ ఇన్ఫర్మేషన్ వచ్చింది. రాయుడుగారు ఆ టైపు మనిషి కాదు. దయచేసి వదిలెయ్యండి"

"అతనా టైపు మనిషి కాదని మీకెలా తెలుసు? "

"ఇంతకు ముందెప్పుడూ ఇలాంటి పనులు చెయ్యలేదు కాబట్టి"

"అలాగా! గాంధీగార్ని చంపకముందు గాడ్సే కూడా ఎవర్నీ చంపలేదు. అలాగని వాణ్ణి నేరస్థుడు కాదంటావా? "

"మీరెన్ని ఎగ్జాంపుల్స్ చెప్పినా సరే, ఇతను నేరస్థుడు కాదు. కావాలంటే నేను బెయిలిస్తాను. వదిలెయ్యండి"

శంకరయ్య మాట్లాడ్డం ఆపి యాదగిరిని ఎగాదిగా చూసాడు. అతని ముఖాన్ని అటు తిప్పి, ఇటు తిప్పి, సైడ్ ఏంగిల్స్ నించి చూసాడు. చూసాక మిగతా పోలీసుల్తో చెప్పాడు. "కానిస్టేబుల్స్, యాదగిరి అంతటివారు బెయిలిస్తున్నారు కాబట్టి రాయుణ్ణి వదిలెయ్యండి"

ఆఫీసులో ఎటెండరుగా పనిచేసే యాదగిరి మాటలకి అంత విలువ వుందా అని ఆఫీసర్‌తో సహా అందరూ నివ్వెరపోయి చూశారు. శంకరయ్య మళ్లీ మీసం దువ్వుకుంటూ గర్వంగా ఫీలవుతూ చెప్పాడు.

"ఈ యాదగిరి మాట విని, రాయుణ్ణి ఎందుకు వదిలేస్తున్నాననే డౌట్ మీ అందరికీ వచ్చిందని నాకు తెలుసు. నేనిక్కడకొచ్చింది ఓ వంద రూపాయల నోటు కోసం. కానీ ఇక్కడకొచ్చాక వెయ్యి రూపాయల నోటు దొరికింది"

జియ్యామ్ చిరాకుపడుతూ "అదేంటో మాకు అర్థమయ్యేలా చెప్పండి" అన్నాడు.

"పార్లమెంటుని ముట్టడించిన ఉగ్రవాదుల్లో ప్రధాన నిందితుడు తీహార్ జెయిల్నించి తప్పించుకు పారిపోయాడు. వేషం మార్చి, భాష మార్చి, పేరు మార్చి ఆంధ్ర రాష్ట్రంలో ఒకానొక కంపెనీలో పనిచేస్తున్నాడని కేంద్ర ఇంటిలిజెన్స్ డిపార్ట్‌మెంట్ నుంచి మాకు సమాచారం అందింది.

వాడు ఇన్నాళ్లకి ఇక్కడ దొరికాడు"

"ఇక్కడా అంటే.. ఎవరు? " జియ్యామ్ అడిగాడు ఆసక్తిగా.

"ఈ యాదగిరే ఆ ఉన్నతశ్రేణి ఉగ్ర వాది. అరెస్ట్ హిమ్" శంకరయ్య బిగ్గరగా అరిచాడు. అందరూ అదిరిపడ్డారు. యాద గిరికోసం శంకరయ్య తలతిప్పి చూసాడు. కానీ అతనక్కడ కనిపించలేదు. ఎక్కడు న్నాడని అటూ ఇటూ చూస్తుంటే, కాళ్ల దగ్గర ఏదో కదులుతున్నట్టనిపించి కంగా రుపడి కిందకి చూశాడు. గోడకి బల్లి అంటుకుపోయినట్టు, యాదగిరి ఇనస్పెక్టర్ షూస్‌కి అంటుకుపోయి కనిపించాడు.

యాదగిరి వణుకుతూ "సార్.. ఢిల్లీలోని పార్లమెంటు భవనాన్ని సినిమాల్లోనూ, టీవీల్లోనూ చూడ్డమే తప్ప, నేనెప్పుడూ చూడలేదు. కనీసం ఢిల్లీ కూడా వెళ్ల లేదు.." అంటూ తనని తాను రక్షించుకునే ప్రయత్నం చేశాడు.

రాయుణ్ణి తీసుకుని పోలీసులు వేన్‌లో వెళ్లిపోయారు. యాదగిరి తనను కమ్ము కున్న భయంనుంచి బయటపడి రాయుడి భార్య పద్మావతికి ఫోన్‌చేసి జరిగిందంతా వివరించాడు.

★ ★ ★

పోలీస్‌స్టేషన్ ఇంట్రాగేషన్ సెల్‌లో రాయుడి ఒంటిమీద ఒక్క డ్రాయర్ మాత్రమే ఉంది. ఓ కుర్చీకి తాళ్లతో కట్టేసి, ఇద్దరు కానిస్టేబుల్స్ లాఠీలతో బాదుతు న్నారు. ఇనస్పెక్టర్ శంకరయ్య తన ఒడిలో మిరపకాయ బజ్జీల పళ్ళెం పెట్టు కుని ఒక్కో బజ్జీ తింటూ ప్రశ్నిస్తున్నాడు.

"మీ గ్యాంగ్ చాలా చాలా యాక్టివిటీస్ చేశారనీ, చేస్తున్నారనీ మాకు తెలుసు. దొండపర్తి బ్రాంచిలో పట్టపగలు దొంగ తనం చేశారు. గాజువాక బ్రాంచిలో అర్ధ రాత్రివేళ దొంగతనం చేశారు. నువ్వు పని చేసే కంపెనీలో మూడుసార్లు దొంగతనం చేసి, హ్యాట్రిక్ కొట్టి, మూడు కోట్లు నొక్కే సిందీ మీరే! మర్యాదగా చెప్పు. మీ గ్యాంగ్‌లో ఎంతమంది వున్నారు? మీకు ఎక్కడెక్కడ బ్రాంచీలున్నాయి? ఇకమీదట ఎక్కడెక్కడ దొంగతనాలు ప్లాన్ చేస్తు న్నారు? చెప్పరా రాస్కెల్.. చెప్పు" అత నలా అంటున్నప్పుడల్లా అక్కడున్న ఇద్దరు కానిస్టేబుల్స్ లాఠీలతో రాయుణ్ణి కొడుతు న్నారు. వాళ్లు కొడుతున్నప్పుడల్లా రాయుడు నేనీ దొంగతనం చెయ్యలేదు మొర్రోమని మొత్తుకుంటూనే వున్నాడు. తగులుతున్న దెబ్బలు జీవనాడిని జివ్వుమ నిపిస్తున్నాయి. పోలీస్‌స్టేషన్‌లో నేరస్థుల చేత నిజం చెప్పించడానికి పోలీసులు లా ఠీలతో బాదడం, చిత్రహింసలు పెట్టడం

> ## కొత్తగాలి...
>
> **తాగుడుకు బానిస**
> **తాను, అప్పుల పాలవుతాడు**
> **ప్రభుత్వాన్ని పోషిస్తాడు**
>
> – ఇంద్రగంటి నరసింహమూర్తి,
> కాకినాడ

యింతవరకు సినిమాల్లో చూడ్డమే తప్ప, వాస్తవంగా ఎప్పుడూ చూడలేదు. కానీ, యిప్పుడు తనే ఓ నేరస్థుడి స్థానంలో వుండి ఆ బాధల్ని అనుభవిస్తున్నాడు. జీవితంలో ఎన్నడూ పోలీస్‌స్టేషన్ గుమ్మం కూడా తొక్కని తనకి అప్పుచేసి కారుకొన్న పాపానికి, యీ శిక్ష పడింది. శంకరయ్య మరో రౌండు స్టార్ట్ చెయ్యబో తుంటే, యింకా దెబ్బలు భరించలేక.. తను ఏ పరిస్థితుల్లో కారు కొన్నాడో.. ప్రియాంక ముందు ఫాల్స్ ప్రిస్టేజీ కోసం ఎలా అప్పు చెయ్యాల్సి వచ్చిందో వివరిం

చాడు. అతనంత స్పష్టంగా చెప్పినా శంక రయ్యకి అర్థమయింది ఒక్క పాయింటే!

ఆ ఒక్క పాయింట్ పేరే.. ప్రియాంక!

"అయితే, ఆ ప్రియాంకే మీ దొంగల ముఠాకి లీడరంటావ్?"

రాయుడు అదిరిపడి "బాబోయ్ అంత గొప్పింటి మనిషిని తీసుకొచ్చి దొంగలము ఠాలో కలిపేస్తారేటండీ" అన్నాడు.

"ఔనయ్యా.. మన దేశంలో పెద్ద పెద్ద మాఫియా లీడర్లే గొప్పవాళ్లుగా పబ్లిసిటీలో కొచ్చారుగానీ, నాలాంటి సాహసవీరుల యిన పోలీస్ ఆఫీసర్ ఎవడూ ఆ పాపులార్టీ సంపాదించలేదు. ఆ ప్రియాంక అడ్రస్, ఫోన్ నెంబరూ కూడా చెప్పేస్తే, ఆ దొంగలరాణీని లాక్కొచ్చి, మీ గ్యాంగ్ సంగతేంటో తేల్చేస్తాను"

రాయుడికి ఏంచెయ్యాలో అర్థం కాలేదు. పోలీసులు ప్రియాంక జోలికివెళ్తే, వాళ్ల మావగారు సెంట్రల్ మినిస్టర్ కాబట్టి, ఆవిడకి ఎలాంటి ప్రమాదం వుండదు కానీ, ప్రియాంకకి పద్మావతి ప్రదర్శించిన ఫాల్స్ ప్రిస్టేజి, ఆడిన అబద్ధాలు.. అన్నీ తెల్సిపోతాయి. ఆ మరుక్షణం పద్మ ఆత్మ హత్య చేసుకుని చనిపోయినా ఆశ్చర్యం లేదు. ఈ విషయం కూడా శంకరయ్యకి చెప్పినా వినకుండా మళ్ళీ మళ్ళీ లాఠీలతో కొట్టిస్తున్నాడు.

పద్మావతి తన హౌస్ ఓనర్ సీతారా మ్‌ని తీసుకుని ఆటోలో వచ్చింది. సీతారా మ్‌కి చాలామంది పోలీసులు, లాయర్లు తెలుసు. అందుకే అతనితోపాటు కారుకోసం చేసిన అప్పుకి సంబంధించిన పేపర్లూ పట్టుకుని వచ్చింది. సీతారామ్‌ని తీసుకురావడం వృథా కాలేదు. సెల్‌లో వున్న శంకరయ్య వచ్చి తన సీట్లో కూర్చు న్నాడు. అతన్ని చూడగానే సీతారామ్ కళ్లు మెరిశాయి. అతను సీతారామ్‌కి బాగా తెలి సినవాడే. కొన్ని కేసుల్లో శంకరయ్యకి దొంగసాక్షుల్ని అప్పగించిన పరిచయం వుంది సీతారామ్‌కి. శంకరయ్యని విష్‌చేసి, ఎదురుగా వున్న కుర్చీలో కూర్చున్నాక "మేం వచ్చింది రాయుడిగారి కోసం. ఈ పద్మావతి రాయుడి గారి భార్య" అని శంక రయ్య పరిచయం చేశాడు.

"చెప్పాల్సినదాన్ని డైలీ సీరియల్లా సాగది య్యకుండా, సింగిల్ ఎపిసోడ్‌లా సింపు ల్‌గా తెగ్గొట్టేయండి" అన్నాడు శంకరయ్య.

పద్మావతి చెప్పబోతుంటే ఆపి, సీతా రామ్ చెప్పాడు, "ఇనస్పెక్టర్‌గారు నాకు తెల్సు. నేను ఆయనకి తెల్సు. అంచేత మేమూ మేమూ మాట్లాడుకుంటాం. సార్.. మీరు శనీశ్వరుణ్ణి అరెస్ట్ చెయ్యా బోయి, మునీశ్వరుణ్ణి అరెస్ట్ చేసేశారు. వీళ్లచేత ఆ కారు కొనిపించిందీ నేనే! దాని కోసం అప్పు యిప్పించిందీ నేనే! ఈ రెండు విషయాల్నీ ధృవీకరించే పత్రాల్ని మేం పట్టుకునే వచ్చాం. మీరోసారి వెరిఫై చెయ్యండి.." అంటూ యింకా చాలా చాలా మాట్లాడి పత్రాల్ని చూపించాడు. ఆ పత్రాలు చూడ్డంతోనే రాయుడు నిర్దోషి అని నిరూపణయి, యీ కేసు మూతపడి పోవాలి. కానీ అలా మూతపడిపోతే పోలీ సులకేం ఒరగదు కాబట్టి, మరేదో మెలిక పెట్టి, ఎంతో కొంత డబ్బు లాగుతారని సీతారామ్‌కీ తెలుసు. ఇలాంటి పోలీస్ ఫిటింగ్‌ల గురించి అతనికి తెలుసనీ శంక రయ్యకీ తెలుసు.

శంకరయ్య సీట్లోనించి లేచి బద్ధకంగా ఒళ్లు విరుచుకుని అటూ యిటూ తిరు గుతూ ఆలోచించాడు. తను రాయుణ్ణి అరెస్టు చేసింది కేవలం అనుమానం మీదే! ఆదాయానికి మించిన ఆస్తులున్నాయని ఆఫీసరు ఆరోపించాడు. ఆ ఆస్తులన్నీ గోడౌన్‌లో దొంగతనం చేసిన వస్తువుల్ని అమ్మగా వచ్చిన డబ్బుతోనే కొన్నారని ఆఫీ సర్ అన్నాడు. కానీ కారుని అప్పుచేసి

కొన్నట్టుగా డాక్యుమెంట్లు చూపిస్తున్నారు. ఇలాంటి కేసుని కోర్టుకి తీసుకెళ్లినా, నిలబడదు. కానీ, డబ్బులు రాలాలి! ఎలా? టేబిల్ మీదున్న హ్యాండ్‌స్టిక్ తీసి దానితో నెత్తిమీద మెల్లగా కొట్టుకున్నాడు. ఒక్కోసారి ఆగిపోయిన గడియారాన్ని గట్టిగా వూపితే మళ్లీ పనిచేసినట్టు, అతని బ్రెయిన్ కూడా పనిచేస్తుందని నమ్మకం. సీతారాం చెప్పిన మాటల్లో ఒక్క వాక్యం కాస్త కమర్షియల్‌గా కనిపించింది.

"రాయుడు మేనేజరు ప్రమోషన్‌కి బెత్తెడు దూరంలో వున్నాడు. ఇలాంటప్పుడు పోలీసు కేసు నడవడం అతని భవిష్యత్తుకి భంగం కలిగిస్తుంది..."

ఈ పాయింట్‌తోనే ఎంతో కొంత రాబట్టుకోవాలి. చేపకి ఈత, పెద్దపులికి వేట ఎవరూ నేర్పక్కర్లేనట్టే.. గవర్నమెంట్ ఉద్యోగస్థులెవరికీ ముడుపులు తీస్కోవడం గురించి నేర్పక్కర్లేదు. కాకపోతే యీ మధ్య టీవీవాళ్లు నిఘా విభాగాలు పెట్టడంవల్ల చాలామంది పోలీసులు లంచాలు తీసుకుంటూ రెడ్‌హ్యాండెడ్‌గా దొరికిపోయారు. ఆ సీన్స్‌ని రోజంతా టీవీల్లో చూపించడంవల్ల వుద్యోగం నించి డిస్మిస్ అవడమే కాకుండా ప్రజల మధ్య పరువుని కూడా పోగొట్టుకున్నారు. ఆ కారణంవల్ల శంకరయ్యకి లంచాలపట్ల భయం ఏర్పడిందే గానీ, డబ్బుమీద యావ మాత్రం చావలేదు. ఈ కేసులో వున్న సీతారామ్ నంగిరి పింగిరి మనిషని అతనికి తెలుసు. అతని ద్వారా ఎంతో కొంత గిల్లుకోవచ్చు.

"మీ రాయుడు ప్రమోషన్‌కి బెత్తెడు దూరంలో వుండగా ఆయన గొంతుక్కి యీ వుచ్చు తగులుకోవడం నాకు చాలా బాధగా వుంది కానీ, ఏం చెయ్యగలను? కర్తవ్యబద్ధుణ్ణి. ఆధారాలు చాలా స్ట్రాంగ్‌గా వున్నాయి. చట్టం తన పని తాను చేసుకుపోతుంది కదా" అన్నాడు ఇనస్పెక్టర్.

పద్మావతి కాస్త ఆవేశంగా మాట్లాడుతూ "ఆధారాలెలా బలంగా వుంటాయండి? పత్రాలని చూపించాంగా.." అంటుంటే, సీతారామ్ ఆమెను ఆగమని కళ్లతోనే సైగ చేసి, శంకరయ్యని పక్కకి రమ్మని అవేకళ్లతో సంజ్ఞ చేశాడు.

శంకరయ్యకి కావలసిందీ అదే కాబట్టి, వెంటనే పక్కకివెళ్లి "ఏంటయ్యా, ఆవిడ ఆధారాల గురించి నీలుగుతుంది?" అన్నాడు మెల్లగా.

సీతారామ్ తనకున్న చనువుని యీ ఆంతరంగిక సంభాషణలో వుపయోగిస్తూ "ఔనండి. చట్టం తనపని చేసుకుపోతుంటే, నేను కర్తవ్యబద్ధుణ్ణీ అంటూ సినిమా డైలాగులు కొడుతున్నారు గానీ, మీకు ఏ పాయింట్ వుందని కేసు పెడతారు? మీ డ్యూటీ ప్రకారం మీరు కేసు పెట్టినా, ఆ కేసు కొట్టించెయ్యడానికి కొమ్ములు తిరిగిన లాయర్లు అక్కర్లేదు. కేసుల్లేని చెట్టుకింద ప్లీడర్ చాలు. కోర్టుదాకా ఎందుకండీ.. మీ ఎస్పీ రామ్మోహన్‌గారి దగ్గరవెళ్లి, యీ కేసు గురించి చెప్తే.. ఆయన అడుగుతారు మీ ఆధారాల గురించి!" అన్నాడు.

"ఏంటీ నన్ను బెదిరిస్తున్నావా?"

"బెదిరించడానికి నేనెంత గానీ.. ఆ రాయుణ్ణి వదిలెయ్యడం బెటరంటున్నాను"

"ఏవీ రాలకుండానే.." శంకరయ్య స్వరంలో అధికారం కనబడలేదు.. డబ్బుల్తో అవసరం తప్ప.

సీతారామ్ చిన్నగా నవ్వి "తిరపతి కొండమీద వెళ్లిన భక్తుడు గుండు గీయించుకోకుండానైనా తిరిగొస్తాడేమోగానీ, మీ స్టేషన్ కొచ్చేవాడు మీకు ముడుపు కట్టకుండా వెళ్లలేడు కదా! ఎంత ఎక్స్‌పెక్ట్ చేస్తున్నారు?" అని అడిగాడు.

శంకరయ్య అక్కడున్న కానిస్టేబుల్‌ని కాస్త దూరంగా వెళ్లమని సైగ చేసాడు, గొంతు తగ్గించి తన ఫిగర్ చెప్పాడు.

కాస్సేపు యిద్దరి మధ్య లాగులాట, పీకులాట అయ్యాక ఓ ఒప్పందానికి వచ్చారు.

"రేప్పొద్దుట ఇంటికొచ్చి కలుస్తాను" సీతారామ్ చెప్పాడు.

సెల్‌లో వున్న రాయుడు తనని పోలీసులు కొట్టలేదనే బిల్డప్ ఇవ్వడానికి టకటకమంటూ మిలిట్రీ మార్చింగ్ చేసుకొద్దామనుకున్నాడు. కానీ మార్చింగ్ చెయ్యడానికి కాదుగదా, మామూలుగా నడవడానిక్కూడా లాఠీ దెబ్బలు తిన్న అతని మోకాళ్లు సహకరించకపోయేసరికి.. ఓ రెండడుగులు వేసి కింద పడిపోయాడు. సీతారామ్, పద్మావతి అతన్ని చెరోపక్క పట్టుకుని నడిపించుకుంటూ బైటకి తీసుకెళ్లి, తాము వచ్చిన ఆటోలోనే, అతన్ని తీసుకుని ఇంటికి వెళ్లారు.

★ ★ ★

పోలీసు దెబ్బలు తిన్న కొడుకు ఒంటికి వేణ్ణీళ్లు కాపడం పెడుతూనే కొండమ్మ స్వగతం పలుక్కుంటోంది.

ఆఫీసునించి యాదగిరి కూడా వచ్చి కూర్చున్నాడు. "కారు కొన్నట్టు ఒక మాట నాకు చెప్పున్నా, నేను ఏదో విధంగా మేనేజ్ చేసేవాణ్ణిగదండీ.." అన్నాడు.

కొండమ్మ తన గొంతు మరింత పెంచి మాట్లాడింది. "కొన్న కారు గురించి నీకు చెప్పలేదని ఎందుకు బాధపడిపోతావ్? అసలా కారు మీకు అవసరమా? అవసరంలేని కారు కోసం, అయిదు రూపాయల వడ్డీకి లక్షన్నర అప్పు చెయ్యడం అవసరమా అని అడుగు! ఎవరో ప్రియాంక ముందు గొప్పల కోసం కోతలు కొయ్యడమెందుకు? ఆ కోతలు నిజం చెయ్యడానికి అప్పులు చెయ్యడం.. పోలీసుల చేత దెబ్బలు తినడం.. యివన్నీ అవసరమాని అడగవేంటయ్యా? పోలీసు కేసయితే, వీడికి ప్రమోషను రావడం సంగతటుంచి ఉద్యోగమే పోయే ప్రమాదం ఉంది. ఆ కేసు కొట్టించెయ్యడానికి ఇప్పుడు ఇనస్పెక్టర్‌కు వెయ్యో రెండో వేలో లంచం కట్టాలి.."

ఆ మాట వింటూ సీతారాం పద్మావతి వైపు చూశాడు. నిజానికి ఆ ఇనస్పెక్టర్ అడిగింది యాభైవేలు. ఈ కేసు రాయుడి ఉద్యోగంతో ముడిపడి వుంది. కాబట్టి ఆ రేటు అడిగాడు. సీతారామ్ ఆ ఫిగర్‌నే అటు తిప్పి, యిటు తిప్పి ఇరవైవేలకి ఒప్పించాడు. ఆ డబ్బు కూడా రేపు ఉదయంలోగా ముట్టచెప్పాలి. ఆ తర్వాత రాయుడు నిర్దోషని ఇనస్పెక్టర్ ఆఫీస్‌వాళ్లకి చెప్తాడు. ఈ విషయమే గొణుగుతున్నట్టుగా కొండమ్మ పద్మావతితో చెప్పింది. "మన సైడ్ ఏ తప్పు లేకపోయినా, ఇరవైవేలు లంచం ఇవ్వాలా? ఇదెక్కడి ఘోరవే! ఆ ప్రియాంక మనింటికి వచ్చిందీ లేదు, చచ్చిందీ లేదు.. డబ్బుకి డబ్బూ ఖర్చైపోతోంది, అవమానాలకి అవమానాలూ జరిగిపోతున్నాయ్. చివరికీ సంసారం ఏ గోదాట్లో కలుస్తుందో నాకర్థం కావడం లేదు" అంది, కొడుకు ఒంటిమీద గాయాలకి ఆయింట్‌మెంట్ రాస్తూ.

రాయుడికి పోలీసులు కొట్టిన దెబ్బల కంటే, తల్లి చెప్పిన మాటల్లోని వాస్తవమే ఎక్కువగా మంటెక్కించింది. బైటనించి జగన్నాథం పంతులు ముక్కుపొడి పీల్చుకుంటూ వచ్చి, వెకిలినవ్వు నవ్వుతూ

## కొత్తగాలి...

**పోస్టుకార్డు**
**నాడు దిక్కుల్ని కలిపింది**
**నేడు**
**దిక్కులేనిదయింది**

– *రఘుపాత్రుని శ్రీనివాసరావు,*
*శ్రీకాకుళం*

"ఎహ్హెహ్హె! చూసారా కొండమ్మగారు, యీ జగన్నాథం పంతులు చెప్పింది అక్షరాలా ఎలా నిజమైపోతోందో! మీ కుమారుడు సుబ్బారాయుడు వీరభోగవసంతరాయుల్లాగ మంచం మీద పడుకుంటే మంత్రి సామంతుల్లాంటి సీతారామ్ తదితరులు కూర్చున్నారు. రాజమాతలాంటి మీరు కుమారుడికి జండూబామ్ రాయుట, మహారాణీలా పద్మావతిగారు కూర్చోనుట.. ఈ అదృష్టం ఎంతమందికి పడుతుందట? అద్సరేగానీ, మీ వాళ్లేమయినా కొత్త పరుగులు తీసారా? " అని అడిగాడు.

కొండమ్మకి పంతులుగార్ని ఏమనాలో,

## కొత్తగాలి...

**ఈతి బాధలు**
**కొంత కాలం**
**నాతి బాధలు**
**జీవిత కాలం**

– చక్కా చెన్న కేశవరావు, కావలి

ఏం చెయ్యాలో అర్థం కాలేదు. "మీ నోటి చలవ వల్ల అప్పులోడి దగ్గరకి పరుగెత్తింది చాలక, ఇవాళ పోలీస్‌స్టేషన్‌కి పరుగెత్తారు. ఇప్పుడు ఆ లంచం కట్టడానికి మళ్లీ అప్పులోడి దగ్గరకి పరుగెత్తాలి.."

పంతులు ఇంకా వివరాలు అడుగుతుంటే, సీతారామ్ అతన్ని బైటకి లాక్కెళ్లి "సందట్లో సడేమియా అనేమాట ఎప్పుడైనా విన్నారా? " అని అడిగాడు.

"సడేమియా అంటే ఎవరు? "

"వాడూ మీలాంటోడే! ఏడుస్తున్న వాళ్లని వెక్కిరిస్తే, మళ్లీ వెక్కిరించినవాణ్ణి ఏంచేస్తారు? "

"దాచిపెట్టి తంతారు"

"ఈ ఇంట్లోవాళ్లతో మీరింకా ఎక్కువసేపు మాట్లాడితే, వాళ్లు మిమ్మల్ని అదేపని చెయ్యొచ్చు. అంచేత, మీరు వెంటనే లాగింగ్ చెయ్యడం మంచిది" అన్చెప్పి పంపించేశాడు.

పద్మావతి సీతారామ్ దగ్గరకి వచ్చి, "ఆ ఇనస్పెక్టరు మీకు బాగా తెలిసినవాడేగా! మీరడిగితే తగ్గించడంటారా? " అంది.

"తెల్సినవాణ్ణి కాబట్టే ఆ ఫిగర్‌కి ఒప్పుకున్నాడు"

"సరే! మీరే ఆ ఇరవైవేలూ అప్పు ఇప్పించండి. మా ఆయన దగ్గరకు ఆ పత్రాలు తెస్తే సంతకాలు చేసేస్తాడు"

సీతారామ్ సరేనని తలాడించి వెళ్లిపోయాడు.

ఆ సాయంత్రమే పద్మావతి ప్రియాంకకి ఫోన్‌చేసి "నువ్వు ఎప్పుడు వస్తున్నావో కరక్టుగా చెప్పు. రాకపోతే రానని చెప్పు. నీ కోసం నేను టూర్లు వెళ్ళకుండా ఎన్నాళ్లు ఇంట్లో కూర్చుని వెయిట్ చేస్తాను? " అంది చిరాకుని మాటల్లో ధ్వనింపజేస్తూ.

"మీరు తరచుగా టూర్లు కూడా వెళ్తారా? " ప్రియాంక సిన్సియర్‌గా, ఆసక్తిగా అడిగింది.

"సోషల్ వెల్ఫేర్ కార్యక్రమాల్ని టేకప్ చేశాక టూర్లు వెళ్లకపోతే ఎలా? ఏ టూరూ వెళ్లకపోతే మధురవాడలో మేం కట్టిస్తున్న బిల్డింగ్ దగ్గరకి వెళ్తుంటాను. అప్పుడప్పుడు ఓనరు వెళ్లకపోతే, తాపీ పని వాళ్లు క్వాలిటీ విషయంలో కేర్ తీసుకోరు కదా.." అంటూ పద్మావతి ఆ బిల్డింగ్ గురించే ఓ పది నిమిషాలు మాట్లాడింది. ఈ మాటలు వింటున్న కొండమ్మ నిట్టూర్చడం తప్ప మరేమీ చెయ్యలేకపోయింది. ఇంత జరిగాక కూడా పద్మావతి తనదికాని బిల్డింగ్ గురించి అంతసేపు మాట్లాడిందంటే.. ఈ నోటి దురద, ఫాల్స్ ప్రిస్టేజ్ అనే జబ్బులు కేన్సరు, ఎయిడ్స్ కంటే

భయంకరమైనవనే నిర్ధారణకొచ్చింది.

ప్రియాంక ఫోన్‌లో మాట్లాడుతూ ఫైనల్‌గా చెప్పింది. "ఈ వారంలో మా వాళ్లు అమలాపురం నించి రావడం కుదర్దు. వచ్చే వారం రాకతప్పదు"

పద్మ చిరాగ్గా ఫోన్ పెట్టేసింది.

రాయుడు అందరిముందు దొంగగా ఆరోపించబడి అరెస్టయ్యాడు. కొంతమంది ఒకచోట అవమానించబడి, మరోచోట రాణిస్తారు. మరి కొంతమంది ఎక్కడ అవమానించబడ్డారో, అక్కడే రాణిస్తారు. కాలర్ పట్టుకుని అడిగినవాళ్ల చేతే తమ కాళ్లు పట్టించుకుని సేవలు చేయించుకుంటారు. రాయుడి గురించి పద్మావతి ఇలాగే ఆలోచించింది. అతను ఏ ఆఫీసులోనైతే దొంగా అని అవమానించబడ్డాడో, అదే ఆఫీస్‌కెళ్ళి మేనేజర్‌గా ప్రమోట్ అయ్యే ఆర్డర్సు అందుకోవాలి. ఎగతాళి చేసినవారి చేతే సెండాఫ్ పార్టీ తీస్కోవాలి. ఇలా నిర్ణయించుకున్నాక భర్తచేతో పదిరోజులపాటు సెలవు పెట్టించి రెస్ట్ తీస్కోమని చెప్పింది. పోలీసులు కొట్టిన దెబ్బల్నించి పూర్తిగా స్వస్థత పొందడానిక్కూడా కొన్నిరోజుల టైమ్ పడుతుంది కాబట్టి, యీ మాత్రం సెలవు అవసరమనిపించింది రాయుడికి.

★ ★ ★

రాయుడు సెలవు పెట్టి ఇంట్లో ఉన్నందున శరీరానికి విశ్రాంతి దొరికినా, మనసుకి మాత్రం శాంతి దొరకలేదు. అందుక్కారణం.. సత్యవతి, వసుంధర, లక్ష్మీకాంతం! వాళ్లు ముగ్గురు ఆ వీధిలో ఉండే వాళ్లే. నగరాల్లోని ఇళ్లు పక్కపక్కనే వున్నా ఇంటింటికీ టీవీలు రావడం వల్ల, కొత్త ఫోన్లు పెరగడంవల్ల కొంత రాకపోకలు తగ్గేయి. తీరిక దొరికితే టీవీ చూడ్డానికో, లేక చిన్న కునుకు తియ్యడానికో ఇష్టపడుతున్నారు తప్ప మరో ఇంటికెళ్లి కుశలప్రశ్నలు వేసి కాలక్షేపం చెయ్యడానికి చాలామంది ఇష్టపడ్డంలేదు. పద్మావతి ఉండే వీధి అందుకు మినహాయింపు కాదు. వాళ్లు బైటినుంచి హాల్లోకి రాగానే లోపల్నించి పద్మావతి వచ్చింది గానీ, రాయుణ్ణి రావద్దనే చెప్పింది. వాళ్లని కూర్చోమని చెప్పింది. వాళ్లెందుకొచ్చారో ఆవిడ ఊహించింది. ఆ ఊహే నిజమైంది. కాస్సేపు ఆ మాటా ఈ మాటా అయ్యాక వాళ్లు వచ్చిన విషయాన్ని చాలా లౌక్యమయిన పద్ధతిలో ప్రారంభించారు.

"పాపం.. ఆ విషయం వినగానే నాకు చాలా బాధ కలిగిందంటే నమ్మండి పద్మావతిగారూ.." అంది వసుంధర.

"ఏమిటి? " కళ్లు చిట్లించి సీరియస్‌గా అడిగింది పద్మావతి.

"అదేనండీ.. మీ ఆయనను దొంగతనం కేసులో పోలీసులు అరెస్ట్ చేసి లాక్కెళ్లారటకదా? " అడిగింది సత్యవతి.

"మీకెవరు చెప్పేరు? "

"ఎవరైతేనేంలేండి. మీకు ధైర్యం చెప్పడానికే వచ్చాం. మీరేం భయపడకండి. గట్టి లాయర్ని పెట్టుకుంటే సరి! మహామహా కుంభకోణాల కేసుల్నే ఉల్టాపల్టా చేసేస్తున్నారు. ఈ దొంగతనం కేసో లెక్కా? కాకపోతే డబ్బు దిట్టంగా పెట్టుకోవాలి" అంది లక్ష్మీకాంతం.

"పెట్టుకుంటార్లెండి. లేకపోతే ఏసీబీ వాళ్లు వూరుకోరుగా. ఆదాయానికి మించిన ఆస్తులున్నాయంటూ ఎంతమందిని ఏసీబీ వాళ్లు పట్టుకుంటున్నారో రోజూ టీవీల్లో చూస్తున్నాంగా" అంది వసుంధర.

పద్మావతి మాట్లాడక వింటూనే వుంది.

"అయినా అదేంటోగానీ, కోట్లకి కోట్లు మింగేసేవాళ్ల జోలికి ఎవరూ వెళ్లడం లేదు. ఇలా వేలూ లక్షలూ తీసుకునేవాళ్లనే టపీమని పట్టేసుకుంటున్నారు" అంది సత్యవతి. పద్మావతి మాట్లాడలేదు..

వింటూనే వుంది.

"వల విసిరితే దొరికేవి చిన్న చేపలేగాని, తిమింగలాలు కావుగా! మీరు కారు కొన్నప్పుడే అనుకున్నాను.. మీకు పైరాబళ్లు పెరిగాయని" అంది లక్ష్మీకాంతం.

పద్మావతి యిప్పుడు వినడంలేదు.. మాట్లాడింది సీరియస్‌గా!

"చూడండి, మీరు మామూలప్పుడు ఎప్పుడూ కలిసిరారు. మంచి పనులకి లేని ఐకమత్యాన్ని మరొకర్ని ఎగతాళి చెయ్యడానికైనా సాధించినందుకు మిమ్మల్ని అభినందిస్తున్నాను. మీరు పరామర్శ నెపంతో వచ్చి యిలా సెటైర్లు కొట్టడం ఎంతవరకు న్యాయంగా వుందో మీ సంస్కారాల్నే అడగండి. మా ఆయన్ని పోలీసులు అరెస్టు చేసారని మీకు చెప్పిన రాస్కెల్ ఎవరు? మా ఆయన దొంగతనాలూ చెయ్యలేదు, ఆయన్ని తీసుకెళ్లి ఉరికంబమూ ఎక్కించెయ్యలేదు"

"అరెస్ట్ చెయ్యకుండా మాకు సంగతి ఎలా చెప్పేరంటారు?" వసుంధర అమాయకత్వం నటిస్తూ అడిగింది.

"ఎలా చెప్పేరని మీరు అమాయకంగా అడుగుతున్నారు. మీకు చెప్పిన డర్టీస్కౌండ్రల్ ఎవరని నేను అడుగుతున్నాను. నిజంగా మీరు చెప్పినట్టే జరిగుంటే, నిన్న సాయంకాలం టీవీ ఛానల్స్ అన్నింటిలోనూ చూపించేవారుగా? ఇవాల్టి పేపరు సిటీ ఎడిషన్‌లో ఫోటోతో సహా వేసుండేవారుగా? కానీ అలా జరగలేదేం? చెప్పండి. చిన్న చిన్న విషయాన్ని కూడా కొండంతలుగా చూపించే టీవీల్లో, మా ఆయనలాంటి ఇంటర్నేషనల్ గజదొంగ గురించి ఎందుకు చూపించలేదు?"

పద్మావతి దబాయించి అడిగేసరికి వచ్చిన ముగ్గురు ఆడవాళ్లు కంగుతిన్నారు. పద్మావతి ముఖంలోకి చూడలేక నేలవైపు, కిటికీలవైపు చూస్తున్నారు.

"అయితే మీ ఆయనగారి ఆఫీసుకి పోలీసులు రాలేదా?" గొణిగింది సత్యవతి.

"ఎందుకు రాలేదండీ వచ్చారు. పోలీసుల్లో కూడా మనలాంటి పండితులుంటారుగా. పక్కనున్న బిల్డింగ్‌లో కెళ్లబోయి మా ఆయన కంపెనీకి వెళ్లారు. ఎవరో సూర్యరాయుణ్ణి పట్టుకోబోయి సుబ్బారాయుణ్ణి.. అంటే మా ఆయన్ని వేన్ ఎక్కించారు. తీరా పోలీస్‌స్టేషన్ కెళ్లాక వాళ్ల పొరపాటు తెలుసుకుని, మా ఆయనకి క్షమాపణ చెప్పారు. కానీ, నేనొప్పుకోలేదు"

"మీరు పోలీస్‌స్టేషన్‌కి వెళ్లారా?" లక్ష్మీకాంతం ఆశ్చర్యంగా అడిగింది.

"ఏం మా ఆయన్ని పోలీసులు అరెస్ట్ చేసేసారని మీ ముగ్గురికీ చెప్పిన నీచుడు నేను స్టేషన్‌కెళ్లేనని చెప్పలేదా? ఆ ఇనస్పెక్టర్ని ఝాడించి వదిలేసానని చెప్పలేదా? మా ఆయన్ని అరెస్ట్ చేసిన ఆ ఇనస్పెక్టర్ మీద ఏభై లక్షలకి పరువునష్టం దావా వేస్తానని కూడా అన్నాను. ఆ దెబ్బకి నిన్న సాయంకాలం ఆ ఇనస్పెక్టర్‌గాడు వాడి పెళ్లాన్ని, యిద్దరు పిల్లల్ని నా కాళ్లమీద పడేసి నా వుద్యోగాన్ని కాపాడండీ అని ప్రాధేయపడితే సర్లే సర్లే అని క్షమించి వదిలేసాను. అరెస్టు సంగతి తెల్సిన మీకు యీ సంగతి కూడా తెలిసుండాల్సింది. తెలిసివుంటే మీరు వెటకారం చెయ్యడానికి కాకుండా.. పోలీసుల్నే హడలెత్తించిన పద్మావతిగా నన్ను అభినందించడానికి వచ్చుండేవారు"

ముగ్గురు ఆడవాళ్లు మౌనంగా వుండిపోయారు. ఆ నలుగురి మధ్య నిశ్శబ్దం తారట్లాడింది. తన భార్యకి వాక్చాతుర్యం వుందని రాయుడికి తెలిసినా, ఏ మాత్రం తడుముకోకుండా యిన్నిన్ని గేస్ కబుర్లు చెప్పడంతోపాటు యింత ఆవేశపడి రిటార్ట్ యివ్వగలదన్న కొత్త విషయం యిప్పుడే తెల్సింది.

"మీ ఆయనగారికి యింత వేగంగా ప్రమోషన్ రాదనుకుంటాను" అంది లక్ష్మీకాంతం మీద తిరుగుతున్న ఫ్యాన్‌వైపు చూస్తూ.

పద్మావతి ఆవిణ్ణి ఫెడీమని కొడదామనుకుంది. కొట్టేసానని కూడా అనుకుంది? కానీ, తమాయించుకుని "రాదని మీరెందు కనుకుంటున్నారు? " అని అడిగింది.

"అcహc! గత ఏడాది నించీ మీ ఆయనకి ప్రమోషన్ వస్తుందీ వస్తుందీ అని అంటున్నారే తప్ప యింకా రాలేదుకదా.. ఎప్పుడొస్తుందీ అని అడిగాను"

"మీరు ఎప్పుడొస్తుందీ అని అడగలేదు. ఇంతవేగంగా రాదనుకుంటానూ అన్నారు. ఆ మాటకీ యీ మాటకీ చాలా తేడా. మా ఆయనగారికి యీవారం పదిరోజుల్లో ప్రమోషను వచ్చేస్తుంది. మేం గుంటూరు వెళ్లిపోతున్నాం. ప్రమోషన్ ఆర్డర్స్ తయారైపోయి జెన్రల్ మేనేజర్‌గారి టేబిల్ మీదకి సంతకాల కోసం వెళ్లాయి. కానీ, ఆయన లీవ్‌లో వుండడం వల్లే మరోవారం రోజులు పడుతుందన్నాను"

సంభాషణ ఎవరికీ సంతృప్తిగా, సంతోషంగా సాగడంలేదు. నేరకపోయి వచ్చామని వాళ్లు అనుకున్నారు. వాళ్లు వెళ్తే తలుపు వేస్కోవచ్చని పద్మావతి అనుకుంది. మరో అయిదు నిమిషాల తర్వాత ఆ ముగ్గురు ఆడవాళ్లు వెళ్లిపోయారు. పద్మావతి వీధి తలుపులు మూసి రాయుడున్న గది దగ్గరకి వచ్చింది. చదువుతున్న వారపత్రికని పక్కనపడేసి "వాళ్లతో చాలా గట్టిగానే మాట్లాడావ్! కాస్త ఎక్కువగా కూడా చెప్పినట్టున్నావ్? " అన్నాడు.

"కావాలనే చెప్పాను"

"అవన్నీ వాళ్లు నమ్మేరంటావా? "

"వాళ్లు నమ్మితే ఎంత? నమ్మక పోతే ఎంత? అటు ఆఫీసులో మీ పరువూ పోయి, యిటు యీ వీధిలో నా పరువూ పోయాక యింకా వెనకాడ్డాలెందుకు? ఈ విషయంలో అమీతుమీ తేల్చేసుకోవాలి. ప్రమోషన్ విషయం ఏమాలోచించారు? "

"పాత విషయాలు గుర్తొచ్చి బాధపడుతున్నాను తప్ప, కొత్త అయిడియా ఏదీ తట్టడంలేదు" రాయుడు పరీక్షలో ఫెయిలైపోయి సంజాయిషీ చెప్పే విద్యార్థిలా గిల్టీగా చెప్పాడు.

"పాత విషయాలమీద కొత్త సంతకాలు చెయ్యకండి. ఫెయిల్యూర్ లోనించే సక్సెస్ పుట్టుకురావాలి. పట్టుదల పెరగాలి. సాధించగలమన్న నమ్మకంతోనే ప్రమోషన్ ఆర్డర్స్ తయారైపోయి, మీ ఆఫీసర్ టేబిల్ మీద వున్నాయని చెప్పాను. నోరు జారకూడదు. జారేక, ఆ మాటని నిజం చేసెయ్యాలి. మా ఆడాళ్ల సంగతి మీకు తెలీదు. నాగరికత పెరిగినంతగా మాకు సంస్కారాలు పెరగవని ఓ ఆడదానిగా నేనే ఒప్పుకుంటున్నాను. ఆ ఆడాళ్లు మనింటికొచ్చి మరీ మీ ప్రమోషన్ యింతవేగం రాదనుకుంటామన్నారు. వచ్చేస్తుందీ, సంతకాల కోసం వెయిట్ చేస్తున్నాం అన్చెప్పేసాను"

పద్మావతి టకటకమని చెప్పుకుపోతోంది. రాయుడికి ఏం సమాధానం చెప్పాలో అర్థం కాలేదు. ప్రియాంక దగ్గర కారు వుందని నోరు జారింది. జారినందుకు అప్పుచేసి కారు కొనేసింది. అలా

---

**కొత్తగాలి...**

**వలువలకు**
**విలువలు తగ్గి**
**వనిత సిగ్గు**
**మాయమైంది**

– ఈ వేమన, శ్రీకాకుళం

---

కొనడం సాధించడమూ అనిపించుకోదు, ఘనకార్యమూ అనిపించుకోదు. ఎందు కంటే అది డబ్బుతో చెయ్యగలిగినపని, ఇవాళ ఆడాళ్లముందు, ప్రమోషన్ ఆర్డర్స్ ఆఫీసర్ టేబిల్‌మీద సంతకాల కోసం వెయిట్ చేస్తున్నాయని చెప్పేసింది. ఆ సంతకాలు చేయించడం కారు కొన్నంత యీజీ కాదు. ఈ సంగతి తెలిసే, తన ప్రమోషన్ని కాలానికి, కర్మానికే వదిలే సాడు. కానీ, పద్మావతి దాన్ని కాశ్మీర్ సమ స్యంత తీవ్రంగా పరిగణించి మాట్లాడు తోంది. ఇప్పుడెలా?

తలుపు కొడుతున్న సౌండ్ వినిపిస్తే పద్మావతే వెళ్లి తలుపు తీసింది. హౌస్ ఓనర్ సీతారామ్ లోపలకి వచ్చి మంచం దగ్గరున్న కుర్చీలో కూర్చుని చెప్పాడు. ఆ ఇనస్పెక్టర్‌కి యివ్వాల్సింది యిచ్చేసాను. రాయుడు గురించి రాయించవలసింది రాయించేసాను"

"ఏం రాసాడు? " రాయుడే అడిగాడు.

రాయడవంటూ జరగాలంటే కేసు రిజి స్టర్ చెయ్యాలి. ఎఫ్ఐఆర్ రాయాలి. అలా రాసిన కేసుల్ని కోర్టుకి తీసుకెళ్లక తప్పదు, కానీ మనం మీటయ్యాం కాబట్టి, అలాంటి రాతకోతలేం జరగలేదు. మీ జియమ్‌కి ఫోన్‌చేసి.. రామచంద్రుడు, హరిశ్చంద్రుడు తర్వాత, రాయుడంత సత్యవంతుడు మరొ కడు లేడని చెప్పేసాడు.. కాదు కాదు చెప్పించేసాను. ఇక మీదట నీ ప్రమోష న్‌కి ఎలాంటి పోలీస్ అడ్డంకులూ వుండవు. మరో విషయం, ఆ ఇనస్పెక్టరు క్కూడా, టూటౌన్ స్టేషన్‌నించి, త్రీటౌన్‌కి బదిలీ అయిపోయింది"

"దేవుడి దయవల్ల ఆ ఇనస్పెక్టరుగాడేం నీలగలేదు" అంది పద్మావతి

"ఇందులో దేవుడు చూపించే దయేం వుందమ్మా? మనం డబ్బిచ్చాంగా! మంటల్లో పడ్డాక మంచిగంధం చెక్కయినా మాడి బూడిదవ్వాల్సిందే! లంచం తీస్కు న్నాక ఎలాంటి ఐరన్‌మేన్ అయినా వంగా ల్సిందే, లొంగాల్సిందే.. ఎహ్హెహ్హెహ్హె"

సీతారామ్ నవ్వుతో ఆ యిద్దరూ శృతి కలిపారు.




**ఆ**రోజు పోస్ట్‌లో, ఓ ప్రైవేట్ కంపెనీ నించి ఓ ఇంటర్వ్యూ కార్డ్ వచ్చింది, ఆ కార్డ్ వచ్చింది పద్మావతికే!

రాయుడు శెలవు పెట్టి యింట్లోనే వున్నాడు కాబట్టి, ఆ కార్డ్ చూసి ఆలోచ నలో పడ్డాడు. ఇంటర్వ్యూ కార్డు పంపిం చిన కంపెనీ విశాఖపట్నంలోనే వుంది. సాలరీస్ బాగుంటాయి. ముఖ్యంగా ట్రాన్స్ ఫర్స్ వుండవు. ఈ యింటర్వ్యూలో పద్మా వతి సెలక్టయిపోతే ఆర్థికంగా కొంత మెరుగ్గా వుంటుంది. పద్మావతి ఉద్యోగం చేస్తే బావుణ్ణనే ఆలోచన యీనాటిది కాదు. రాయుడికి పెళ్లైన ఆరునెల్ల తర్వాత న్యూస్ పేపర్లో పడిన కొన్ని ఉద్యోగ ప్రక టనలు చూసి, వాటిలో అతనికి బాగా నచ్చిన కొన్ని జాబ్స్‌కి అప్లయ్ చెయ్యమ న్నాడు. కొండమ్మ కూడా కోడల్ని ఉద్యోగం చెయ్యమనే ప్రోత్సహించింది. కానీ తనకి ఒకరి దగ్గర తలవంచి, వారికి దాసోహం అంటూ ఉద్యోగం చెయ్యడం యిష్టంలేదని పద్మావతి కచ్చితంగా చెప్పింది.

ఒకరి దగ్గర ఉద్యోగం చెయ్యడమంటే,

అది మరొకరి దానోహం ఎలా అవుతుంది? అలా అనుకుంటే యీ ప్రపంచంలో నూటికి పదిమంది కంటే ఎక్కువ మంది ఉద్యోగాలు చెయ్యలేరు. ఒకప్పుడు ధనసంపాదన మగవాడి బాధ్యతగా, గృహ నిర్వహణంతా ఇల్లాలి బాధ్యతగానే సామాజిక జీవనం గడిచింది. కానీ, కాలం అనేక వ్యవస్థల్లో మార్పులు తెచ్చినట్టే కుటుంబ వ్యవస్థలోనూ మార్పులు తెచ్చింది. డబ్బు మనిషి జీవితాన్ని శాసించడం మొదలుపెట్టాక, సంపాదన పెరగాల్సిన ఆవశ్యకత ఎక్కువయింది. ఆ సంపాదన చేసేది మగవారా? ఆడవారా? అనే ప్రశ్న క్రమంగా మరుగున పడింది. ఆడవారికి చదువెందుకు? ఉద్యోగాలు చెయ్యాలా? ఊళ్ళేలాలా? అని ప్రశ్నించిన సమాజంలోనే ఆడది ఉద్యోగాలూ చేస్తోంది. ఊళ్లూ నగరాలే కాదు రాష్ట్రాల్ని దేశాల్ని కూడా ఏలే స్థాయికి చేరుకుంది. జీవనవ్యయం రోజు రోజుకీ పెరిగిపోతున్న తరుణంలో, అనేక కట్టుబాట్లు సడలించబడ్డాయి. కొన్ని హక్కులు, వెసులుబాట్లు కల్పించబడ్డాయి. ఒకరు తేవడం, పదిమంది తినడం అనే పరిస్థితి మధ్యతరగతి కుటుంబాల్లో కొట్టొచ్చినట్టు కనబడేది. కానీ ఆ పరిస్థితి మంచిదికాదని కాలగమనంలో వారికే అనిపించింది. ఆడవాళ్లు వారి అర్హతలకి తగ్గ ఉద్యోగాలు చేసి, జీతాలు సంపాదించి, కుంటుంబ ఆదాయాన్ని వృద్ధి చేస్తున్నారు. ఉద్యోగం చెయ్యడం ఆడవారిక్కూడా అవసరంగా మారింది. చదివిన చదువుని సార్థకం చేస్కోవాలంటే ఉద్యోగం చెయ్యక తప్పదు. ఉద్యోగం చెయ్యడం అవసరం తప్ప ఎవరికీ దాసోహమవడం కాదు. ఈ మాటలు చెప్పింది రాయుడు ఒక్కడే కాదు, కొండమ్మ కూడా తనకి అందుబాటులో వుండే భాషలో నచ్చజెప్పింది.

కొన్నాళ్లపాటు ఆ మాటలన్నీ అనవసర ప్రసంగాలుగా భావించింది పద్మావతి. తర్వాత అవసరాలు పెరిగినంత స్థాయిలో, తన భర్త జీతం పెరగడం లేదని గ్రహించింది. తనూ ఉద్యోగం చెయ్యడానికి నిర్ణయించుకుంది. కొన్ని కంపెనీలకి అప్లై చేసింది. రెండు యింటర్వ్యూలకి వెళ్లింది. ఒక ఉద్యోగానికి సెలక్టయింది. కానీ, తాడేపల్లిగూడెంలో పోస్టింగ్ యిచ్చారు. అక్కడ ఓ సంవత్సరం పాటు పనిచేశాక విశాఖపట్నం బ్రాంచికి బదిలీ చేస్తామన్నారు. కానీ పద్మావతి తన కుటుంబాన్ని వదిలిపెట్టి మరో వూళ్లో ఉద్యోగం చేయడం కుదర్దు కాబట్టి వదిలేసింది. మరో జాబ్‌కి సెలక్టవలేదు. ఆ తర్వాత మళ్లీ యింటర్వ్యూ కార్డ్ రావడం యిప్పుడే. ఏం చేద్దాం? ఈ ప్రశ్న రాయుడు, కొండమ్మ, కాంచన ఎవరికివారే వేసుకున్నారు. తర్వాత ముగ్గురూ కలిసి పద్మావతిని ప్రశ్నించారు. ఓ అయిదు నిమిషాల తర్వాత ప్రస్తుత పరిస్థితుల్లో ఉద్యోగం చెయ్యడమే మంచిది అనే సలహా కూడా యిచ్చారు. పద్మావతి ఏమాత్రం ఆలోచించకుండా తన నిర్ణయాన్ని చెప్పింది.

"ఈ పరిస్థితుల్లో ఉద్యోగం చెయ్యడమే మంచిదని మీరంటున్నారు. కానీ యీ పరిస్థితుల్లోనే ఉద్యోగం చెయ్యకూడదని నేను అనుకుంటున్నాను"

"ఏం? ఉద్యోగం చేయడానికి యిప్పుడేం ఆటంకాలున్నాయి? బాబు స్కూల్‌కి వెళ్లిపోతున్నాడు. ఇంటిపనులు నేను చూసుకుంటున్నాను. ఇంట్లో కూర్చుని టీవీ చూస్తూ కాలక్షేపం చేసే బదులు, ఆఫీసుకెళ్లి ఉద్యోగం చెయ్యొచ్చుగా" కొండమ్మ ఎంతో బాధ్యతగా చెప్పింది.

"మీరు చెప్పేవన్నీ కరక్టే! కానీ యీ మధ్య ప్రియాంక ఇక్కడికి దిగబడిందిగా"

తమ కుటుంబ వ్యవహారాల గురించి యింత సీరియస్‌గా మాట్లాడుతున్నప్పుడు

ఆవిడ ప్రియాంక గురించి ప్రస్తావించడంతో అటు కొండమ్మకీ యిటు రాయుడుక్కూడా చిర్రెత్తుకొచ్చింది. కాకపోతే తన చిరాకుని వ్యక్తం చెయ్యడానికి రాయుడు సిద్ధపడలేదు. కానీ, కొండమ్మ మాత్రం నిర్భయంగానే బైట పడింది.

"ప్రియాంక యీ ఊరు రావడానికి, నువ్వు ఉద్యోగం చెయ్యకపోడానికీ వున్న సంబంధమేంటి? "

"ఎందుకు లేదు? ఆ ప్రియాంక కనిపించినప్పుడు నేనేం చేప్పేను? మా ఆయన ఓ కంపెనీకి రీజినల్ మేనేజరని చెప్పాను. మరోసారి అది ఫోన్ చేసినప్పుడు నా యింటికి ప్రతీరోజూ నా సలహాల కోసం, నా సహాయాల కోసం అనేకమంది ప్రముఖులు వస్తుంటారని చెప్పాను. మధురవాడలో ఓ పేద్ద బిల్డింగ్ కట్టిస్తున్నామని చెప్పాను. ఇవన్నీ చెప్పాక, యిప్పుడు నేను పదివేలు, పదిహేనువేల కోసం ఉద్యోగం చేస్తున్నానని తెలిస్తే దానిముందు నాకెంత తలకొట్టేసినట్టవుతుంది? నేను చెప్పినవన్నీ గ్యాస్ కబుర్లని నన్ను ఎగతాళి చెయ్యదా? అలాంటి అవమానాలు చెయ్యడానికి అదెవరు? ఒకప్పుడు మా దగ్గర బానిసలా పనిచేసిన ఓ ప్యూన్ కూతురు" అలా పద్మ కాస్సేపు మళ్లీ తన ఫాల్స్ ప్రిస్టేజిని ప్రదర్శిస్తూ మాట్లాడాక కొండమ్మ సీరియస్‌గా సమాధానం చెప్పింది.

"ఆ ప్రియాంక నీ కంటికి కనిపించిన క్షణంనించి, నీకా అమ్మాయి సింహస్వప్నంలా తయారయింది. ఎంతసేపూ ఆ అమ్మాయి గతం గురించి ఆలోచిస్తావే గానీ, నీ భవిష్యత్తు గురించి ఆలోచించవా? కనీసం యిప్పటి పరిస్థితి గురించి ఆలోచించవా? ఆ అమ్మాయి ముందు గొప్పలు ప్రదర్శించడానికి కొన్ని అబద్ధాలు ప్రచారం చేసావు. వాటివల్ల నీకే లాభం కలక్కపోగా, నా కూతురికి నేను కుదిర్చిన సంబంధం తప్పిపోయింది. మీ ఆయన దొంగగా ముద్ర వేయించుకుని, పోలీసుల చేత దెబ్బలుతిని, ఆ ఇనస్పెక్టర్‌కి లంచం కట్టి బైటపడ్డాడు. ఇలా నువ్వు కోతమీద కోత కోసుకుంటూ వెళ్తుంటే, తప్పుమీద తప్పు జరిగిపోయి, అప్పుమీద అప్పు పెరిగిపోతోంది. ఇప్పుడు అప్పుమీద వడ్డీ కట్టడానికైనా నీ జీతం పనికొస్తాదనుకుంటే, నువ్వేమో ఉద్యోగం చెయ్యనంటున్నావు. నీకున్న పెద్ద శత్రువు నీ నోటిదురదే! ఇకనైనా దాన్ని దూరం చేస్కుంటే తప్ప నీకూ, ఈ కుటుంబానికీ మంచిది కాదు"

తన భార్యకి తన తల్లి చెప్పవలసిందంతా చెప్పిందనే భావన రాయుడికి కలిగింది. సమాధానం చెప్పడానికి పద్మావతి చాలా టైమ్ తీసుకుంది. మాటలు చెప్పకపోయినా మనసు తీవ్రంగానే ఆలోచిస్తోంది. ఇంట్లో కూర్చుని బలవంతంగా కాలాన్ని నెట్టడంకంటే, ఉద్యోగం చేస్తే తనకీ కాలక్షేపం అవుతుంది. యింటికీ ఆదాయం వస్తుంది. చేసిన అప్పులూ సులభంగా తీరిపోతాయి. కానీ, యీ సంగతి ప్రియాంకకి తెలిస్తే? ఇది మొదటి సందేహం! ఒకవేళ తన జాబ్ విషయం ప్రియాంకకి తెలీకుండా దాచిపెట్టినా.. మరో వారం పది రోజుల్లో రాయుడికెలాగూ మేనేజర్ ప్రమోషన్ వచ్చేస్తుంది.

**కొత్తగాలి...**

**వర్షాభావంలో**
**ఆశాభావం**
**అల్పపీడనం**

*- గంపా శ్రీదేవి,*
*సింహాచలం*

అప్పుడెలాగూ యీ వూర్నించి గుంటూరు వెళ్లిపోవాలి. వెళ్లాక ఆదాయం ఎక్కువగా వస్తుంది కాబట్టి, యిప్పుడున్న అప్పుల్ని ఓ నెల రెండు నెలల్లో తీర్చిపారెయొచ్చు. ఈ మాత్రందానికి యిప్పుడు ఉద్యోగంలో జాయినవడం వేస్ట్! ఈ ఆలోచనల్ని ఒకటికి రెండుసార్లు రివైండ్ చేసి, ఫ్రంట్ ఫార్వర్డ్ చేసి ఆలోచించాక భర్తకీ, అత్తకి వివరించింది.

మర్నాడు ఉదయం ఇంటర్వ్యూ కార్డు వచ్చిన కంపెనీలో పనిచేస్తున్న తన ఫ్రెండుకి రాయుడు ఫోన్‌చేసి ఆ జాబ్ గురించి, యింటర్వ్యూ గురించి ఎంక్వయిరీ చేశాడు. ఓ వారం తర్వాత యింటర్వ్యూ వుంటుందని, రిజల్ట్సు మాత్రం కాస్త లేట్‌గానే ఎనౌన్స్ చేస్తారని ఆ ఫ్రెండు చెప్పాడు. ఆ విషయం పద్మావతికి చెప్పాడు రాయుడు.

"నువ్వు ఇంటర్వ్యూకి వెళ్లడమే బెటరు. అది గూడా జస్ట్ ఫార్మల్ యింటర్వ్యూయే తప్ప, నువ్వు ఆన్సర్ చెయ్యలేనంత టఫ్‌గా ఏం వుండదు. సెలక్టయిపోతావ్"

"సెలక్టవడం గురించి నాకెలాంటి డౌటూ లేదు. కానీ.." అంటూ పద్మావతి నసుగుతుంటే కొండమ్మ కచ్చితమైన తీర్పు యిస్తున్నట్టుగా చెప్పేసింది.. "ఈలోగా మీ ఆయనకి ప్రమోషన్ వచ్చేస్తే ఉద్యోగం వద్దని రాజీనామా చెయ్యడం ఎంతసేపు? ఇంకా నువ్వా ప్రియాంకా గురించి ఆలోచిస్తే ఓ పని చేద్దాం"

"ఏంటీ? "

"నువ్వు ఉద్యోగంలో జాయినవడానికి ముందురోజు యీ యిల్లు ఖాళీచేసి మరో ఏరియాకి మారిపోదాం. ఈ ఫోన్ తీసేసి మరో ఫోన్ పెట్టుకుందాం. అంతేగానీ.. ఎవరి గురించో ఆలోచిస్తూ నీ గురించి నువ్వు మర్చిపోకు"

అత్తగారు చెప్పిన సలహాకి పద్మావతి తల వూపడం చాలా అరుదుగా జరుగుతుంది. అలాంటి అరుదైన రోజుల్లో ఆ రోజు కూడా జాయినయింది.

రెండు రోజుల తర్వాత ప్రియాంక ఫోన్ చేసింది.

అమలాపురం బంధువుల్నించి ఫోన్ వచ్చిందని, రెండు రోజుల్లోగా వాళ్లొచ్చి, కేవలం ఒకేఒక రోజులో యిక్కడున్న పనులన్నీ చూసుకుని మళ్లీ వెళ్లిపోతారని చెప్పింది. అప్పుడప్పుడే చల్లబడుతున్న మంట మళ్లీ భగ్‌మంటూ పైకిలేచింది.

ఆ రోజు పరదేశమ్మ, ఆవిడ భర్త యాకూబ్ ఆ యింటికొచ్చారు. ఆ వీధికి మూడు వీధుల అవతల రాజగోపాల

## కొత్తగాలి...

**కొంగలు వాలిన**
**చింత చెట్టు..**
**కళాత్మకంగా చూడు**
**అదో మల్లెతీగ కాదూ**

– జి. శ్రీశైలం,
పెద్దచెల్మెడ, మెదక్ జిల్లా

రావుగారనే శ్రీమంతుడి మేడ వుంది. అది చాలా పెద్ద మేడ. ఆ భవనంలో పనిచేస్తున్న సీనియర్ నౌఖర్లే ఆ దంపతులు.

"ఏంటి పరదేశమ్మా చాలా కాలం తర్వాత మా యింటికొచ్చావు" అని పలకరిస్తూనే యిద్దరికీ కాఫీలు అందించింది పద్మావతి. వాళ్లిద్దరూ పద్మావతిని, కొండమ్మని కలవడానికి అప్పుడప్పుడు వస్తుండేవారు. అంచేత వారికి పద్మావతి దగ్గర కాస్త ఎక్కువ చనువే వుంది. వాళ్లు కాఫీలు తాగుతూ మాట్లాడారు.

"వద్దాం వద్దాం అనే అనుకుంటాం గానీ, రాడానికి టైమ్ దొరకడం లేదమ్మా. మా

పెద్దయ్యగారూ, అమ్మగారూ వున్నప్పుడు వచ్చిపోయే బంధువులు, స్నేహితుల్తో ఒకటే రద్దీగా వుంటాది గదా" అంది పర దేశమ్మ.

"ఇప్పుడు వాళ్లు లేరా?" యధాలాపంగా అడిగింది పద్మ.

"లేదమ్మా! ఏనాటినించో షిర్డీ వెళ్లి సాయిబాబాని దర్శించుకోవాలనుకుంటు న్నారు. దేన్నికైనా ఆ బాబా అనుమతి వుండాలి గదా! ఇన్నాళ్లకి బాబానించి పిలు పొచ్చింది. కుటుంబసమేతంగా వెళ్లారు. ఓ పదిరోజుల్దాకా కాపలా కాయాల్సింది కూడా మేమే! మిమ్మల్ని చూసి చాన్నాళ్లైంది కదాని యిలా వచ్చేసాం" యాకూబ్ ఆ మాటలు చెప్తుండగా అతని దగ్గరున్న సెల్‌ఫోన్ మోగింది. అతను కాస్త పక్కకి వెళ్లి మాట్లాడుతున్నా ఆ మాటలు పద్మావ తికి వినిపిస్తూనే వున్నాయి.

ఎవరో టీవీ డైలీ సీరియల్ తీసేవాళ్లు ఓ వారం రోజులపాటు రాజగోపాలరావు గారి భవనాన్ని అద్దెకు యిమ్మంటున్నారు. తమ యజమాని ఊళ్లో లేనప్పుడు, ఆయన అనుమతి లేకుండా తను అద్దెకివ్వమని చెప్తున్నాడు యాకూబ్. ఈ విషయం యజమాని వున్నప్పుడు మాట్లాడుకుంటే, వాళ్లు యాత్రలకెళ్లినప్పుడు భవనంలోని రూముల తాళాలు తమకిచ్చేవారని, యిప్పుడు రెండు రూమ్సే తెరచివున్నాయని యాకూబ్ చెప్పి ఫోన్ ఆఫ్ చేసాడు. రాజ గోపాలరావుగారి భవనం బైటనించి చూడ్డానికి లేదు. లోపలకూడా ఆయన కళాత్మకమైన అలంకారాలు చేయించడం వల్ల సినిమా, టీవీ షూటింగ్‌లకి చాలా అనుకూలంగా వుంటుంది. ఓ డైలీ సీరియ ల్‌లో ఆ బిల్డింగ్‌ని చూపించారు. పద్మా వతి కూడా ఆ బంగళాని చూసింది టీవీ సీరియల్లోనే!

"పోనీ, ఓ నాలుగు రోజులు అద్దెకిస్తే ఏంపోయింది? ఇంటికి రెంటూ వస్తుంది. మీకు టిప్పు కూడా దిట్టంగా ముడుతుం దిగా" అంది పద్మావతి నవ్వుతూ.

పరదేశమ్మ అయిష్టంగా తలాడించింది. "వద్దమ్మగారూ! బంగళాకి రెంట్ వచ్చే మాట నిజమేగానీ ఆ డబ్బు పోయేది మా యజమానిగారికి. మా చేతిలో పడే టిప్పులు మాత్రం అంతంత మాత్రమే నమ్మా" అంది పరదేశమ్మ.

యాకూబ్ కూడా అయిష్టాన్నే వ్యక్తప రుస్తూ "వాళ్ళిచ్చే టిప్పులు ఎలాగూ పెద్ద గా వుండవు. మీకు బోలెడంత రెంట్ యిస్తున్నప్పుడు యీ మాత్రం టిప్పులు చాల్లే అన్నారండి ఓసారి. వాళ్లు చేసిన చండాలం వల్ల మా అయ్యగారిచేత మేం తిట్లు తినాల్సొచ్చింది. ఇంట్లో వున్న సామానన్నీ, బల్లల్నీ, బర్రూబర్రూమని లాగడం వల్ల గచ్చులన్నీ బీటలేశాయి. బాత్రూముల్ని యిష్టం వచ్చినట్టు వాడే సారు తప్ప, శుభ్రం మాత్రం చెయ్యలేదు. గుట్కాలు అవీ యివీ నమిలేసి బంగళాలో ఎక్కడబడితే అక్కడ ఉమ్మేశారు. ఇవన్నీ జరక్కుండా మేం దగ్గరుండి చూస్కోవా లని మా అయ్యగారంటారు. ఆళ్లు చూస్తే మమ్మల్ని దగ్గరికి రానిచ్చేవారు కాదు..."

ఇలా ఆ భార్యభర్తలు ఓ పదినిమిషాల పాటు భవనంలో షూటింగ్‌లు జరగడం వల్ల కలిగే యిబ్బందుల గురించి వివరిం చారు. మరికాస్సేపు ఆ మాటా యీ మాటా మాట్లాడి వారిద్దరూ వెళ్లిపో యారు. వారు వెళ్లిపోయాక పద్మావతి మస్తిష్కంలో ఓ ఆలోచన మెరిసింది.

టీవీ సీరియల్‌వాళ్లు అద్దెకు తీసుకు న్నట్టే, తనూ ఆ బిల్డింగ్‌ని ఒక్క రోజుకి అద్దెకి తీసుకుంటే?

తీసుకున్న ఆ ఒక్కరోజే ప్రియాంకని ఆ బంగళాకి పిలిచి, అదే తమ యిల్లని చూపించేస్తే?

ఆ బంగళా కాంపౌండ్‌లో వున్న మూడు కార్లతో పాటు తమ కారు కూడా కలిపి మొత్తం నాలుగు కార్లు చూపించేస్తే?

ప్రియాంక ముందు తన పరువు నిలబడ్డమే కాదు.. ఆకాశం లెవెల్‌కి ఎదుగుతుంది. ఆ రోజు ఆ బంగ్లా నౌఖర్లు తన యింటికి రావడం మంచిదే అయిందనుకుంది. ఇంటి దగ్గరే వున్న రాయుడికి సాయంత్రం కాఫీ యిచ్చాక, సోఫాలో కూర్చుని యీ విషయం ప్రస్తావించబోతుండగా కాలేజీనించి కాంచన వచ్చింది. ఆమెను కూడా శ్రద్ధగా వినమని చెప్పి, తనకొచ్చిన ఆలోచన వివరించింది. విషయమంతా విన్నాక, ఆ యిద్దర్లో ఏ ఒక్కరూ 'భలేగుంది' అనలేదు. కనీసం 'బాగానే వుంది' అని కూడా అనలేదు.

రాయుడు మాత్రం "అలా చెయ్యడం అవసరమా? " అని అడిగాడు.

"అవసరం కాబట్టే, ఆ ప్రియాంక ముందు ఆ రోజు అలా మాట్లాడాను. అవసరం కాబట్టే కారు కొన్నాం. అలాగే యిదీ అవసరమే. మనం ప్రియాంకకి ఆ బిల్డింగ్ చూపించేసి, అది మనదేనని చెప్పేసాం అనుకోండి, దానికా యింప్రెషన్ పర్మినెంట్‌గా వుండిపోతుందిగా"

పద్మావతి చాలా ఉత్సాహంగా చెప్తూనే వుంది. రాయుడికి స్వతంత్రంగా ఓ ఐడియా వస్తే, దానిమీద పద్మావతి ఆమోదముద్ర పడితే తప్ప అమల్లోకి రాదు. కానీ, పద్మావతికి ఏదైనా ఐడియా వస్తే, ఆ యింట్లో రబ్బర్‌స్టాంప్‌లా బతికే రాయుడు మాత్రం వెంటనే సీలు గుద్దాల్సిందే!

రాయుడు కాస్త సంకోచిస్తూనే, తన సంశయాన్ని వివరించాడు. "అది కాదు

పద్మా, మొన్ననే కదా ఆఫీసుకి కారు తీసుకెళ్లి సుపీర్యార్టీ ప్రదర్శించి ఎన్ని యిబ్బందులు పడ్డానో నీకూ తెలుసు. డబ్బుకి డబ్బూ పోయింది. దెబ్బలకి దెబ్బలూ తగిలాయి. మళ్లీ, యీ ఫాల్స్ ప్రదర్శన అవసరమా? " అన్నాడు.

కాంచన గతంలో ఎప్పుడూ వదిననే సమర్థించేది. పద్మావతి ఆలోచనలో ఓ తెలివి, ఓ ముందుచూపు వుంటాయనే భ్రమలో వుండేది. కానీ తన అన్నయ్య పోలీసు కేసులో యిరుక్కుని దెబ్బలు తిన్నాక ఆమెకున్న భ్రమలు కరిగిపోయాయి. అందుకే వదిన యీసారి చెప్పిన ఐడియాకి ఓటు వెయ్యలేకపోయింది.

"ఎలాగూ మధురవాడలో ఓ బిల్డింగ్ కడుతున్నామని చెప్తున్నాం. టైముంటే ఆవిణ్ణి కారులో తీసుకెళ్లి ఆ బిల్డింగ్ చూపిస్తాం కదా! ఆ మాత్రం దానికి రాజగోపాలంగారి బిల్డింగ్‌ని అద్దెకు తీస్కోవడం అవసరమాని.. నువ్వే ఆలోచించు" అంది. కానీ పద్మావతి కాంచన వాదనని ఏ మాత్రం ఆమోదించలేదు.

"ఎక్కడో కడుతున్న బిల్డింగ్‌ని చూపించి, అది మనదేనని చెప్పడం వేరు. సిటీ సెంటర్లో సినిమా షూటింగ్‌లకి సైతం అద్దెకిచ్చే బ్యూటీఫుల్ బిల్డింగ్‌ని చూపించి, యీ బిల్డింగ్ మాదే అని చెప్పడం వేరుకదా! ప్రియాంకని ఆశ్చర్యపరచాలంటే యీ బిల్డింగ్ చూపించాలి"

పద్మావతి ఓ నిర్ణయం తీసుకుంటే, ఆ నిర్ణయాన్ని గెలిపించడానికి ఎదుటివారి వాదనలో ఏవో లోపాలు చూపించి, ఎన్నిసార్లయినా ఓడించడానికి ప్రయత్నిస్తుంది.

రాయుడు శూన్యంలోకి చూస్తూ కాస్త నిర్లిప్తంగా అన్నాడు, "ఆఫీస్ స్టాఫ్ అందర్ని ఆశ్చర్యపరచాలని ఆ రోజు కారు తీసుకెళ్లినందుకు ఏమైందో నువ్వు మర్చిపోయినా.. నా ఒంటిమీదున్న దెబ్బలింకా నన్ను మర్చిపోనివ్వడంలేదు"

పద్మావతి ముఖంనిండా చిరాకు నింపుకుని మాట్లాడింది.

"మీరు మరీ అర్థం లేకుండా మాట్లాడతారేంటి? ఆ రోజు అలా జరిగిందంటే దాని నేపథ్యం వేరు! మీ గోడౌన్‌లో దొంగతనాలు జరుగుతున్నాయి కాబట్టి, ఆ వస్తువుల్ని ఆఫీసువాళ్లే ఎత్తుకుపోతున్నారని అనుమానిస్తున్నారు. అదే సమయంలో మీరు కారు వేసుకెళ్లారు. ఒకవేళ మీరే ఆ దొంగేమోనని అనుమానించి వుంటారు. అనుమానం మీద అరెస్ట్ చేశారు. కానీ, యిది అలాంటిది కాదు. మనం ఓ రోజంతా ఆ బంగ్లాలో వుంటాం. అదేరోజు ప్రియాంకని అక్కడికి పిలిచి బంగళా అంతా చూపించి ఓ స్వీటు, హాటు పెట్టి కాఫీ యిచ్చి పంపించేస్తాను.. బస్"

కాస్సేపు అన్నా చెల్లెళ్లు మౌనం వహించారు. పద్మావతి లేచి నిలబడి, "ఓసారి ఆ బిల్డింగ్ దగ్గరకెళ్లి చూసేసి, పనివాళ్లతో దాని రెంట్ విషయం మాట్లాడి వద్దాం. మీరు కారు తియ్యండి" అంది.

రాయుడు ఆఖరి యత్నంగా అన్నాడు. "అది కాదు, ప్రియాంక యీ వూళ్లోనే వుంటోంది. రేపు ఆ బిల్డింగ్ చూపించినా, ఆ తర్వాత వచ్చినప్పుడేం చూపిస్తాం? "

ఈ ప్రశ్నతో పద్మావతి ప్రయత్నానికి సంకెళ్లు పడతాయనుకున్నాడు కానీ పడలేదు.

"ఆ బంగళా అమ్మేసి మధురవాడలో కొత్త బంగళా కట్టిస్తున్నామని చెప్పేస్తాను. నేను ఏది ఆలోచించినా చాలా దూరదృష్టితో ఆలోచిస్తాను. మీరు బట్టలు మార్చుకుని రెడీ అవండి" అన్చెప్పి తన గదిలోకి వెళ్లిపోయింది. రాయుడు ఆమె వెంట వెళ్తే, కాంచన తన గదిలోకి వెళ్లింది.

హాల్లో జరుగుతున్న సంభాషణంతా వంటగది గుమ్మం దగ్గర కూర్చున్న

కొండమ్మ వింటూనే ఉంది. నిట్టూర్చడం తప్ప మరేమీ చెయ్యలేదు కాబట్టి నిట్టూర్చింది. ఆమె మనసులోని మాటవినే మానవుడెవరూ అక్కడ లేకపోవడం వలన, తనకి తనే స్వగతం పలుక్కుంది. 'నిద్రపోతున్నాళ్లని లేపగలం గానీ, నిద్ర నటించేవాళ్లని లెగ్గొట్టడం ఎవరి తరం? నిన్నగాక మొన్ననే పోలీసులు, లాఠీ దెబ్బలు, ఇనస్పెక్టర్‌కి లంచాలు.. యివన్నీ అప్పుడే మా కోడలుగారికి పరగడుపు అయిపోయాయి. కుక్కతోక వంకరంటారు. ఎంత సాపు చేసినా, మళ్లీ అది వంకర తిరిగిపోతుందట.. యీవిడగారి బుద్ధి కూడా అలాంటిదే! ఎరువు సొమ్ము బరువు చేటంటారు. ఎవరి భవనాన్నో అద్దెకు తీస్కుని, యీ బంగ్లా అంతా మాదే నని ఆ కోటీశ్వరుడి కోడలికి చెప్తాదట. ఈవిడగారు ఏ ఐడియా వేసినా అది చీదేస్తుంటాది. ఆ అయిడియా బెడిసికొట్టి, యీవిడ పీకలకే చుట్టుకుంటున్నది. ఇప్పుడీ ఐడియా ఎన్ని పీకులాట పంచాంగాలు తెచ్చిపెడతాదో!'

కొండమ్మ స్వగతాలు ఆగేయి. అందుకు కారణం పద్మావతి, రాయుడు గదిలోనించి బైటకి రావడమే! పద్మావతి కాంచనని పిలిచేలోగా కాంచన కూడా అలంకరించుకుని తన గదిలోనించి వచ్చింది.

"మేం వెళ్లొస్తాం" అంది కొండమ్మవైపు చూడకుండా, కంటికి కనబడని గాలివైపు చూస్తూ. ముగ్గురు వీధి గుమ్మంవైపు వెళ్లబోతుంటే.. "హాఁచ్" మనే తుమ్ము శబ్దం ముందు వినిపించింది. వెంటనే జగన్నాథం పంతులు రూపం కనిపించింది.

ముక్కుపొడి పీలుస్తూ పంతులుగారు లోపలికి వస్తూనే "ఎక్కడికి?" అని అడిగాడు ఓ దిక్కు మాలిన నవ్వు నవ్వుతూ.

పద్మావతి అడుగు తీసి గుమ్మం బయట పెట్టాలంటే, వర్జ్యాలు, రాహుకాలాలు, యమగండాలు చూసుకొని మరీ బయల్దేరుతుంది. ఇప్పుడు కూడా అలాంటి ఆటంకాలేవీ లేవని గంటల పంచాంగంలో చూసే బయల్దేరుతుంటే పంతులుగారు ఎదురొచ్చారు. ఆవిడకి కట్టలు తెంచుకున్నంత కోపం వచ్చినా, బలవంతంగా నిగ్రహించుకుంది. కొండమ్మకి మాత్రం సహనం చచ్చి, కూర్చున్న చోటనించి లేచి గబగబా వాళ్ల దగ్గరకి వచ్చింది.

"పంతులుగారూ, బైటకెళ్తున్న మనుషులకి మీరు ఎదుర్రావడమే తప్పు! కానీ, మీరు వచ్చింది చాలక.. ఎక్కడికీ అని అలా సాగదీస్తూ ప్రశ్నిస్తారేంటి? బయటకెళ్లే మనుషుల్ని ఎక్కడికి అని అడక్కూడదన్నది మీకు మరొకరు చెప్పాలా" అంది

## అంకితమిస్తే.. అంతేనా?



అప్పట్లో కట్టమంచి రామలింగారెడ్డి ఆంధ్రా యూనివర్సిటీ వైస్-చాన్సిలర్. ఓ కవిగారు తాను రాసిన గ్రంథాన్ని కట్టమంచి వారికి అంకితమిచ్చి, తర్వాత దానిని పాఠ్య గ్రంథముగా నిర్ణయించాలని ఆయనను ఆశ్రయించి, వత్తిడి తెచ్చారు. ఆ విషయం పరిశీలించమని తెలుగుశాఖాధ్యక్షులైన పింగళివారిని కట్టమంచివారు కోరారు. ఆ యూనివర్సిటీ, ఇతర కాలేజీల సిలబస్‌ను రూపొందించే పింగళివారు ఆ గ్రంథాన్ని నిర్ద్వంద్వంగా తిరస్కరించారు. తర్వాత ఆ విషయమై కట్టమంచివారు పింగళివారిని ఆరా తీశారు. దాంతో పింగళివారు, 'ఆ గ్రంథాన్ని మీ కంకితం చేసినంత మాత్రాన పాఠ్యగ్రంథార్హత సంపాదించుకోదు. అందులో విషయానికి అలాంటి యోగ్యత ఉండాలి కదా' అని ఘాటుగా జవాబిచ్చారు.

ఆవేశంగా. ఆవిడంత ఆవేశంగా అన్నా జగన్నాథం పంతులుగారు మాత్రం తన సహజ ధోరణిలోనే సమాధానం చెప్పాడు.

"ఎహ్హెహ్హెహ్హె! మీదంతా చాదస్తం కొండమ్మగారూ! బైటకెళ్తున్న మనిషిని వెళ్తున్నప్పుడు కాక.. తిరిగొచ్చి తొంగు న్నాక అడుగుతామా ఎక్కడికీ అని? మరేం ఫర్వాలేదమ్మా"

"మరేం ఫర్వాలేదని మీ మట్టుకు మీరు చెప్పేస్తే సరిపోయిందా? మా నమ్మకాలు,, మా భయాలు కూడా మాకుంటాయ్ కదం డీ" కొండమ్మ ఆవేశం తగ్గించకుండానే చెప్పింది.

"చూడండి కొండమ్మగారూ- ఎక్కడికీ

కొత్తగాలి... 

దేవుడి సన్నిధిలోను
గుడి బయటా కూడా
తీర్థమే

– ఎస్. రజని,
రాయపూర్, ఛత్తీస్‌గడ్

అని అడగడం తప్పంటున్నారు. మనం బైటకెళ్లి ఆటోరిక్షా ఎక్కామనుకోండి. ఆ ఆటోవాడు ఎక్కడికని అడగడా? బస్సె క్కితే, ఎక్కడికీ అని కండక్టరు అడగడా? ఏం, నేను ఆటోవాడి పాటిచెయ్యనా? "

కొండమ్మ మరి వాదించదలుచుకోలేదు. లోపలకెళ్లి కాళ్లు కడుక్కొచ్చి, ఓ నిమిషం ఆగి ఆ తర్వాత బైటకెళ్లమని రాయుడికి చెప్పింది. అతను తన గదిలోకి వెళ్లాడు. పద్మావతికి చెప్పకపోయినా, ఆవిడా వెళ్లి కాళ్లు కడుక్కొచ్చింది. "మీరు మా అత్తయ్యతో మాట్లాడుతుండండి" అన్చెప్పి రాయుడు, కాంచనలతో సహా బైటకి నడిచి.. కారు ఎక్కబోతుంటే, ఓ ఐదారు మంది నోట్ బుక్ పట్టుకొచ్చి "నమస్కార మండి" అన్నారు ముక్తకంఠంతో.

"ఎవరు మీరు? " అడిగాడు రాయుడు.

"మేమే సార్! దసరా మామూళ్ల కోసం వచ్చాం. గతంలో కార్పొరేషన్, ఎలక్ట్రిసిటీ, టెలిఫోన్ డిపార్ట్‌మెంట్స్‌వాళ్లం సెపరేట్ సెపరేట్‌గా వచ్చి మీలాంటి పెద్ద వాళ్లకి యిబ్బంది కలిగించాం. కానీ యిప్పుడు మా మూడు డిపార్ట్‌మెంట్లవాళ్ల దసరా మామూళ్ల కోసం ఓ గ్రూప్‌గా మారి కల క్షన్ చేస్తున్నాం. తర్వాత మేము మేము పంచుకుంటాం. మేం వచ్చింది ఆరుగురమే కానీ దీన్ని యిరవైమంది పంచుకోవాలి" అంటూ ఆ గుంపుకి లీడర్‌గా ఏర్పడిన వాడు నోట్ బుక్ తెరచి ఓ పేజీ చూపిం చాడు. అందులో కొంతమంది పేర్లు, పక్కన వాళ్లు వెయ్యాల్సిన డబ్బు కూడా రాసేసి కనిపించాయి. సుబ్బరాయుడి పేరు పక్కన ఆరు వందలు వేసుంది. రాయుడు, పద్మావతికి ఆ ఫిగర్ చూసి ఆ శ్చర్యమే కాదు, ఆగ్రహం కూడా కలిగింది.

"ఇదేంటయ్యా, నేనెంత వెయ్యాలో కూడా మీరే ఫిక్స్ చేసేశారు? " చిరాగ్గా అడిగాడు రాయుడు.

"మావి మూడు డిపార్ట్‌మెంట్లు కదండి. అంచేత మీకు కన్ఫ్యూజన్ లేకుండా మా కమిటీయే ఆలోచించి ఆ ఫిగర్ వేసింది సార్" లీడర్ సమాధానమిచ్చాడు.

"మరీ ఆరొందలేమిటి నాన్‌సెన్స్ అంతా మీ యిష్టమేనా? " పద్మావతి సీరియస్‌గా అడిగింది.

ఆ గుంపులో ఒకడు ఆరువందలు అడ గడానికి గల జస్టిఫికేషన్ యిచ్చాడు. "లాస్ట్ యియర్‌కీ, యీ యియర్‌కి రేట్లు ఎలా పెరిగాయో ఆలోచించండి మేడమ్. కేజీ కంది పప్పు ధరెంత? కూరగాయల రేట్లు ఏ రేంజ్‌లో పెరిగాయి? ఇలా

అన్నింటి రేట్లు పెరిగిపోతున్నప్పుడు మేం దసరా మామూళ్లు పెంచడంలో తప్పేం వుంది? జీతాలు పెరుగుతున్నాయి. మేం మాత్రం రెక్కాడితే డొక్కాడని పరిస్థితి నించి పైకి రాలేకపోతున్నాం. మా పరిస్థితి, మా అవసరాలు, ఆదాయాలు కూడా మీరు గమనించాలి. ఇవన్నీ ఆలోచించే మా కమిటీ మీ ఫ్యామిలీకి యీ రేటు ఫిక్స్ చేసింది" అతను చెప్పిన విధానం కూడా రిక్వెస్ట్ చేస్తున్నట్టు కాకుండా డిమాండ్ చేస్తున్నట్టే వుంది. ఆ డబ్బు యివ్వకపోతే మీపైన చర్య తీస్కుంటాం జాగ్రత్త అని హెచ్చరిస్తున్నట్టే వుంది.

ఆ మాటలు విని రాయుడి కంటే ఎక్కువ ఆవేశపడింది పద్మావతే. "మీరు అడిగే పద్ధతి దసరా మామూళ్ల గురించి వర్కర్స్ మమ్మల్ని రిక్వెస్ట్ చేసి అడుగుతున్నట్టు లేదు. కాస్టాఫ్ లివింగ్ పెరిగిపోయింది కాబట్టి జీతాలు పెంచమని గవర్నమెంటుని డిమాండ్ చేస్తున్నట్టుంది. రేట్లు మీ ఒకరికే పెరగలేదుగా! మాకూ పెరిగాయి. మేమూ ఉద్యోగస్థులమే, వ్యాపారస్థులం కాదు. వీళ్లకో వంద యిచ్చెయ్యండి" అంది రాయుడుతో.

ఆ గుంపులో అందరూ ఆవిడ చెప్పిన ఎమౌంట్ చాలా తక్కువని మాట్లాడారు. లీడర్ కూడా మాట్లాడుతూ "చూడండి మేడమ్, రాయుడుగారూ ఉద్యోగస్థులే, మేమూ ఉద్యోగస్థులమే. కానీ, మా మధ్య బోలెడంత డిఫరెన్సుంది కదా" అన్నాడు.

రాయుడు భార్యని సమర్థిస్తూ "డిపార్ట్‌మెంటుల్లో డిఫరెన్సులున్నా, అందరం ఉద్యోగలస్థులమే తప్ప, నేను బిల్‌గేట్స్‌నీ, మీరు మామూలు ఎంప్లాయిసూ కారుగా" అన్నాడు.

లీడర్ తన జేబులో నించి కొన్ని కరెన్సీ నోట్లు తీశాడు. అందులో వున్న వెయ్యి నోటుని, వంద నోటుని, పది నోటునీ తీసి చూపించాడు. "చూడండి మేడమ్. యిది పది రూపాయల నోటు. ఇది వంద రూపాయల నోటు, ఇది వెయ్యి రూపాయల నోటు. అన్నీ కరెన్సీ నోట్లే! అన్నింటినీ గవర్నమెంట్ ఆఫ్ ఇండియానే అచ్చుకొట్టింది. కానీ యీ పది రూపాయల నోటు కంటే పదిరెట్లు పెద్దదీ వంద నోటు. వందకంటే పది రెట్లు పెద్దదీ వెయ్యినోటు.. అలాగే, మీరు ఓ కంపెనీలో ఎంప్లాయీ కావచ్చు, మేం గవర్నమెంటు ఎంప్లాయీస్ కావచ్చు, కానీ మీరు రీజినల్ మేనేజర్‌గా పనిచేస్తున్నారుగా.."

లీడర్ చెప్పిన ఆఖరి మాటకు తుళ్లిపడ్డాడు రాయుడు. "నేను రీజినల్ మేనేజర్నని మీకెవరు చెప్పేరు? "

"ఊరంతా కోడై కూస్తోంది కదండి"

"అందులో ఒక్క కోడి పేరు చెప్పు"

"మీ వీధిలో వుండే సూపర్‌వైజర్ ఆదినారాయణ"

దంపతులు ఒకర్నొకరు చూసుకున్నారు. ఆదినారాయణే ఏలూరు ఫోన్‌చేసి మరీ కాంచనని చేస్కోబోయే మాధవరావుకి రాయుడి ప్రమోషన్ గురించి చెప్పి, అనుకున్న దానికంటే ఎక్కువ కట్నం అడిగించాడు. ఇప్పుడు దసరా మామూళ్ల వారికి చెప్పి ఆరొందలు అడిగిస్తున్నాడు. రాయుడికి ప్రమోషన్ వచ్చిందన్న గ్యాస్ కబుర్లని యిరుగుపొరుగుకి చెప్పడం వల్ల ప్రయోజనం ఏదీ కలగకపోగా, ప్రమాదాలే కలుగుతున్నాయి. వాళ్లకి ఏంచెప్తే ఏంవస్తుందో అర్థంకాక చివరికో అబద్ధం చెప్పడానికి ఫిక్స్ అయ్యాడు. తనకి కొన్నాళ్ల కిందట ప్రమోషన్ వచ్చిన మాట నిజమే! కానీ అది కేవలం లీవ్ వేకెన్సీయే! తర్వాత ఆ పోస్ట్‌నించి మళ్లీ క్లాస్‌త్రీ జాబ్‌లోకి వచ్చేసానన్నాడు. ఈసారికి దీంతో ఎడ్జస్ట్ అవండి అన్చెప్పి మూడువందలు వారి చేతిలో పెట్టి పంపించేసాడు. ఇక మీదట

మాటల్లో గ్యాస్ కొట్టేముందు దాని ఫలితాల గురించి, తర్వాతి ఎఫెక్ట్స్ గురించి క్షుణ్ణంగా ఆలోచించి మరీ కొట్టాలని రాయుడు తన మనసులో అనుకోవడంతో పాటు, పద్మావతితో కూడా చెప్పాడు. ఆమె సరేనని చెప్పకపోయినా, ఆ అర్థం వచ్చేటట్టుగా తల ఆడించింది.

రాయుడు భార్యా సమేతంగా కారులో వెళ్లాక కొండమ్మ పంతులుగారికి కాఫీ యిచ్చి వెనకాముందూ చూడకుండా పరుగులు తీస్తున్న కోడలు గురించి, ఆమె వెంట భార్యావిధేయుడిగా పరుగులు తీస్తున్న రాయుడి గురించి చెప్పి బాధపడింది. "గతం గురించి గొప్పగా భావిస్తూ అలాగే జీవితమంతా సాగాలని ఆ పద్మావతి అనుకుంటోంది. ఆవిడ ఊహల్లో వున్నంత అందంగా జీవితం గడవకపోయినా, ఉన్నంతలో మెరుగ్గా బతగ్గలిగితే చాలనుకుంటే మా యిల్లు ఏనాడో బాగుండేది. ఆకాశం మీదనించి అకస్మాత్తుగా నోట్ల కట్టలు మా యింట్లో పడిపోయి, మా జీవితాలు మారిపోతాయనుకునే పిచ్చి ఊహల్లోనించి బైటపడి, వాస్తవంగా ఆలోచిస్తూ ఆవిడ కూడా ఏదైనా ఉద్యోగం చేస్తే బావుండేది. కానీ అలా చెయ్యకుండా, మాటిమాటికి జాతకాలు చూపిస్తూ, దిన వారఫలాలు చూసుకుంటూ చదువుకున్న మూర్ఖురాలిగా తయారవుతోంది" అంది.

జగన్నాథం పంతులు ఆ మాటలకి చక్కగానే స్పందించి సిన్సియర్‌గా చెప్పాడు.

"చూడమ్మా, మీ ఆవేదన నాకు అర్థమవుతోంది. కానీ యిక్కడో విషయం అందరూ గ్రహించాలి. జాతకమయినా, జ్యోతిష్యమయినా.. సింపుల్‌గా చెప్పాలంటే మనచేతిలో వున్న టార్చ్‌లైట్ లాంటిదే! చీకట్లో దారి చూపించే దీపాలే తప్ప చుట్టూ వున్న చీకటిని సంహరించే దివ్యశక్తులు కావు. అయితే, యీ కరదీపికల్ని పట్టుకుని మనం రాచబాటలో నడుస్తున్నామా? ముళ్లకంచెల్లోకి నడుస్తున్నామా? అనేది ఎవరికి వారే నిర్ణయించుకోవాలి. దాన్నే విచక్షణా జ్ఞానం అంటారు. విచక్షణంటే మంచికీ, చెడుకీ మధ్యనుండే భేదాన్ని తెలుసుకునే శక్తన్న మాట. ఆ శక్తి వున్నవారు కూడా చేతిలో దీపం పట్టుకుని ముళ్ళదారులవైపు నడుస్తుంటే ఏం అనుకోవాలి? మీ బోటివారు చెప్పినా వారు మారకుండా వాళ్లని వాళ్లు సమర్థించుకుంటున్నారంటే.. ఏం అనుకోవాలి? బుద్ధి కర్మానుసారిణి అనుకోవాలి. ఇంక నేను మీ వాళ్లకి జాతకాలు చెప్పడ

## విడాకులిచ్చినట్లున్నదే..?

1949లో నిడుబ్రోలులో అభినవ తిక్కన బిరుదాంకితులు తుమ్మల సీతారామమూర్తి సన్మాన సభ. దానికి అధ్యక్షత వహించిన పింగళి లక్ష్మీకాంతంగారిని సభానంతరం కృష్ణశాస్త్రివారి బసకు తీసుకెళ్లారు. అక్కడ కాటూరి వేంకటేశ్వరరావు, కృష్ణశాస్త్రి కబుర్లు



చెప్పుకుంటున్నారు. పింగళి, కాటూరి కలిసి కవిత్వం చెప్పారు. దాన్ని దృష్టిలో పెట్టుకుని ఎవరో పింగళివారితో, 'వేంకటేశ్వరరావు మీకు విడాకులిచ్చి, కృష్ణశాస్త్రిగారిని చేపట్టినట్లున్నదే!' అని అడిగారు.

దానికి పింగళివారు, 'ఆ ప్రశ్నకు సమాధానం చెప్పాల్సింది నేనుకాదు. వేంకటేశ్వరరావుగారినే అడగండి' అన్నారు. అందరూ హాయిగా నవ్వుకున్నారు.

వంటారా? చెప్పించుకునేవాళ్లకి యింట్రెస్ట్ వున్నప్పుడు చెప్పడానికి నాకేంపోయింది. డబ్బులిస్తే యీ జగన్నాథం పంతులు కాక పోతే మరో జోగినాథం పంతులొస్తాడు"

జగన్నాథం పంతులు అలా చాలాసేపు చెప్పినా ఆ మాటలు ఆందోళన చెందు తున్న కొండమ్మ మనసుకి రవంత కూడా ఊరట కలిగించలేకపోయాయి.




రాజగోపాలరావుగారి బంగళా చూసొచ్చింది పద్మావతి. అందులో రెండు గదుల తలుపులు మాత్రం తీసున్నాయి. ఆ రెండూ బెడ్రూములే! మిగతా రూమ్స్‌కి తాళాలు వేసుకుని యజమానులు తీర్థయాత్రలకి వెళ్లిపోయారు. నౌఖర్లు సీనియర్లు, సిన్సియర్లన్న నమ్మకంతో బంగళాని, కాంపౌండ్‌లో వున్న మూడు కార్లని వదిలేసి వెళ్లారు. ఆ బంగళా నౌఖర్లు పరదేశమ్మ, యాకూబ్‌లు తమకి బాగా తెలుసు కాబట్టి అద్దె యివ్వకుండా తమని ఒకరోజు ఆ బంగళాలో వుండనిస్తారనుకుంది పద్మావతి. ఒకవేళ అద్దె అడిగినా, వందా రెండు వందలుగా వుంటుందని వూహించింది. కానీ వాళ్లు మాత్రం డబ్బు విషయంలో పక్కా కమర్షియల్‌గా వ్యవహరించారు. 'తమ్ముడు తమ్ముడే, పేకట పేకాటే'ననే విధంగా మాట్లాడి రోజుకి వెయ్యిరూపాయలకి తక్కువ లేకుండా డిమాండ్ చేశారు. బంగ్లాని అద్దెకివ్వడమే కాకుండా, ప్రియాంక ఆ యింటికి వచ్చినప్పుడు పద్మావతి, యాకూబ్ తమ పనిమనుషులుగా నటించాలని చెప్పింది. ఆ బంగ్లా, ఆ కార్లు కూడా రాయుడిగారివేనని చెప్పమంది. యాకూబ్ పగలబడి నవ్వి "ఇవన్నీ మీ సొంతమేనని ఒక్క ప్రియాంక గారికే కాదండి, యిక్కడికి ఎవరొచ్చి అడిగినా చెప్తాం" అన్నారు.

ఈ రకమయిన ఒప్పందాలన్నీ జరిగాక వాళ్లు అడిగిన రెంట్‌కి ఒప్పుకుని యింటికి వచ్చింది పద్మావతి. రాగానే ప్రియాంకకి ఫోన్‌చేసి రేపు ఏ మాత్రం వీలున్నా తమ యింటికి రావాలని, రేపు తన ఆడపడుచు కాంచన పుట్టినరోజని చెప్పింది. ప్రియాంక జవాబు చెప్పడానికి నాలుగైదు క్షణాల టైమ్ తీస్కుని మాట్లాడింది.

"మావాళ్లింకా అమలాపురంనించి రాలేదు. అయినా, నేనీ వూరొచ్చి యిన్ని రోజులయినా మీరు మా యింటికీ రాలేదు. నేను మీ యింటికీ రాలేదు. అదే నాకు చాలా బాధగా వుంది. రేపు మీ కాంచన బర్త్‌డే అంటున్నారు కాబట్టి, ఆ ఫంక్షన్ కోసమైనా తప్పకుండా వస్తాను. రేపు సాయంత్రం కరక్ట్‌గా నాలుగ్గంటలకి మీ యింట్లో వుంటాను. అంతకంటే లేట్‌గా వస్తే మీ యింటికొచ్చే బంధువులు స్నేహితుల్తో మీరు బిజీ అయిపోతారు గదా" అంది.

పద్మావతి ముందుగా ప్రిపేర్ అవకుండా, రేపు కాంచన పుట్టినరోజని చెప్పేసింది. కానీ బంధువులు, స్నేహితుల గురించి మర్చిపోయింది.

"అదికాదు ప్రియాంకా, మా యింట్లో ఎవరికీ బర్త్‌డే ఫంక్షన్లు గొప్పగా చేస్కోవడం యిష్టం వుండదు. మేం నిన్ను తప్ప మరెవర్నీ పిలవడంలేదు. కనీసం కేక్ కట్ చెయ్యడం కూడా వుండదు. రేపు

నువ్వొక్కదానివే మా గెస్టు" అంది.

"బాబోయ్.. అయితే తప్పకుండా రావాలి"

"మరి అడ్రస్ నోట్ చేస్కో"

"టెలిఫోన్ డైరక్టరీలో వుందిగా"

"అదెప్పుడో పదేళ్ల క్రితం నాటిది. ఆ తర్వాతో బంగళా కొనుక్కుని అక్కడికి షిఫ్ట్ అయిపోయాం. నోట్ చేస్కో! డాబా గార్డెన్స్, లీలామహల్ దగ్గరున్న నారాయణ స్ట్రీట్‌లో పెద్ద గ్రీన్ బిల్డింగ్! ఈ అడ్రస్‌కే నువ్వు తప్పకుండా రావాలి"

ప్రియాంక సరేననడంతో ఓ ముఖ్యమైన పని అయిందనుకున్నారు. కాంచన సాయంతో, రేపు ఆ బిల్డింగ్‌కి తీసుకెళ్లడానికి అవసరమైన బట్టలు, వస్తువులు తీసి ఓ బాక్సులో సర్దడం ఆరంభించారు. కొండమ్మని అడక్కపోతే బాగోదని "నువ్వూ రా" అంది పద్మావతి.

"రామేశ్వరం వెళ్లినా శనేశ్వరం వదలనట్టు, ఆ ఖరీదైన బంగ్లాకి నేనెందుకులే. మీరెళ్లిరండి" అంది కొండమ్మ నిరాసక్తంగా. పద్మకి కావలసిందీ ఆ సమాధానమే కాబట్టి, ఆ విషయం గురించి మళ్లీ ప్రస్తావించలేదు.

మర్నాడు ఉదయం ఎనిమిది గంటలకే యింట్లో టిఫిన్లు తినేసి, కారులో ఆ బంగళాకి వెళ్లారు. సీతారామ్‌కి యీ విషయం చెప్దామంది పద్మావతి. రాయుడు ఒప్పుకోలేదు. ఈ విషయం మన మధ్యనే వుంచడం మంచిదని అన్నాడు. బంగ్లాలో తెరచివున్న రెండు రూముల్లోనూ తెచ్చిన సామాన్లు సర్దింది కాంచన.

యాకూబ్ రాయుడు దగ్గరకొచ్చి "టిఫిన్ తెమ్మంటారా? " అని అడిగాడు.

"ఒద్దొద్దు. ఇంటిదగ్గర చేసే వొచ్చాం."

"మీరిక్కడకొచ్చి టిఫిన్లు చేస్తారు కదా, మీతోపాటు మేమూ తినొచ్చని నేనూ మా ఆవిడా యింకా టిఫిన్లు చెయ్యలేదండి. ఎహ్హెహ్హె" అతను టిఫిను గురించి డబ్బులు అడుగుతున్నాడని గ్రహించి జేబులోనించి ఓ వందనోటు తీసిచ్చాడు.

"ఇహ్హిహ్హి చాలదే" అన్నాడు యాకూబ్.

రాయుడికి చిరాకొచ్చినా తమాయించుకున్నాడు. "ఇవాళొచ్చినందుకు నన్ను డబ్బు లడుగుతున్నారు. మరి రోజూ టిఫిన్లు ఎవరి డబ్బుతో తింటున్నారో" అని మూలుగుకుంటూనే మరో వంద ఇచ్చాడు.

యాకూబ్ వెళ్లిపోయాడు.

పద్మావతి తనగది తలుపులు మూసి, ఏసీ మిషన్ ఆన్‌చేసి మంచం మీద పడుకుంది. మధ్యాహ్నం ఒంటిగంటకి పరదేశమ్మ, యాకూబ్ వచ్చి భోజనాల సంగతి అడిగారు. అంతవరకు పద్మావతి భోజనాల విషయం ఆలోచించలేదు. ఆలోచించి వుంటే, యింటి దగ్గరే వంటచేసి క్యారేజి కట్టి తెచ్చుకునేది.

"ఓ ఫుల్‌మీల్ పట్టుకొస్తే మన ముగ్గురికీ సరిపోతుంది" అంది పద్మ.

"అమ్మగారు మా యిద్దర్నీ మర్చిపోయారు" అంది పరదేశమ్మ.

భోజనాలక్కూడా మామీదే వాలిపోతున్నారే- అని మనసులోనే చిరాకుపడుతూ నూటయాభై తీసిచ్చి "రెండు ఫుల్ మీల్స్ పట్టుకొస్తే అందరికీ సరిపోతుంది" అన్నాడు రాయుడు.

"ఇంత పెద్ద బంగళాకొచ్చి, యింత ఖరీదైన డైనింగ్ టేబిల్‌మీద కూర్చుని చికెన్ బిర్యానీలు, ప్రాన్స్ కర్రీలు తినకుండా, యీ వెజిటేర్యన్ మీల్స్ తింటే, చూడ్డానికి నీట్‌గా వుండదండి..." అంటూ నౌఖర్లిద్దరు వెకిలి నవ్వు నవ్వుతూ చెప్పారు.

చిరాకుని వ్యక్తం కానివ్వకుండా పద్మావతి డబ్బిచ్చెయ్యమన్నట్టుగా సైగ చెయ్యడంతో నాలుగు చికెన్ బిర్యానీలకి డబ్బులిచ్చి పంపించాడు రాయుడు.

భోజనాలు పూర్తయ్యేసరికి టైమ్ రెండు

న్నర దాటింది. పద్మావతి సెల్ కి ప్రియాంక ఫోన్‌చేసి తాను యింటి దగ్గర పావుతక్కువ నాలుగు గంటలకి స్టార్టయి, కరక్టుగా నాలుగు గంటలకి పద్మావతి దగ్గర వుంటానని చెప్పింది. ఏసీ రూమ్ లోనే ఓ చిన్నసైజ్ కోడికునుకు తీద్దామను కుంది పద్మావతి. కానీ ఓసారి కునుకు పట్టేసిందంటే, ఒక్కోసారి అయిదుగంటల వరకు తెలివిరాని సందర్భాలున్నాయి. ప్రియాంక కరక్టుగా నాలుగు గంటలకే వచ్చేస్తానంది కాబట్టి, ఆమె వచ్చాక, నిద్ర మొహంతో ఎదురెళ్లడం బాగోదనిపిం

కొత్తగాలి...

**బాపు బొమ్మ గీసినా**
**తీసినా.. నిన్ను చూసే**
**కీరవాణి పాట రాసినా**
**పాడినా.. నిన్ను చూసే**

– పట్ల యాదగిరి,

*గండాల, నల్గొండ జిల్లా*

చింది. కాంచన, పద్మ మధ్యాహ్నం మూడుగంటలకే పట్టుచీరలు కట్టుకుని రెడీ అయిపోయారు. రాయుణ్ణి సూట్ వేస్కోమని చెప్పింది కాబట్టి, అతను అయి ష్టంగానే సూట్ ధరించాడు. సూట్ వేస్కుని ఆఫీసుకి ఒకేఒక్కసారి వెళ్లినం దుకు, దొంగగా ముద్రవేసుకుని పోలీసుల చేత దెబ్బలు తిన్నాడు. అప్పట్నించీ సూట్ వేస్కోకూడదని మానసికంగా నిర్ణ యించుకున్నాడు. కానీ, యిప్పుడు పద్మా వతి వేస్కోమని బలవంతం చేసింది కాబట్టి, మనసులో చిరాకుపడుతూనే సూట్ వేసుకున్నాడు.

మధ్యాహ్నం మూడు నలభైకి ప్రియాంక తన కారు ఎక్కేముందు పద్మకి ఫోన్ చేసింది. ఆమెకు వెల్‌కమ్ చెప్పి ఫోన్ ఆఫ్ చేసి మళ్లీ మరోసారి బట్టలమీద పెర్ ఫ్యూమ్ స్ప్రే చేసుకుంది. మెయిన్ గేట్ దగ్గర నిలబడి ఆమెను రిసీవ్ చేసుకుంటే బాగుంటుందని రాయుడు చెప్పాడు, కాంచనా చెప్పింది. అలా చెయ్యడం వల్ల ప్రియాంక తనకంటే చాలా గొప్పదనే విష యాన్ని అంగీకరించినట్టవుతుందని భావించి పద్మావతి ఆ ప్రపోజల్ కేన్సిల్ చేసేసింది.

పద్మావతి సెల్ మళ్లీ మోగింది. అప్ప టికి అయిదునిమిషాలు తక్కువ నాలుగ యింది. బహుశా మన అడ్రస్ కోసం వెదుక్కుంటుందేమో ననుకుంటూ ఫోన్ మాట్లాడింది. అవతల్నించి ప్రియాంక కాస్త టెన్షన్ పడుతూ మాట్లాడుతోంది.

"అయామ్ వెరీవెరీ సారీ పద్మగారూ, నేను మీ యింటికి రావడానికే బయల్దేరి కారులో వస్తుండగా, సడన్‌గా మావారు ఫోన్ చేసారు. అమలాపురంలో వున్న వాళ్లమ్మగారికి హార్ట్‌పెయిన్ వస్తే తీసుకెళ్లి అక్కడున్న హాస్పిటల్లో జాయిన్ చేశార్ట"

వస్తున్న కోపాన్ని తమాయించుకుంటూ, "ఇంతకీ నువ్వొస్తున్నావా? లేదా? " అంటూ కాస్త కటువుగానే అడిగింది.

"ఎలా రమ్మంటారండి, మావారు ఫోన్ చెయ్యగానే నేను మళ్లీ యింటికొచ్చేసాను. ఇప్పుడు నేనూ, మా ఆయన కారులోనే అమలాపురం బయల్దేరుతున్నాం. అక్క ణ్ణించి మా అత్తగార్ని హైదరాబాద్ తీసు కెళ్లి అపోలో హాస్పిటల్‌లో జాయిన్ చెయ్యాలి"

"ఇంతకీ నువ్వు చెప్పేదేంటి? " బిగ్గరగా చిరాగ్గా అడిగింది. రాయుడికి, కాంచనకి ఆమె చిరాకుని చూసి ప్రియాంక రాకపో డానికి కారణం తెలీకపోయినా, ఆమె మాత్రం రావడం లేదన్న విషయం అర్థమై పోయింది.

ప్రియాంక ఫోన్‌లో మాట్లాడుతూ, "నేను హైదరాబాద్‌నించి రాగానే మీ యింటికొచ్చేస్తాను. ఈసారి మీరు పిలవక్కర్లేదు. నేనూ ముందుగా వస్తున్నానని చెప్పను. బట్.. డెఫినెట్‌గా ఆ ఎడ్రస్ కొచ్చేస్తాను.."

ఆమె యింకా ఏదో చెప్తుండగానే పద్మావతికి సహనం చచ్చిపోయి ఫోన్ ఆఫ్ చేసేసి, మిగతా యిద్దరికీ సంభాషణా సారాంశం క్లుప్తంగా చెప్పింది. అక్కడున్న సోఫాలో కూలబడి, రెండు చేతుల్తో నెత్తి బాదుకున్నంత పనిచేసింది.

"ఆ రాస్కెల్ ఏ ముహూర్తంలో నాకు ఎదురుపడిందోగానీ అన్నీ నష్టం మీద నష్టాలే" అంటూ స్వగతం పలుక్కుంది.

రాయుడు ఆ ప్రియాంక రావడం గురించి ఆలోచించకుండా, రాకపోవడం వల్ల అయిన ఖర్చుల గురించి లెక్క వేసుకుంటున్నాడు. కాంచన యిప్పుడు జరిగిన విషయం గురించి ఆలోచించడం లేదు. భవిష్యత్తులో ప్రియాంక వచ్చే విషయం గురించి ఆలోచిస్తోంది. ఆమెకు చెప్పింది రాజగోపాలరావుగారి యింటి అడ్రస్. ఈసారి ముందుగా చెప్పకుండా సడన్‌గా వచ్చేస్తానని చెప్పింది. ఒకవేళ ఆవిడ ఓ పదిరోజుల తర్వాత వస్తే, అప్పుడు కనబడే మనుషులు వేరు. వారిని పద్మావతి గురించి అడిగితే.. డొంకంతా కదులుతుంది. పనివాళ్లకి డబ్బులిచ్చి పద్మావతి ఆ బిల్డింగ్‌ని అద్దెకు తీసుకున్న విషయం బైటపడుతుంది. ఇలా మరొకరి బంగళాని చూపించి, అది తమదేనని చెప్పి మోసగించినందుకు పద్మావతిని ఆవిడెలా అర్థం చేసుకుంటుంది? తనకొచ్చిన ఆలోచనని వదినకు వివరించింది. అంతా విని పద్మ "నువ్వు చెప్పింది కరక్టే" అని గొణిగింది తప్ప మరేం మాట్లాడలేదు.

వస్తానూ, వచ్చేస్తున్నానూ అని చెప్పిన ప్రియాంక ఆఖరి నిమిషంలో రాకపోయేసరికి, తర్వాత ఏంచెయ్యాలో ఎవరికీ అర్థం కాలేదు. రాయుడు మాత్రం తనమీద తనే చిరాకుపడుతూ, "జరిగింది చాలు, యింక మనింటికి వెళ్లిపోదాం. మనం యీ బంగ్లాని హాఫ్‌డే మాత్రమే వాడుకున్నాం కాబట్టి సగం డబ్బు చెల్లించొచ్చు" అన్నాడు. నౌఖర్లని పిలిచి సగం డబ్బు యివ్వబోతే వాళ్లు ఒప్పుకోలేదు.

"మీరో రోజుకి బేరమాడిం తర్వాత, అందులో అరపూట వున్నా, అరగంట వున్నా మొత్తం డబ్బు చెల్లించాల్సిందే"

## జులై- 2011
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికి త్వరలో బహుమతులు అందుతాయి.



1. **పి. కుశకుమార్,**
   - రామాంతపూర్, హైదరాబాద్
2. **రంగు చక్రపాణి,**
   - హన్మకొండ, వరంగల్
3. **ఎన్. వేణుగోపాల్‌రావు,**
   - కాకినాడ
4. **కె. అంబుజాక్షి ,**
   - సైనిక్‌పురి, సికింద్రాబాద్
5. **భారతుల అరుణ,**
   - సౌత్ లాలాగూడ, సికింద్రాబాద్

## సరైన జవాబులు

| | |
|---|---|
| 1. గంగ | 6. 1992 |
| 2. సాగరి | 7. కాఫ్టీచా |
| 3. వెంకటస్వామి | 8. శ్రీపాద |
| 4. మోతీ | 9. రూజ్‌వెల్ట్ |
| 5. జాన్‌సన్ | 10. 1946 |

అన్నాడు యాకూబ్.

పద్మావతికి పౌరుషం వచ్చింది. "వాళ్లు అంత నిక్కచ్చిగా వసూలు చేస్తున్నప్పుడు మనవెందుకు మధ్యలో వెళ్లిపోవాలి? ఈరోజు రాత్రి ఏసీ రూముల్లో పడుకుని, రేపొద్దుటే వెళ్దాం" అంది. రాయుడికి ఆ బిల్డింగ్‌లో ఒక్క క్షణం కూడా వుండబుద్ధి కాకపోయినా, భార్య మాట కాదనలేక, పని వాళ్ల ముందు వాదించడం యిష్టంలేక మౌనం వహించాడు. ఆ రాత్రి పద్మావతి, కాంచన ఓ గదిలోనూ, రాయుడు మరో గదిలోనూ పడుకున్నారు.

అర్ధరాత్రి ఒంటిగంట దాటుతున్నవేళ... పగలంతా ఆ వీధి ఓ మాదిరి జనసంచారంతో కాస్త హడావిడిగా కనిపించినా రాత్రివేళ కుక్కలు తప్ప మనుషులు తిరగరు. ఆ వీధి చివర గుడిసెల్లాంటి చిన్న చిన్న ఇళ్లు కొన్ని వున్నాయి. ఆ వీధి చివర్లో ఓ ఇంట్లోనించి "దొంగ దొంగా పట్టుకోండి పట్టుకోండి" అనే కేకలు బిగ్గరగా వినిపించాయి. ఆ యింట్లో పడిన దొంగ నడివయస్కుడే! పరుగెత్తుకుంటూ ఆ వీధిలోనించి ముందుకు వెళ్లాడు. ఆ కేకలకి కొన్ని అరుగులమీద పడుకున్న వాళ్లు నిద్రలేచి 'దొంగా దొంగా' అని అరుస్తూ ఆ దొంగాడి వెంటబడ్డారు. రాజగోపాలరావుగారి బంగళాముందు కరెంట్ స్తంభం వున్నా, దానికున్న లైట్ వెలగడం లేదు. అంచేత, ఆ యింటిముందు చిక్కని చీకటి పరుచుకుని వుంది. ఆ దొంగ ముందుకి వస్తూ వస్తూ, ఆ యింటిగేటు కొంచెం తీసివుండడంతో, ఆ కాంపౌండ్‌లో దూరాడు. వెంటాడుతున్న జనం కంటబడకుండా వుండటానికి, గభీమని అక్కడున్న కారుల్లో ఓ కారు కిందకి దూరి దాక్కున్నాడు. దొంగని తరుముతున్న జనం అక్కడకొచ్చారు. బంగళా వెనకనున్న సర్వెంట్ క్వార్టర్స్‌నించి పరదేశమ్మ, యాకూబ్ లేచి వచ్చారు. దొంగాడు బంగ్లాలోనే దూరాడని రూఢీగా చెప్పారు వెంటవచ్చినవాళ్లు. కాంపౌండ్‌లో వున్న ట్వంటీఫైవ్ వాట్సుల బల్బ్ వెలుగుతున్నా, అంత విశాలమైన కాంపౌండ్‌కి ఆ దీపం ప్రసరించే వెలుతురు చాలడంలేదు. యాకూబ్ జనాన్ని అక్కడే ఆగమని చెప్పి, యిద్దర్ని మాత్రం తనతో రమ్మన్నాడు. బంగళాలోకి వెళ్లి తలుపులు కొట్టి రాయుణ్ణి, ఆడవాళ్లని నిద్ర లేపాడు.

వీధిలో అంతమంది జనం వేసే కేకల శబ్దానికి కొన్ని యిళ్లలోని జనంలేచి లైట్లు ఆన్ చేసారు. అందులో ఒకాయన ఆ బంగ్లాముందు జనం నిలబడ్డం చూసి కంట్రోల్‌రూమ్‌కి ఫోన్‌చేసి ఆ వీధిలో దొంగ పడ్డాడని చెప్పి అడ్రస్ యిచ్చాడు. నైట్ పెట్రోలింగ్ చేసే పోలీసులు కొన్ని నిమిషాల్లో ఆ లొకేషన్‌కి వస్తున్నారని కంట్రోల్‌రూమ్ నించి రిప్లై వచ్చింది. యాకూబ్ లోపల్నించి రాయుణ్ణి తీసుకుని కాంపౌండ్‌లోకి వచ్చాడు. కొంతమంది బంగళా హాలంతా వెదికారు. ఆ ఇంట్లో రెండు గదులకే తాళాలు తీసున్నాయి. మిగతా రూమ్‌లకి తాళాలు వేసున్నాయి. తెరచివున్న గదుల్లో మనుషులు పడుకున్నారు. ఆ గదుల్లోకి దొంగదూరే అవకాశం లేదు.

"ఏ కారు కిందయినా దాక్కున్నాడేమో?"

జనంలో ఒకరన్నారు. ఆ మాట అనగానే కొంతమంది నేలమిదకి వంగి కార్ల కింద చూసారు. దొంగ కనిపించాడు. అంతే! కేకలు వినిపించాయి.

"రారా! రాస్కెల్ రారా" అంటూ వాణ్ణి బైటకి రమ్మని కేకలు వేసారు. దొంగ బైటకి రాక తప్పలేదు. వాణ్ణి పట్టుకుని తలా ఓ దెబ్బ, తలా ఓ తన్ను తంతున్నప్పుడే బంగళాముందు పోలీస్‌జీప్ ఆగింది. ఇంత గొడవ జరుగుతున్నా కాంపౌండ్‌లో

వున్న ఓ కుర్చీలో కూర్చుని రాయుడు కునికిపాట్లు పడుతున్నాడు. జీపులో నించి ఇనస్పెక్టర్ దిగాడు.

"దొంగని పట్టుకున్నాం సార్" బిగ్గరగా, గర్వంగా అరిచాడు యాకూబ్. ఆ దొంగని లాక్కెళ్లి జీపులో కూర్చోబెట్టమని ఇనస్పెక్టర్ తన కానిస్టేబుల్‌తో చెప్పాడు. వాళ్లు అలాగే చేసారు.

"ఈ బంగాళాలో దూరేడా? ఈ నాలుగు కార్లు ఎవరివి? దీని యజమాని ఎవరు?" అంటూ కొన్ని పోలీస్ క్వశ్చిన్లు అడిగాడు.

పద్మావతి బంగ్లాని అద్దెకి అడిగినప్పుడు యీ బంగళా, యీ కార్లు వాళ్లవేనని ప్రియాంకతో చెప్పమంది. ఆ ప్రియాంక రాలేదు. కనీసం పోలీస్ ఇనస్పెక్టర్‌తోనైనా చెప్పకపోతే బాగోదని పని మనుషులు యిద్దరూ ఆ బంగ్లా ఓనర్ రాయుడుగారేనని చెప్పి కుర్చీలో కూర్చుని కునికిపాట్లు పడుతున్న రాయుడుని చూపించాడు. పరదేశమ్మ గబగబా వెళ్లి రాయుణ్ణి తట్టిలేపి ఇనస్పెక్టర్ గారొచ్చారని చెప్పింది. పాతిక వాల్టుల బల్బ్ వెదజిమ్మే పల్చటి వెలుతుర్లో ఎదురుగా బొద్దు మీసాల్తో, పెద్ద బొజ్జతో కనిపించిన ఇనస్పెక్టర్ని చూసి తుళ్లిపడ్డారు రాయుడు, పద్మావతి!

అతను.. ఇనస్పెక్టర్ శంకరయ్య!!

శంకరయ్య కూడా రాయుణ్ణి, పద్మావతిని చూడగానే గుర్తుపట్టి, ఆశ్చర్యంగా కనుబొమలెగరేసాడు.

"మీ విషయంలో ఆ సీతారామ్ నన్ను భలేగా మిస్‌లీడ్ చేసేసాడే" అంటూ ఆగి, జనంవైపు తిరిగి దొంగ దొరికాడు కాబట్టి మీరు వెళ్లండని బిగ్గరగా చెప్పి అందరినీ పంపించేశాడు. నౌఖర్లు యిద్దర్ని కాంపౌండ్‌లోనే వుండమని చెప్పి, రాయుణ్ణి, పద్మావతిని, కాంచనని తీసుకుని లోపలికి వెళ్లాడు. అందరూ సోఫాల్లో కూర్చున్నాక

శంకరయ్య మీసాలు దువ్వుకుంటూ మాట్లాడాడు.

"మీ మొగుడూపెళ్లాలు భలే జోడీ! నీకు ఒక్క కారున్నందుకే మీ జనరల్ మేనేజర్ నీమీద డౌట్‌పడి పోలీస్ కంప్లయింట్ యిచ్చాడు. ఎక్కడో అప్పు తీసుకున్న పత్రాలు చూపించి, ఆ సీతారామ్ మర్నాడేదో చిల్లర డబ్బులిచ్చి నన్ను కన్విన్స్ చేసేసాడు. నువ్వు నిర్దోషివని నేనూ మీ ఆఫీసర్‌కి చెప్పేశాను. తీరా చూస్తే యిక్కడ నీకో బంగళా, నాలుగు కార్లు, పనివాళ్లూ.. దిట్టంగానే మోపు చేశావే? "

రాయుడు పద్మావతి యీ కొత్త అభియోగానికి ఆశ్చర్యపోతూ ఒకర్నొకరు చూసుకున్నారు. రాయుడు కాస్త ధైర్యం తెచ్చుకుని అది కాద్సార్, నేను చేప్పేది ఏంటంటే.." అంటూ చెప్పబోతే శంకరయ్య ఆగమని చెయ్యి చూపించాడు.

"వద్దు.. నువ్వు చెప్పింది నేను వినడం కాదు, నేను చెప్పింది మీరిద్దరూ వినాలి!" అన్నాడు శంకరయ్య.

ఆయన తమని అపార్థం చేసుకున్నాడని పద్మావతి గ్రహించి "సార్, యీ భవనం, ఆ కార్లు మావేననుకుంటున్నారా? " అని ఆందోళనగా అడిగింది.

"మీవి కావా? కాకపోతే, ఈ యింటి పనిమనుషులు ఈ ఆస్తికి యజమాన్లు మీరేనని ఎందుకు చెప్పారు? వాళ్లచేత మీరే అలా చెప్పించారా? గతంలో.. ఎవరో ప్రియాంక దగ్గర బిల్డప్ యివ్వడానికి ఓ కారు కొన్నామన్నారు. ఇప్పుడు కూడా ఆవిడ ముందు బిల్డప్ యివ్వడానికి యీ భవనాన్ని, కార్లనీ కొనేశారా? "

"కొనలేదండి, ఒక్కరోజుకి అద్దెకు తీసుకున్నాం" రాయుడు గబగబా చెప్పాడు. శంకరయ్య తన కుండలాంటి బొజ్జ ఎగిరెగిరి పడేటట్టుగా పగలబడి నవ్వి "అద్దెకు తీసుకున్నారా? ఆ మాటని నేను నమ్మాలా? నేను మీకు మరీ పిచ్చి కొత్తంగాళ్లా కనిపిస్తున్నానా? మీ కంపెనీ గోడౌన్‌లో నించి ఎలాంటెలాంటి సామాన్లు కొట్టేసి, అమ్మేసుంటావో యీ బిల్డింగ్‌ని చూస్తేనే తెలుస్తోంది. నాకు టూటౌన్ నించి త్రీటౌన్‌కి ట్రాన్స్‌ఫర్ అయినందుకు ఆ భగవంతుడు మిమ్మల్ని భలేగా చూపించాడు. మీ సీతారామ్‌ని మా యింటికి పంపించి నాతో డిటైల్డ్‌గా మాట్లాడమని చెప్పండి. మా టాక్స్ ఏమాత్రం ఫెయిలయినా నువ్వు చాలా గొడవల్లో పడిపోతావు" అని హెచ్చరిస్తున్నట్టుగా చెప్పి, బైటకి వెళ్లి జీపులో వెళ్లిపోయాడు.

రాయుడు, పద్మావతి తమ అంతరాత్మని, ఆత్మగౌరవాన్ని చంపుకుని మరొకరి బంగ్లాని అద్దెకు తీసుకున్నందుకు డబ్బు వదిలిందే తప్ప వస్తుందనుకున్న ప్రియాంక రాలేదు. అది నిరాశ కలిగిస్తే, ఇనస్పెక్టర్ శంకరయ్య అనూహ్యంగా రంగంలోకి వచ్చి, యీ ఆస్తులన్నీ తమవే అనుకుని బ్లాక్‌మెయిల్ చేస్తానంటున్నాడు. ఇప్పుడేం చెయ్యాలని ఇవే ప్రశ్నలతో ఉదయం ఆరుగంటలవరకు గడిపి, పరదేశమ్మకి వెయ్యి రూపాయలు రెంట్ చెల్లించి కారులో యింటికి చేరుకున్నారు.

★ ★ ★

ఆ రోజు ఉదయం తొమ్మిది గంటలకే సీతారామ్‌కి ఫోన్‌చేసి అర్జెంట్‌గా రమ్మని చెప్పింది పద్మావతి. మరో పావుగంటలో హడావిడిగా వచ్చాడు సీతారామ్. కూర్చోబెట్టి కాఫీ యిచ్చి, నిన్న రాత్రి జరిగిన సంఘటన, ఇనస్పెక్టర్ శంకరయ్య చేసిన బెదిరింపు గురించి వివరించింది. అంతా విన్నాక, సీతారామ్ వక్కపొడి పొట్లాం తీసి రెండు పలుకులు నోట్లో వేసుకుని చెప్పాడు, "మీరు ఫీలవనంటే ఓ మాట చెప్తాను. వినేవాడు వెర్రివెధవయితే, చెప్పేవాడు మహాజ్ఞాని అవుతాడనే





సామెతుందిలే! మీరెప్పుడూ చేతులు కాలాకే, సలహా అడుగుతున్నారు. నిన్న ఆ బంగళాకెళ్లేముందు నాకెందుకు చెప్ప లేదు? "

"నేను చెప్తానన్నా ఈయన చెప్పని చ్చాడు కాదండి. నిన్న ఎందుకు చెప్పలేదన్న సంగతి వదిలేసి, యిప్పుడు మేమేం చెయ్యాలో చెప్పండి" అంది పద్మావతి అసహనంగా.

సీతారామ్ కొన్ని క్షణాలపాటు ఆలోచించాడు. తనకి లాయర్లతోను, పోలీసుల్తోనూ వున్న పరిచయాల వల్ల సంపాదించిన అనుభవాన్ని ప్రదర్శిస్తూ తమాషాగా జవాబు చెప్పాడు.

"మీరేం కంగారు పడనక్కర్లేదు. గతంలో మీ జియ్యమ్‌గారు నిన్ను అనుమానించి కంప్లయింట్ యిచ్చాడు కాబట్టి, ఇనస్పెక్టరొచ్చి అరెస్ట్ చేసి తీసుకెళ్లాడు. మేం వచ్చి, నువ్వు కొన్న కారు కోసం అప్పు చేసావని చెప్పి పత్రాలూ గట్రా చూపించి నిన్ను నిర్దోషిగా నిరూపించాం. అయినా వాడు లంచం అడిగాడంటే కారణం, నీమీద కంప్లయింట్ వుంది కాబట్టి! లంచం యివ్వకపోతే వాడింకా నీలుగుతాడు. నీలిగితే ప్రమోషను ఆగిపోతుంది. కానీ నిన్నరాత్రి జరిగిన విషయం వేరు. ఎవడో దొంగ కోసం శంకరయ్య వస్తే అక్కడ బంగ్లా యజమానిగా కనిపించావు తప్ప, నీ మీద ఏదో కంప్లయింట్ వుందని రాలేదే! నువ్వు అలుసుగా కనిపించావు కాబట్టి, గోడౌన్‌లోని దొంగతనానికీ, నిన్న నువ్వా బంగళాలో వుండడానికీ లింకు పెట్టేసాడు. నేనో సంగతి చెప్తా.. జాగ్రత్తగా వినండి. నిన్న నువ్వక్కడ లేవయ్యా" ఆఖరు వాక్యాన్ని నొక్కి చెప్పాడు.

"నేనక్కడే లేనంటే ఎలా? వాడికి కనిపించి మాట్లాడానుగా" రాయుడు అమాయకంగా అడిగాడు.

"కనిపించావని చెప్పడానికి రుజువేంటి? ఒకవేళ ఆ దారంట ఆ సమయానికి వస్తూ కనిపించావే అనుకో.. నువ్వా ఆస్తికి యజమానివని చెప్పడానికి ఆ పోలీసోడికున్న ప్రూఫ్ ఏంటి? " కోర్టులో డిఫెన్స్‌లాయర్ అడిగినట్టు అడిగాడు.

"ఆ పనివాళ్లిద్దరూ ఆ బంగ్లాకి నేనే యజమాన్నని చెప్పేరు కదా? "

"నిన్న రాత్రి చెప్పినవాళ్లు రేపు పోలీస్టేషన్‌లోనూ, తర్వాత కోర్టులోనూ చెప్తారా? చెప్తే ఆ భవనం అసలు యజమాని రాజగోపాలరావుగారు వూర్కొంటారా? పనివాళ్లలా చెప్పగానే, వాళ్లా భవనాన్ని అద్దెకిచ్చినట్టు తెలుస్తుంది గదా? తెలీగానే ఆయన

> ## కొత్తగాలి...
>
> **అమ్మాయి రమ్మంది**
> **ప్రత్యక్షం మరుక్షణం**
> **అమ్మ పిలిచింది**
> **ఎన్నాళ్లో నిరీక్షణం**
>
> – నేమాను సుభాష్‌చంద్రబోస్,
> శ్రీకాకుళం

పనివాళ్ల యిద్దరి పీకలమీద కాలేసి తొక్కెయ్యడా? అంచేత, ఇనస్పెక్టరు ఆ ప్రాపర్టీ అంతా నీదేనని ఏమాత్రం కయ్‌కుయ్‌లాడినా, ఆ పనివాళ్లిద్దరూ రాయుడనే వాడెవడో మాకు తెలీదని దబాయించేస్తారే తప్ప, తమ పీకలమీదకి తెచ్చుకోరుగా? అసలా ప్రాపర్టీ అంతా నీదేనని ఇనస్పెక్టరు ఎలా ఆరోపించగలడు? నీ మీద ఎవరూ కంప్లయింట్ యివ్వకుండా వాడు కేసు పెట్టకూడదు. ఇది ఫస్ట్ పాయింట్! ఒకవేళ అతను 'సుమోటో' కేసు పెట్టినా.." అని ఇంకా చెప్పబోతున్నాడు.

పద్మావతి అతన్ని ఆపి, "సుమోటో

కేసంటే ఏంటి? " అని అడిగింది.

"సుమోటో కేసంటే.. ఎవర్నించి ఏ కంప్లయింటూ కాకుండా పోలీసులే వాళ్లంతట వాళ్లు కేసు పెట్టడవన్నమాట. అది కూడా వాడు పెట్టలేడు. ఎందుకంటే, పోలీసులు సివిల్ కేసుల్లో వేలు పెట్టకూడదు"

దంపతులు కాస్సేపు మౌనం వహించినా, వాళ్లు మాత్రం యింకా భయంనించి బైటపడలేక పోతున్నారు.

"అది కాదు సీతారామ్‌గారూ! పోలీసులు తలచుకుంటే ఏమైనా చెయ్యగలరంటారు కదా? " అని అడిగాడు రాయుడు.

సీతారామ్ నవ్వుతూ తల అడ్డంగా ఆడించాడు. "తలుచుకుంటే ఏమైనా చేసెయ్యడానికి పోలీసు ఏమైనా దేవుడి కొడుకులా? ఫరెగ్జాంపుల్ నీ సంగతే తీస్కో. ఆ భవనంగానీ, కార్లుగానీ నీపేర్న లేవు. నువ్వా రాజగోపాలరావుగారి బంధువే కావు. వారసుడివీ కాదు. అలాంటప్పుడు ఆ శంకరయ్య ఆ ఆస్తంతా నీదని నోరు జారినా, రాజగోపాలంగారు వాడినో పిచ్చి పకోడిగా ప్రూవ్‌చేసి పిచ్చాసుపత్రికి పంపించేస్తాడు. లేదంటే, యీ వూర్నించి మరో వూరికి ట్రాన్స్‌ఫర్ చేయించేస్తాడు. ఆ నౌఖర్లు చెప్పడం, యినస్పెక్టర్ ఏదో చేసెయ్యడం.. యీ రెండూ అర్థం లేని భయాలే! ఇంకా సంగతి మర్చిపోండి" అన్చెప్పేసి సీతారామ్ లేచి నిలబడ్డాడు.

రాయుడి మనసు కొంత శాంతించినా, యింకో సందేహం మనసులో రెపరెపలాడింది. "ఇవాళ మిమ్మల్ని ఆయనింటికి పంపిస్తే డిటైల్డ్‌గా మాట్లాడతానని చెప్పాడు గదా" మెల్లగా గొణిగాడు.

"నేను వాడింటికి వెళ్తేకదా వాడు మాట్లాడ్డానికి. నేను వెళ్లను. ఒకవేళ వాడే మీకు ఫోన్‌చేసినా- నువ్వు నిన్నరాత్రి మమ్మల్నెక్కడ చూసావ్? నీకెమైనా పిచ్చి పట్టిందా? - అని అడగండి. తర్వాత సంగతి నేను చూసుకుంటాను" అన్చెప్పి రాయుడి భుజంతట్టి వెళ్లిపోయాడు సీతారాం.

అతను చెప్పిన మాటలు వృథాపోలేదు. అలజడి చెందుతున్న వారి మనసులు చాలావరకూ శాంతించాయి.

మరో రెండురోజుల తర్వాత పద్మావతి ఓ కంపెనీకి యింటర్వ్యూకి వెళ్లాలని గుర్తు చేసాడు రాయుడు. పద్మావతి తనకి గుర్తుందని చెప్పింది తప్ప, యింటర్వ్యూకి వెళ్తాననిగానీ, వెళ్లనని గానీ చెప్పలేదు. యాంత్రికంగానే తన ఫోన్‌తీసి ప్రియాంక నెంబరుకి డయల్ చేసింది. ప్రియాంక అమలాపురంనించి మాట్లాడింది. తన అత్తగార్ని తీసుకుని వాళ్లాయన, అక్కగారు హైదరాబాద్ వెళ్లారని చెప్పింది. అత్తగారి పరిస్థితి మరీ అంత ప్రమాదస్థితిలో లేదు. అంచేత తను విశాఖపట్నం ఎర్లీగానే వచ్చే అవకాశం వుందని చెప్పింది. ఆ మాటల సారాంశాన్నే పద్మావతి గ్రహించింది. ప్రియాంక తన యింటికొచ్చే టైమ్ దగ్గర పడింది.

రెండు రోజుల తర్వాత పద్మావతి అయిష్టంగానే యింటర్వ్యూకి బయల్దేరింది. కారులో వెళ్దామని రాయుడికి చెప్పింది.

ఆ మాటలు విన్న కొండమ్మ తన ధోరణిలోనే "భిక్షాటనకెళ్లేటప్పుడు బంగారపు బొచ్చె పట్టుకెళ్లకూడదమ్మా. ఇంటర్వ్యూ

## కొత్తగాలి...

**కుక్కే కదా అని**
**తేలిగ్గా చూడకు**
**పిచ్చెక్కి కరిస్తే**
**సెన్సెస్‌లో నువ్వు మైనస్సే**

– పినిశెట్టి లక్ష్మీశారద,
రాజమండ్రి

కెళ్లేటప్పుడు కారుల్లోనూ, విమానాల్లోనూ వెళ్తే, ఆ ఉద్యోగం యిచ్చేవాళ్లక్కూడా యివ్వబుద్ధి కాదేమో" అంది.

పద్మావతి అదేదో అపశకునపు మాట లాగ వుస్సంటూ నిట్టూర్చి ఒక్కపది సెకెండ్లు సోఫాలో కూర్చుండిపోయింది. తర్వాత లేచి "చూడత్తా, నేను కారుమీదె ళ్లినా ఆ కారు కాంపౌండ్‌లో వదిలేసే, ఆఫీ సర్‌గారి రూమ్‌లో కెళ్తాను. నా క్వాలిఫికే షన్లు నచ్చితే వాళ్లు ఉద్యోగం యిస్తారు తప్ప, వాళ్లంతా కాంపౌండ్‌లో కొచ్చి నేను కార్లో వచ్చానా? తొక్కుడు రిక్షాలో వచ్చానా? అని ఆలోచించి యివ్వరు"

**కొత్తగాలి...**

**అంతా అన్నాహజారేని సమర్థించేవారే అయితే అవినీతి కుంభకోణాలు ఎక్కడ పుడుతున్నట్లు?**

– ఆర్.ఎస్. హైమవతి, చెన్నై

కొండమ్మ మళ్లీ సమాధానం చెప్పి వాద నని పెంచదలుచుకోలేదు. పద్మావతి ఆ కంపెని ఆఫీసుకెళ్లింది. పది ఉద్యోగాలకి పదిహేనుమంది కేండిడేట్స్ హాజర య్యారు. ఇంటర్వ్యూలో వాళ్లేం ప్రశ్నలు అడుగుతారోనని మొదట పద్మావతి కాస్త టెన్షన్ పడినా, అక్కడ మాత్రం ఆఫీసర్లు ఎలాంటి జెనరల్ నాలెడ్జి క్వశ్చిన్లు వెయ్య లేదు. ఫ్యామిలీ వివరాలు, పిల్లల వివ రాలు మాత్రం అడిగారు. పద్మావతి జవా బులు చెప్పి బైటకి వచ్చింది. ఆఫీసర్‌గారి పీఏని రాయుడు కలిసి రిజల్ట్సు గురించి అడిగితే, "రెండు రోజుల్లోగా మీ మిస్సెస్ గారు సెలక్టయిందీ, లేనిదీ తెలియజేస్తాం" అని చెప్పాడు. పద్మని తీసుకుని రాయుడు యింటికి వచ్చేసాడు.

ఆ సాయంత్రం ఆ వీధి చివర గులాబీ రంగు మేడలో వుండే ఛాయాదేవి ఓ పావుకేజీ స్వీట్ పేకెట్ పట్టుకొచ్చి పద్మా వతికిచ్చింది. ఛాయాదేవి పద్మావతికి బాగా తెలుసు. ఆవిడ కొడుకు రామ్మో హన్ మూడు నాలుగు సంవత్సరాల క్రితం ఏదో ఉద్యోగంలో జాయినయ్యాడనే శుభ వార్త చెప్పడానికి వచ్చింది. అప్పుడూ ఓ స్వీట్ పేకెట్ తెచ్చింది. ఆ తర్వాత మూడు నాలుగుసార్లు వచ్చి తన కొడుకు పెళ్లి గురించి, పుట్టిన మనవడి గురించి చెప్పింది. ఎప్పుడొచ్చినా ఏదో ఓ శుభవార్త చెప్పి, స్వీట్ యిచ్చే ఛాయాదేవి యిప్పుడే శుభవార్త చెప్పడానికి వచ్చిందోననుకుం టూనే నవ్వుతూ ఆహ్వానించి కూర్చోబె ట్టింది. కొండమ్మకీ ఆవిడంటే యిష్టమే కాబట్టి, ఆవిడా ఓ కాఫీ తీసుకొచ్చి చాయా దేవికిచ్చి మాటల్లో పడింది.

"మరేం లేదమ్మా, మా అబ్బాయి రామ్మోహన్‌కి క్వాలిఫికేషన్లున్నా, మొదట చిన్న ఉద్యోగంలో జాయినయ్యాడు. ఎందుకంటే చిన్నదో పెద్దదో ఓ ఉద్యోగం వుంటే అదో పద్ధతిగా వుంటాదికదాని జాయినైపొమ్మని చెప్పాను" అంది ఛాయాదేవి నవ్వుతూ.

పద్మావతి కూడా నవ్వుతూ "ఔన్లెండి. అప్పుడా విషయం మీరు చెప్పడం నాకింకా గుర్తుంది. ఇప్పుడే శుభం జరిగిందని మళ్లీ స్వీట్లు యిస్తున్నారు? " అని అడిగింది.

"మా అబ్బాయికిప్పుడు సూపర్‌వైజర్‌గా ప్రమోషన్ వచ్చింది"

పద్మావతి రవంత ఆశ్చర్యపోయి, "అప్పుడే సూపర్‌వైజర్ ప్రమోషన్ వచ్చే సిందా? మీ అబ్బాయికంటే సీనియర్స్ ఎవరూ లేరా? " అని అడిగింది.

"లేకేవండీ, ఉన్నారు! వీడికంటే సీని

యర్లు యిద్దరున్నారు. కానీ ప్రమోషన్లనేవి కేవలం సీనియార్టీ బట్టేరావు.. ఏమాటకామాటే చెప్పుకోవాలి.. రూల్ ప్రకారం అయితే మీరు చెప్పినట్టు సీనియర్లకే రావాలి. కానీ అలా యివ్వడానికి మావాడు చేస్తున్నది గవర్నమెంట్ జాబ్ కాదు. ప్రైవేట్ కంపెనీలో పని! ఆఫీసరు గారికి ఎవడు నచ్చితే వాడికే ప్రమోషన్ యిచ్చేస్తాడు. ఎందుకిచ్చావని అడగడానికి ప్రైవేట్ కంపెనీల్లో యూనియన్లు వుండవు. అంచేత, మన పేరు ప్రమోషన్ లిస్ట్‌లో వుందని తెలిసాక.. మనం జాగ్రత్తగా దెబ్బ నప్పిస్తే మూడోస్థానంలో వున్న మావాణ్ణి నెంబర్ ఒన్ స్థానంలో పెట్టేసాడు ఆఫీసరు"

కొండమ్మ తన ముఖావంతో నోరు చేసుకుని నవ్వుతూ, "ఏమైతేనేం నీ కొడుక్కి ప్రమోషను వచ్చిందని చెప్పావు. మాకు చాలా సంతోషంగా వుంది" అంది.

పద్మావతి మాత్రం ఏదో ఆలోచిస్తూ "దెబ్బ నప్పించడం అన్నారు. ఎలా? మీకు అభ్యంతరం వుంటే చెప్పకండి" అంది.

ఛాయాదేవి ఫక్కుమని నవ్వి "అదేమైనా రత్నగిరి రహస్యమా చెప్పకపోడానికి? అందరికీ తెలిసిన బహిరంగ రహస్యమే! దెబ్బకి దెయ్యం, డబ్బుకి మనిషి లొంగుతున్న రోజులివి. ఆ ఆఫీసర్ బెంగాలీ వాడు. ఒక్క అక్షరం కూడా తెలుగు తెలీదు. అతన్తో మాట్లాడించాం. పని జరిగిపోయింది" అంది.

"ఎవరైనా బెంగాలీ వాడిచేత అతన్తో మాట్లాడించారా? "

"మనుషులచేత మాట్లాడించలేదు. ప్రధానమంత్రి పదవి చేసిన పి.వి. నర్సింహారావుగారికి ఎనిమిది భాషలు తెలుసట. హరికథలు చెప్పిన ఆదిభట్ల నారాయణదాసు గారికి పది భాషలు తెలుసట. కానీ, డబ్బుకి దేశంలో వుండే అన్ని భాషలూ వచ్చుగదా! దానిచేతే ఆఫీసరుతో మాట్లాడించాం"

"అంటే లంచం యిచ్చారా? "

"ఆ ఆఫీసరు లంచాలూ గట్రా పుచ్చుకోడని తెల్సింది. అయితే లంచాలు పుచ్చుకోని చాలామంది, కానుకలూ గట్రా పుచ్చుకుంటారు. ఈ ఆఫీసరూ అలాంటి రకమే! ప్రమోషన్ లిస్టు మరో పదిరోజులకి తయారవుతుందనగా ఆయన కూతురు పుట్టినరోజు వచ్చింది. మంచి సందర్భం దొరికింది కదాని, ఓ పాతికవేలిచ్చి రెండుం పావుతులాల బంగారం గొలుసుకొని ఆ అమ్మాయి మెడలో వేయించాను. అంతే! మా వాడికి ప్రమోషన్ వచ్చేసింది"

## కొత్తగాలి...

**నూటయాభై ఏళ్లుగా**
**ఎగురుతున్న తోకలేని పిట్ట**
**పోస్టుకార్డు**

– బిక్కునూరి రాజేశ్వర్,
పొన్కల్

ఆ తర్వాత ఛాయాదేవి మరో పదినిమిషాలు మాట్లాడి వెళ్లింది. ప్రమోషన్ ఎలా వచ్చిందో తెలుసుకున్న క్షణంనించి, పద్మావతి కళ్లు ఛాయాదేవిని చూస్తున్నా, మస్తిష్కం మాత్రం తన భర్త ప్రమోషన్ గురించే ఆలోచించనారంభించింది. తన భర్త యిన్నాళ్లూ జెన్రల్ మేనేజర్ని ప్రసన్నం చేస్కోడానికి ఏవేవో ఉపాయాలు ఆలోచించి వైఫల్యం చెందాడు. తన భర్త ప్రమోషన్‌కి అడ్డు తగులుతున్నది ఒకే ఒక్క బాబూరావు. కానీ ఛాయాదేవి కొడుక్కి యిద్దరు అడ్డుపడినా, డబ్బు ఆ యిద్దర్నీ ఓవర్‌టేక్ చెయ్యగలిగింది.

రాయుడిని, కాంచనని హాల్లోకి పిలిచి కూర్చోబెట్టింది. సీతారామ్‌కి ఫోన్‌కొట్టి, వెంటనే రమ్మని చెప్పింది. మరో అయిదు నిమిషాల తర్వాత అతనూ వచ్చాడు. ఆమె ఆ ముగ్గురికీ చెప్పిన మాటల్ని దూరంగా కూర్చున్న కొండమ్మ కూడా వింటోంది. ఆనాటి చర్చా కార్యక్రమంలో సింగిల్ పాయింట్ ఎజెండా వుంది. ఆఫీసులోని జియ్యమ్‌గారికి లంచం యిచ్చి ఆయన అనుగ్రహం పొందడం.

ఆ మాటవిని "ఈ పని ఎప్పుడో చేసుండాల్సింది" అన్నాడు సీతారామ్.

"మా ఆఫీసరు లంచాలు తీసుకుంటాడా?" అడిగాడు రాయుడు.

## కొత్తగాలి...

**ప్రేమ.. పెన్సిలిన్ రెండూ ఒకటే**
**అందరికీ సరిపడవు**
**కొందరికి పడతాయి**
**కొందరిని నెడతాయి**

– *బేతంచర్ల శ్యామ్ సుందర్, వినుకొండ*

"ఈ పిల్లి కూడా పాలు తాగుతుందాని అడిగినట్టుంది. మీ ఆఫీసరు కేష్ రూపంగా తీస్కోకపోవచ్చు. కానీ కానుకల రూపంగా ఎందుకు తీస్కోడు? ప్రతీ ఏడాదీ వాడి పెళ్లాం పుట్టినరోజు ఫంక్షన్‌కి మీ అందర్నీ పిలవడంలేదా? మీరంతా వందా రెండొందల చొప్పున చందాలేస్కుని ఓ గిఫ్ట్ కొనివ్వడంలేదా? ఆవిడ తీస్కోవడం లేదా? పైగా, మీ జియ్యమ్ రోడ్డు మీద నడవకుండా పెళ్లాం మాటమీదే నడుస్తాడని మీరేగా చెప్పారు" అంది పద్మావతి. ఓ అయిదునిమిషాల తర్వాత, ఆఫీసరుగారి యింటికి వెళ్లి, ఆయన భార్య సమక్షంలోనే గిఫ్ట్ యివ్వాలనేది నిర్ణయమైపోయింది. తర్వాత అంశం.. ఏ గిఫ్ట్ యివ్వాలి? ఆఫీసరుకి బాగా ఉపయోగపడేదిగా వుండాలి. ఒకవేళ బాబూరావు క్కూడా యిలాంటి అయిడియా వచ్చినా, అతనిచ్చే గిఫ్టుకంటే మనం యిచ్చేదే సుపీరియర్‌గా వుండాలి. రాయుడికి ఓ విషయం గుర్తొచ్చింది. ఆఫీసర్ యింటికి ఏడాదికో సారి బర్త్‌డే ఫంక్షన్‌కెళ్లినప్పుడు ఆ యింట్లోని రూమ్‌కి 'ఏసీ' లేదనే విషయాన్ని గమనించాడు. అదే చెప్పాడు.

"అయితే ఏసీ మెషిన్ కొనిచ్చేద్దాం. ఆ మధ్య జయచంద్రగారింటికి వెళ్లినప్పుడు ఆ యింట్లో బ్లూస్టార్ కంపెనీవాళ్ల స్ప్లిట్ ఏసీ చూశాను. అదే లేటెస్ట్ మోడల్ అని చెప్పారు. అదే కొనిచ్చేద్దాం" పద్మావతి చాలా యీజీగా చెప్పేసింది.

"దాని ఖరీదెంతో?" రాయుడు గొణుగుతున్నట్టుగా అడిగాడు.

"పెద్ద ఎక్కువగా ఏంలేదండి. తర్టీఫైవ్ తౌజండని చెప్పినట్టు గుర్తు. కాకపోతే మరో అయిదువేలు అటూయిటూగా వుంటుందంతే"

ఓ నిమిషంపాటు ఎవరూ మాట్లాడలేదు. కొండమ్మ దూరంగా కూర్చుని వింటున్నా, యీ సంభాషణలో జోక్యం చేస్కోకూడదనే అనుకుంది. కానీ వాళ్లివ్వబోయే గిఫ్ట్ ఖరీదు- నలభైవేలని విన్నాక, అప్రయత్నంగానే ఆవిడ "అంత ఖరీదైన కానుక అవసరమా?" అని అడిగింది.

రాయుడు సమాధానం చెప్పడానికి నసిగినా, పద్మావతి మాత్రం జంకూగొంకూ లేకుండా చెప్పింది. "అవసరమే. ఇన్నాళ్లూ చేసిన ప్రయత్నాలన్నీ ఒకెత్తు, ఇప్పుడిచ్చే బహుమానం ఒకటీ ఒకెత్తు. పైగా యిదే లాస్ట్ ట్రయల్. దీని తర్వాత స్టెప్ ప్రమోషన్ అర్డర్స్ పుచ్చుకోవడమే! మేకు దిగ్గొడుతున్నప్పుడు సుత్తితో టక్‌టక్‌మని కొట్టి

## నిన్నటి నిజం

# అరుదైన మృత్యువు!

బాపిరాజు అంటే చాలామందికి అడివి బాపిరాజు స్ఫురిస్తారేకానీ- బొడ్డు బాపిరాజు గుర్తుకురారు. కానీ ఆయన గొప్పకవి. పద్య కల్పనలో అత్యంత ప్రావీణ్యమున్న భావశబలత కలిగిన కవి. ప్రకృతి సౌందర్యానికి, దేవాలయ శిల్పకళా సౌందర్యానికీ పరవశించిన భావుకుడు. ఆయన కవితా సంపుటి 'శ్రీచందనం' భావకవితా నందనమే. కానీ ఆయన వృత్తిరీత్యా బట్టల వ్యాపారి. ఏలూరు నివాసి. తన వ్యాపారం చూసుకుంటూ ఏమాత్రం ఖాళీ దొరికినా- తనకు తోచినరీతిలో పద్యాలు రాసుకుంటూ పోయేవారు. ఆయన వియ్యంకుడు తటవర్తి వెంకన్నగుప్త గొప్ప వ్యాపారవేత్త. అంతకు మించి సాహిత్య, ఆధ్యాత్మిక పిపాసి. ఆయన భీమవర నివాసి. బాపిరాజు 'శ్రీచందనం' కవితాసంపుటిని వెంకన్నగుప్త వెలుగులోకి తెచ్చారు. 'భీమవరం-శ్రీరామరాజభూషణ సాహిత్య పరిషత్తు' పక్షాన దాన్ని ముద్రించారు.



అంతకుపూర్వం నుంచే బొడ్డు బాపిరాజుకు శిష్యవర్గంకానీ, సత్కారాలూకానీ లేవు. అయితే 1973లో వెంకన్నగుప్త ప్రోత్సాహంతో భీమవరంలోనే బాపిరాజుకు అభినందన సభ ఏర్పాటయింది. ఆ సభలో తనకు జరిగిన ఘనసత్కారానికి సంతోషిస్తూ, తన కవిత్వానికి గౌరవం ప్రతిపాదించినందుకు ఆనంద పారవశ్యంతో ఉపన్యసిస్తూ వేదికపైనే బాపిరాజు కుప్పకూలిపోయారు. ఆయన గుండె పోటుతో అక్కడికక్కడే ప్రాణాలు కోల్పోయారు కూడా. ఇది ఆయన జీవితంలోని ఆశ్చర్యకర విషాద సంఘటన. ఇటువంటి మృత్యువు సాహిత్యజీవుల జీవితాల్లో చాలా అరుదు.

నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం..

కొట్టీ ఆఖరు దెబ్బని టకాల్‌మని కొడతాం గదా! ఇది అంతే"

కొండమ్మ చెప్పిన అభ్యంతరం ఓవర్ రూల్డ్ అయిపోయింది! ఈ నలభైవేలు కూడా అప్పుగా యిప్పించమని సీతారామ్‌నే అడిగింది.

సీతారామ్ కూడా ఎప్పుడూ లేనివిధంగా కాస్త సంశయిస్తూ "నువ్వు అడిగినప్పుడల్లా అడిగినంత యిప్పిస్తున్నాను. ఆ మొత్తం ఎంతయిందో, వడ్డీ ఎంతవుతుందో లెక్క కడుతున్నావా? " అని అడిగాడు.

"నేనెప్పుడు ఎంత తీసుకుంటున్నానో నేనూ రాస్తున్నాన్లెండి. ఇదేకదా ఆఖరి అప్పు. ప్రమోషన్ వచ్చిన రెండునెల్లకి ఈ అప్పు మొత్తం తీర్చిపారేస్తాం" పద్మావతి చాలా ధీమాగా చెప్పింది.

మళ్లీ ఓ మూడు నిమిషాలపాటు నిశ్శబ్దం అక్కడ తార్లాడింది. తర్వాత నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ సీతారామ్ మాట్లాడాడు.

"సరే, ఆఫీసులో నిన్ను పోలీసులు అరెస్టుచేసి తీసుకెళ్లిన తర్వాత నువ్వు శెలవు పెట్టి యింట్లోనే వుంటున్నావు. అంచేత, నేనొక్కరౌండ్ మీ ఆఫీసుకెళ్లి మన యాదగిరి ద్వారా, ప్రస్తుతం మీ ఆఫీసరుగారి మూడ్ ఎలావుందో కనుక్కుంటాను. అలాగే ఆ బాబూరావుగాడు ప్రమోషన్ కోసం ఏ ట్రయల్స్ చేస్తున్నాడో కనుక్కుని వచ్చేస్తాను"

ఆ ప్రపోజల్‌కి రాయుడు ఒప్పుకున్నా పద్మావతి ఒప్పుకోలేదు.

"ఒకసారి ఆ లొకేషన్‌లో అవమానం పొందాక, మళ్లీ అక్కడికి వెళ్లాల్సింది ప్రమోషన్ ఆర్డర్స్ అందుకోడానికే అయ్యుండాలి. అలా అయితేనే పాత విషయం మరుగున పడిపోయి, కొత్త విషయం ఫోకస్‌లో కొస్తుంది. అందుకే ఆఫీస్‌మేటర్స్ తెల్సుకోడానికి యాదగిరి క్కూడా ఫోన్ చెయ్యలేదు. ఇప్పుడు మనం అనుకున్న గిఫ్ట్ ప్రపోజల్‌కి తిరుగే వుండదు. ఇలాంటి శుభకార్యాన్ని, ఘనకార్యాన్ని వెంటవెంటనే చేసేస్తేనే బెటర్ రిజల్ట్స్ వస్తాయి" పద్మావతి యీ మాటల్ని తన అభిప్రాయంలా కాకుండా, తన తీర్పులాగే వినిపించింది.

పది నిమిషాల్లో పద్మావతి, రాయుడు డ్రెస్ మార్చుకుని సీతారామ్ వెంట బయల్దేరారు. అతను వడ్డీ షావుకారు దగ్గరకి తీసుకెళ్లి అప్పు యిప్పిస్తే, ఆ డబ్బు పట్టుకుని అట్నుంచి అటే షాపుకెళ్ళి.. అట్నుంచి అటే ఆఫీసర్ గారింటికి వెళ్లిపోవాలన్నది పద్మావతి వేసిన ప్లాన్. ఆ ప్రకారమే ముగ్గురూ కారులో బయల్దేరారు.

★ ★ ★

జెనరల్ మేనేజరు యింటి ముందు రాయుడు, పద్మ కారు దిగారు. డిక్కీలో పెట్టిన ఏసీ మిషిన్ బాక్స్‌ని రాయుడు మోసుకుంటూ ఆ యింట్లోకి వెళ్లేసరికి ఆఫీసర్ యింట్లోనే కనిపించాడు. రాయుణ్ణి, పద్మావతిని చూడగానే, ముఖ్యంగా వాళ్ల చేతుల్లోని బాక్స్‌ని చూడగానే అతని కళ్లు మెరిసాయి. లోపలున్న భార్య హేమలతని హడావిడిగా పిలిచాడు. ఆమెకు రాయుడు తెలిసినా పద్మావతి తెలియదు. ఆఫీసరే ఆవిణ్ణి పరిచయంచేసి కూర్చోమని చెప్పాడు. హేమలత ఓ రెండు నిమిషాలు మాట్లాడాక నౌఖర్ని పిలిచి రెండు కాఫీలు తీసుకురమ్మని చెప్పింది. రెండు నిమిషాల్లో కాఫీలు వచ్చాయి. గెస్ట్‌లు కాఫీ తాగుతూ వారితో మాట్లాడుతున్నా, ఆఫీసర్ దృష్టి, అతని భార్య దృష్టి రాయుడు పట్టుకొచ్చిన ప్యాకెట్ మీదకే పోతోంది. ఆ విషయాన్ని రాయుడు, పద్మావతి కూడా గమనించారు. రాయుడి దగ్గరున్న సెల్ ఫోన్ మోగింది. అది సీతారామ్ చేసిన ఫోన్ అని గమనించి ఫోన్ కట్ చేసాడు. ఆఫీసర్‌తో ఏదో మాట్లాడబోతుంటే, మళ్ళీ ఫోన్ మోగింది. ఈ ఫోన్ చేసింది యాదగిరి. దాన్ని కూడా కట్‌చేసి, డిస్టర్బెన్స్ లేకుండా ఫోన్‌ని సైలెంట్‌లో పెట్టేసి రాయుడు చెప్పాడు. "సార్! ఇది బ్లూస్టార్ కంపెనీ స్ప్లిట్ ఏసీ మిషిన్ సార్! లేటెస్ట్ మోడల్. దగ్గర దగ్గర ఫార్టీ తౌజండ్ రూపీస్! ఓసారెప్పుడో మనింట్లో ఏసీరూమ్ లేదని చెప్పినట్టు గుర్తు. అందుకే కొనుక్కొచ్చేసాను. లోపల పెట్టించండి" అనగానే హేమలత నౌఖర్ని పిలిచి ఆ బాక్స్‌ని లోపల పెట్టమని చెప్పింది. నౌఖరు ఆ బాక్సుని తీసుకువెళ్ళాడు. ఆఫీసరు ఏడాదికి ఒక్కసారిగాని నవ్వడు. కానీ, యిప్పుడు ప్రతీ మాటా నవ్వుతూనే చెప్తున్నాడు.

"రాయుడిగారి మనసులాగే ఆయనిచ్చిన గిఫ్ట్ కూడా భారీగానే వుంది" అంటూ నవ్వింది హేమలత.

దంపతుల మూడ్‌ని చదవగలిగిన పద్మావతి మాటకచేరి ఆరంభించింది. "గతంలో మా ఆయనవల్ల గానీ, నా వల్ల గానీ ఏవైనా పొరపాట్లు జరిగితే దయచేసి వాటిని మనసులో పెట్టుకోకండి" అంది.

ఆఫీసర్ యీశతాబ్దం మొత్తానికీ మహత్తరమైన జోక్‌ని విన్నట్టుగా పగలబడి పగలబడి నవ్వుతూ "ఎహ్హెహ్హె.. భలేవారమ్మా! మా యింటి ఆడపడుచులాంటి నువ్వు అలా అనకూడదు. అసలీ రాయుడి వల్ల ఏ పొరపాట్లు జరిగాయట? ఏవీలేవే! అలాంటప్పుడు నేనేం మనసులో పెట్టుకుంటాను? ఆరోజు పోలీసులని పిలిచి

రాయుణ్ణి అప్పగించానంటే.. పరిస్థితులమ్మా! మనిషికంటే పరిస్థితులు బలమైనవి కదా! ఆ స్థానంలో నేనేకాదు, ఎవరున్నా అలాగే చేస్తారు. కానీ ఆ విషయాలేవీ, మీరు మనసులో పెట్టుకోకుండా, యీ అన్నయ్య యింటికి రావడం మీ సంస్కారం" అన్నాడు.

కొన్ని క్షణాలు భారంగా గడిచాక, "ఈయన ప్రమోషన్ విషయం యీ వారంలో తేల్చేస్తారనుకుంటాను" అంది.

"తేల్చెయ్యాలి తేల్చెయ్యాలి.. ఎహ్హె హ్హె హ్హె.."

"ఆ పోస్టులోకి బైటనించి ఎవర్నయినా తీసుకొస్తున్నారా?" రాయుడు అడిగాడు.

"బైటవాడెందుకూ దండగా.. ఆఫీసులో నువ్వుండగా.. ఎహ్హె హ్హె"

"అయితే ఆ పోస్టు మా వారికే యిస్తానంటారు కదా!"

"నేననడం ఏవిటమ్మా! అది దేవుడు చెప్పిన మాటే! ఎహ్హె హ్హె"

రాయుడు, పద్మావతి చిన్నగా నవ్వుకుంటూ ఒకర్నొకరు చూసుకున్నారు. డబ్బు ఖర్చయినా తాము వదిలిన నజరానా బాణం గురితప్పలేదనే భావం ఆ నవ్వులో కనిపించింది.

ఆఫీసరు భార్య హేమలత నవ్వుతూ "ఆ ఏసీమిషిన్ యిక్కడకంటే, అక్కడే ఎక్కువ ఉపయోగపడుతుంది" అంది భర్తతో.

"ఔనౌను, ఎహ్హె హ్హె"

"అక్కడ చలికాలంలో గూడా ఫార్టీఫోర్ డిగ్రీస్ హీట్ వుంటుందట"

"ఔనౌను, ఎహ్హె హ్హె"

రాయుడికి, పద్మకి ఆ సంభాషణ గురించి అర్థం కాలేదు. రాయుడు అడిగాడు, "సార్ యిక్కడకంటే అక్కడా అంటున్నారు. అక్కడ అంటే ఎక్కడ?"

"రామగుండంలో.. ఎహ్హె హ్హె"

"రామగుండంలో మీరెందుకుంటారు?"

"నాకు ట్రాన్స్‌ఫరైపోయింది కదా! ఎహ్హె హ్హె"

ట్రాన్స్‌ఫరైపోయిందనే మాట వినగానే కిందనించి మందుపాతర మీదనించి పిడుగు ఒకేసారి శబ్దం చేసినట్టు రాయుడు, పద్మ అదిరిపడి ఒకర్నొకరు చూసుకున్నారు.

"మీకు ట్రాన్స్‌ఫరైపోయిందా?" ఆత్రంగా అడిగాడు రాయుడు.

"ఔను.. ఓహ్హోహ్హోహ్హో! నువ్వు పదిరోజుల్నించి శెలవులో వున్నావుకదా! అందుకే, నీకా విషయం తెలీదు ఎహ్హె హ్హె"

అదిరిపాటు నించి తేరుకుంటూ పద్మ అడిగింది, "ఆ విషయం యిందాక చెప్పలేదేవండీ?"

"మీరు అడగలేదు కదా! ఎహ్హె హ్హె హ్హె"

రాయుడు ఆవేశంగా మాట్లాడాలనుకున్నాడు కానీ, నాలికమీద తడి ఆరిపోవడం వల్ల మాట రావడం లేదు.

పద్మావతి కాస్త లౌక్యం ప్రదర్శిస్తూ "బహుశా మీకు అర్జెంటుగా ట్రాన్స్‌ఫర్ అవడం వల్ల, ఆ ప్రమోషన్ ఆర్డర్స్ ఆల్‌రెడీ వేసేశారనుకుంటాను" అంది.

"లేదు లేదు. నాది సడన్ ట్రాన్స్‌ఫరవడం వల్ల హడావిడిగా వున్న సామాన్లు పేక్‌చేసి పంపడానికే టైమ్ సరిపోయింది. ఆఫీస్ వాళ్ళిచ్చే సెండాఫ్ పార్టీ కూడా

## కొత్తగాలి...

**ప్రభుత్వాసుపత్రిలో**
**వైద్యం చేస్తూ**
**పడిపోయిన డాక్టర్ని**
**ప్రైవేటు ఆసుపత్రిలో చేర్చారు**

– రావి రంగారావు,
మచిలీపట్నం

తీస్కోకుండా వెళ్లిపోతున్నాను. రేపు రాత్రికే ప్రయాణం"

"మరీయన ప్రమోషన్ విషయం? "

"నా సీట్లోకి వస్తున్న కొత్త జెనరల్ మేనేజర్ చూసుకుంటాడు"

రాయుడి ముఖం అప్రయత్నంగానే ఏడుపు ముఖంలా తయారయింది.

"అయితే ఆ ప్రమోషన్ యితనికే యిచ్చెయ్యమని ఆ కొత్త జియ్యమ్‌గారికి చెప్పేసి వెళ్తారనుకుంటాను"

"నో నో నో! ఆ కొత్త జియ్యమ్‌గాడో తింగరబుచ్చి వెధవ. గుడివాడలో నా అండర్లో పనిచేసినప్పుడు మేం యిద్దరం తిట్టుకున్నాం.. ఆ డర్టీ స్కౌండ్రల్‌గాడితో నేను మాట్లాడను. ఎహ్హెహ్హె"

పద్మకి అరికాలిమంట నెత్తికెక్కి, కాలికున్న చెప్పుతీసి జియ్యమ్‌ని ఫెడీఫెడీమని ఆ చెంపా యీ చెంపా వాయించెయ్యాలనుకుంది. కానీ, బలవంతంగా నిగ్రహించుకుంది. రాయుడు పిచ్చి పిచ్చి చూపులు చూస్తున్నాడు. పద్మ తామిచ్చిన ఏసీమిషీన్ గురించి మరోసారి గుర్తుచేస్తూ "సార్.. మీకిచ్చిన ఏసీమిషిను.." అంటుంటే ఆఫీసరే ఆవిడ మాటలికి థాంక్సు చెప్పాడు.

"అదేనమ్మా మీ దంపతుల గొప్పతనం. చాలామంది నేను ఆఫీసర్‌గా వున్నప్పుడు తమ స్వార్థం కోసం గిఫ్టులిచ్చారు. కానీ, మీరేం చేశారు? నేను వెళ్లిపోయేటప్పుడు మీ ప్రేమ చిహ్నంగా, ఓ మధురస్మృతిగా మాకు మిగుల్తుందని అంత కాస్ట్‌లీ గిఫ్ట్ యిచ్చారు. దటీజ్ యువర్ గ్రేట్‌నెస్"

వాళ్ల నౌఖరు లోపల్నించి వచ్చి చెప్పాడు, "ఇప్పుడిచ్చిన బాక్సుని పేక్ అండ్ మూవ్ సర్వీసులో యిచ్చేసొచ్చాను మేడమ్. ఉదయం యిచ్చిన సామాన్లలో దాన్నీ కలిపేశారు. ఆ వేన్ కూడా రామగుండం బయల్దేరిపోయింది"

ఆ తర్వాత మరో అయిదు నిమిషాలు గడిపారు. ఆ వ్యవధిలో ఆ దంపతులు కొంతసేపు ఆవేశంగా చూశారు. మరికొంతసేపు పిచ్చి పిచ్చిగా చూశారు. వారు ఎలా చూసినా.. వారు కానుకగా యిచ్చిన ఏసీ మిషిన్‌ను మోసుకుంటూ ప్యాక్ అండ్ మూవ్‌వారి వ్యాన్ రామగుండంవైపు దూసుకుపోతోంది.

★ ★ ★

రాయుడు, పద్మావతి కారుదిగి, యుద్ధంలో ఓడిపోయిన సైనికుల్లా యింట్లోకి ప్రవేశించారు. అక్కడ సీతారామ్‌తో పాటు, అటెండర్ యాదగిరి కూడా కనిపించాడు. కొండమ్మ వంటగది దగ్గరే గోడకి ఆనుకుని కూర్చుంది. ముగ్గురి ముఖాల్లో సీరియస్‌నెస్‌తో కూడిన చిరాకు కనిపిస్తోంది.

"ఆ గిఫ్ట్ యిచ్చేశారా? "

సీతారామ్ అడిగిన ప్రశ్నకి సమాధానంగా ఆ భార్యాభర్తలు తలదించుకున్నారు. సీతారామ్ ఏనాడూ లేనంత చిరాకునీ, కోపాన్నీ కలగలిపి మందలించాడు.

"మీరిద్దరూ గ్రాడ్యుయేట్లే! చేతిలో డిగ్రీలున్నా బుర్రలో మాత్రం బుద్ధిలేదు. మీకు బుర్ర తక్కువ, తొందరెక్కువ. ఎవడికైనా ఓ వందరూపాయలు అప్పిచ్చేముందు వందరకాలుగా ఆలోచిస్తాం. అలాంట

## కొత్తగాలి...

**జైల్లో మాయరోగాలు**
**ఆసుపత్రుల్లో రాజభోగాలు**
**కారాగారాల్లో శిక్ష పడినా**
**సుఖపడే కిటుకు**

– ఎ. సూర్యప్రకాశ్,
నిజామాబాద్

నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం..

నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం..

## అబ్బే.. వాటి గురించి ఎందుకు?

నిన్నటి నిజం

మల్లాది రామకృష్ణశాస్త్రి పేరు తెలియని సినీ, సాహిత్య అభిమానులు లేరు. ఆయన మంచి సినిమా పాటల కవి. అంతేకాదు మంచి కథకులు కూడా. ముఖ్యంగా తెలుగు



దనాన్ని, కృష్ణాతీర వాతావరణాన్ని చిత్రించిన ఉత్తమ కథకులు. ఆయన మద్రాసులో ఉన్న రోజుల్లో శ్రీశ్రీ, వరద రాజేశ్వరరావు, శిష్ట్లా ఉమామహేశ్వరరావు, జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి తరచుగా కలుసుకునేవారు. ఒకసారి వీరంతా ఒకచోట కలుసుకున్నారు. అప్పుడే మల్లాది రామకృష్ణ శాస్త్రి ఓపాట సినిమాకి రాశారు. ఆ పాటను శిష్ట్లా సన్నగా పాడి, చాలా బాగుందన్నారు. మల్లాదివారికి కోపం వచ్చింది. శ్రీశ్రీ ఆశ్చర్యపోయారు. 'మనం ఇలా సరదాగా మాట్లాడుకుంటున్నప్పుడు సినిమాలకి రాసే మల్లాది రామకృష్ణశాస్త్రి గురించి మాట్లాడుకోకండి. ఆ మల్లాది రామకృష్ణశాస్త్రి ఎవడో నాకు తెలియదు. నేను మీ అందరికీ తెలిసిన వాణ్ణి. అర్థమైందా?' అన్నారు మల్లాదివారు. ఎవరూ కిక్కురుమనలేదు. మల్లాదివారికి తను సినిమాలకు రాసే కవిత్వం మీద అంత చిన్నచూపు ఉండేది. నిజానికి మల్లాదివారిలా సినిమాలకు మంచి పాటలు అల్లినవారు లేరు. అయినా ఆయనకు ఆ పని నచ్చేది కాదు. ఓసారి సాహిత్యం గురించి మాట్లాడుతూ 'మెప్పు కోసం, ఉప్పు కోసం రాసింది సాహిత్యం కాదు. సాహిత్య ప్రయోజనం సాహిత్యమే' అన్నారాయన. అందులోని నిజం నిలకడమీద కాని తెలియదు. ఉత్తమ సాహిత్యం కోసం పరితపించే మల్లాదివారు సినీగీతాలను అంతగా ఇష్టపడేవారు కాదు మరి.

ప్పుడు అంత ఖరీదైన వస్తువు ఆఫీసరుకిచ్చేటప్పుడు ఆ ఆఫీసరుగారి ఆనూపానూ చూస్కోవాలి కదా! నువ్వు పదిరోజుల్నించి శెలవులో వున్నావు. అంచేత మీ ఆఫీసుకెళ్లి లేటెస్ట్ పొజీషన్ తెలుసుకొస్తానంటే మీరిద్దరూ వద్దన్నారు. కళ్లు పోయాక సూర్య నమస్కారాలు చేసినట్టు, ఆ ఆఫీసరుగాడు బదిలీ అయిపోయాక ఆ బహుమతిని తీసుకెళ్లి అప్పజెప్పేసారు. వాడికి ట్రాన్స్‌ఫర్ అయిపోయిందని యిందాక యాదగిరి వచ్చి చెప్పాడు. వెంటనే, ఆ బహుమతివ్వకుండా ఆపడానికి యిద్దరం మీకు ఫోన్ చేసాం. దాన్నీ కట్ చేసేశారు"

యాదగిరీ అదే రీతిలో మందలించాడు. "ఆ ఆఫీసర్‌గాడికి యిదే గిఫ్ట్ యింతకు ముందిచ్చివుంటే, ఈ పాటికి మీరు మేనేజరు హోదాలో గుంటూరులో వుండేవారు. అంత కాస్ట్‌లీ గిఫ్ట్ యిచ్చేటప్పుడైనా, నాకో ఫోన్ కొట్టుంటే, నేను వాడి బదిలీ గురించి చెప్పేవాణ్ణిగా! అసలు యిన్నాళ్లూ లేని యీ పరుగులు, యీ కార్లు, లంచాలు ఎందుకొచ్చాయో నాకు అర్థం కావడం లేదు. మీరు శనీశ్వరుణ్ణి గట్టిగా పట్టేసుకోవడంవల్ల తప్పుమీద తప్పు చేసేస్తున్నారు" అతని మందలింపులో రాయుడిమీద అభిమానం, జాలే వ్యక్తమవుతున్నాయి.

రాయుడు తనమీద, తన మొహమాటం మీద తనే చిరాకు పడుతూ "సరేనండి నాకు బుద్ధి లేదు కాబట్టి మీరిద్దరూ మంద

లించినా, మరో పదిమంది కూలీల్ని పెట్టి తిట్టించినా నేనొప్పుకుంటాను. నేను తొందరపడి ఆ గిఫ్ట్ యిచ్చేసానే అనుకోండి.. అప్పుడా ఆఫీసర్‌గాడేం చెయ్యాలి? తనకి ట్రాన్స్‌ఫర్ అయిందని చెప్పాలి కదా? ఆ బహుమతిని రిఫ్యూజ్ చెయ్యాలి కదా? ఆ రెండూ చెయ్యలేదు. వదిలెయ్యండి! అంత కాస్ట్లీ గిఫ్ట్ తీసుకున్నాక వాడేం చెయ్యాలి? వచ్చే కొత్త ఆఫీసర్‌కి నా పేరు చెప్పి, ఆ బ్రాంచ్ మేనేజర్ ప్రమోషన్ యిచ్చెయ్యమని ఓమాట చెప్పాలి! అబ్బే.. వాడితో నా విషయం మాట్లాడననే కచ్చితంగా చెప్పేసాడు. అలా నా గురించి చెప్పని వాడు నా గిఫ్టెందుకు తీస్కోవాలి?"

యాదగిరికి రాయుడి మాటలు ఎంత మాత్రం నచ్చనట్లుగా ఛీత్కరిస్తూ చెప్పాడు, "అయామ్ సారీ సార్! ఈ రోజుల్లో యిచ్చేవాడు కనిపిస్తే చచ్చేవాడు లేచొస్తాడంటారు. ఈ సంగతి కూడా తెలీని మీకు ప్రమోషన్ యివ్వడం వేస్టండీ"

అంతవరకు మాట్లాడని కొండమ్మ యిప్పుడు మాట్లాడుతుందని పద్మావతి ఊహించింది. ఆవిడేం చెప్పినా తను ఎదురు చెప్పకూడదని కూడా నిర్ణయించుకుంది. అంతేకాదు, గతంలో అనేకసార్లు అత్తగారు తనలోని తప్పుల్ని ఎత్తిచూపితే, దబాయిస్తూ తనని తాను సమర్థించుకుంది. కానీ యిప్పుడు తను చేసిన పని తనకే చిరాకు, కోపం కలిగిస్తోంది కాబట్టి, అత్తగారు తనని మాటల్తో కడిగిపారేస్తే బావుణ్ణనుకుంది.. కానీ, ఆమె ఊహకి భిన్నంగా కొండమ్మ నోరు విప్పి ఒక్క మాటా మాట్లాడలేదు. ఆవిడ చెప్పే మాటలకంటే, ఆవిడ పాటించే మౌనమే పద్మావతిని ఎక్కువగా బాధించింది.

సీతారామ్ కొండమ్మ దగ్గరకెళ్లి ఏదో మాట్లాడి, ఓ పావుటావు సైజు కాగితం తీసుకొచ్చి సోఫాలో కూర్చున్నాడు. నోటితో తిట్టడం యిష్టంలేక తన తిట్లుల్ని కాగితం మీద రాసిచ్చిందేమోననుకుంది పద్మావతి. సీతారామ్ ఆ కాగితం పట్టుకుని చెప్పాడు. "మీ అత్తగారేమయినా మాట్లాడతారేమోనని కనుక్కున్నాను. గతంలో తను ఎన్ని సార్లు ఎన్ని మాటలన్నా అవన్నీ దున్నపోతు మీద కురిసిన వానలాగ ఫలితం లేకుండా పోయాయట. ఇప్పుడు ఆవిడ అందామనుకున్న మాటల్ని దాదాపుగా మా యిద్దరం అనేసామట. ప్రస్తుతానికి బేలన్సేంలేవట. అంచేత యీ కాగితం మాత్రం యిచ్చింది"

ఆ కాగితం ఏవిటో రాయుడికీ అర్థం కాలేదు. పద్మావతికీ అర్థం కాలేదు. చేతిలో రెపరెపలాడుతున్న కాగితం మీదున్న అక్షరాలు మాత్రం రాయుడి చెల్లెలు కాంచనవేనని యిద్దరికీ అర్థమైంది. తన గదిలోనించి కాంచన వచ్చి తన తల్లి పక్కనే కూర్చుంది.

"దానిమీద కొండమ్మగారేం రాయించారో చదవండి" అన్నాడు యాదగిరి.

సీతారామ్ ఆ దంపతుల్ని ఓసారి చూసి పేపర్‌మీదున్న మేటర్ని చదివాడు.

"ప్రియాంక అనబడే ఓ గొప్పింటమ్మాయి పద్మావతికి ఎదురుపడిన దగ్గర్నించి, పద్మావతి, రాయుడు ఫాల్స్ ప్రిస్టేజి ప్రదర్శించడానికి చేసిన తప్పులు, చెప్పుకున్న గొప్పలు, తీసుకున్న అప్పులు.. వాటికయ్యే నెలవారీ వడ్డీలు యీ దిగువ రాయడమైనది. ఆకాశంలోని పక్షిని చూసి కిందనించి మసాలా సామాను నూరేశారు. కానీ, వాళ్ల దెబ్బకి ఆకాశంలోని పక్షి కింద పడలేదు. కానీ, ఆ పక్షికోసం కొన్న మసాలా దినుసుల ఖర్చు మాత్రం ఆకాశం లెవెల్‌కి ఎదిగిపోయింది. మా అబ్బాయి రాయుడుకొచ్చే మొత్తం నెలజీతం, అందులో మినహాయించే ఎమౌంట్లు పోగా చేతికి అందే నెట్ ఎమౌంట్ యీ దిగువ

నీయడం జరిగింది. రాయుడికి అందే నెట్ జీతంలోనించి, నెలవారీ కట్టే వడ్డీల్ని, ఇంటద్దెని మినహాయించగా చేతిలో పద కొండువందల యాభై మిగులుతుంది"

సీతారాం కాగితాన్ని మడతపెట్టాడు. "మిగిలినవన్నీ మీ అమ్మగారు రాయించిన ఫిగర్సే. అవి మీకు బాగా తెలిసినవే కాబట్టి చదవడంలేదు" అన్చెప్పి ఆ కాగి తాన్ని రాయుడికి అందించాడు.

జరిగిన అనుభవాలు పద్మకి యింకా జీర్ణం కాలేదు. అందుకే ఎప్పుడూ అందర్నీ డామినేట్ చేస్తూ మాట్లాడే పద్మ యీ సన్నివేశంలో మౌనప్రేక్షకురాలిగా, ఓ శ్రోత గానే మిగిలిపోయింది. ఆరోజు రాయుడు, పద్మావతి కోర్టులో ముద్దాయిల్లా నిలబడితే సీతారామ్, యాదగిరి లాయర్లలా మాట్లా డారు. కాకపోతే ఏ కేసులోనైనా ఓ డిఫెన్స్ లాయరు, ఓ అఫెన్స్ లాయరు వుంటారు. కానీ యీ కేసులో యిద్దరూ అఫెన్స్ లాయర్లే కనిపించారు. ప్రేక్షకుల్లో కూర్చున్న నిందితుల బంధువుల్లా కొండమ్మ, కాంచన మిగిలిపోయారు.




**మ**ర్నాడు కూడా రాయుడు ఆఫీసులో జాయినవలేదు. మధ్యాహ్నం పన్నెండు గంటలకి కొరియర్ పోస్టులో ఓ లెటరు వచ్చింది. పద్మావతి ఉద్యోగానికి సెలక్ట యిందని, తొమ్మిదో తారీఖులోగా జాబ్‌లో జాయినవ్వాలని తెలియచేస్తూ ఆ కంపెనీ వారు రాసిన లెటరది. తొమ్మిదో తారీఖు నాడు కూడా జాయినవకపోతే, ఆ ఉద్యోగం మీకు అక్కర్లేనట్టుగా భావించబ డుతుందని కూడా ఆ లెటర్లో ఉంది. ఆ రోజు ఏడో తారీఖు. ఆ లెటరు అందగానే పద్మావతి గబగబా వెళ్లి ఆవిడ ఎప్పుడూ చూసే తెలుగు క్యాలెండరుని, గంటల పంచాంగాన్ని తీసుకొచ్చి ఉద్యోగంలో ఏరోజు, ఎన్ని గంటల, ఎన్ని నిమిషాలకు జాయినవ్వాలో చూస్తుందని ఊహించాడు. కానీ, పద్మ అలాగేం చెయ్యలేదు. ఎందుకు చెయ్యలేదంటే.. ఆ కంపెనీవాళ్లు రాసిన ఉత్తరం చదువుతుండగా లేండ్‌ఫోన్ మోగింది. పద్మావతే రిసీవరు అందు కుంది. అట్నుంచి మాట్లాడుతున్నది.. ప్రియాంక!

తను అమలాపురంనించి వచ్చేసానని, తన అత్తగారికి కడుపులోని గ్యాస్‌వల్ల గుండె దగ్గర నెప్పిలాంటిది వచ్చింది తప్ప, అది హార్ట్‌కి సంబంధించిన సమస్యకాదని డాక్టర్లు చెప్పడంవల్ల ఆమె అమలాపురం తిరిగి వచ్చేసిందనీ, తనూ యివాళ ఉదయం ఎనిమిది గంటలకి విశాఖపట్నం చేరుకున్నానని చెప్పింది. ఈ విషయం పద్మావతికి ఆసక్తి కలిగించలేదు. ఊఁ అంటూ ఊ కొడుతోందే తప్ప పెద్దగా ఏమీ మాట్లాడలేదు. తర్వాత ప్రియాంక మాట్లాడిందే పద్మావతి మస్తిష్కానికి చేరింది.

తను ఎట్టిపరిస్థితుల్లోనూ పద్మావతి యింటికి ఎల్లుండి పదకొండూ, ఒంటిగం టల మధ్య వస్తున్నానని యీసారి బ్రహ్మ దేవుడు అడ్డుపడినా ఆగనని చెప్పింది. పద్మావతి సరే అన్చెప్పి ఫోన్ పెట్టేసింది. రాయుడు పంచాంగాన్నీ, క్యాలెండర్నీ పరి శీలించి తొమ్మిదో తారీఖు పావుతక్కువ పదినించి, పావు తక్కువ పన్నెండు వరకు

అమృత ఘడియలున్నాయి. అంచేత ఎల్లుండి కరక్టుగా పదోగంటకల్లా ఆఫీసులో జాయినింగ్ రిపోర్ట్ యిచ్చేయాలని చెప్పాడు.

పద్మావతి ఆ మాటల్ని స్పష్టంగా విన్నా సమాధానం మాత్రం చెప్పలేదు. ఆమె తీవ్రంగా ఆలోచిస్తోంది. ప్రియాంక ఎల్లుండి పదకొండుగంటల్నించి ఒంటిగంటలోగా ఎట్టి పరిస్థితుల్లోనూ వస్తానని చెప్పింది! ఆమెకు చూపించడానికి కారు, చెప్పడానికి అబద్ధాలు సిద్ధంగానే వున్నాయి కాబట్టి ఆమె గురించిన సమస్యలేదు.

ఉద్యోగంలో తను ఎల్లుండిలోగా జాయినవ్వాలి. ఎల్లుండి దాటితే తనకొచ్చిన అప్పాయింట్‌మెంట్ ఆర్డర్స్ కేన్సిల్ అయిపోతాయి.

తను ఉద్యోగంలో జాయినవ్వాలనుకుంటే.. ఎల్లుండి పదోగంటకల్లా జాయినవ్వాలని పంచాంగం చెప్తోంది. ఇన్నాళ్లూ ఆగాక, ప్రియాంకకి కారు చూపించి, మిగతా అబద్ధాలు వినిపించాక కానీ ఉద్యోగంలో జాయినవ్వడానికి వీల్లేదు.

ప్రియాంక తొమ్మిదో తారీఖు పదకొండు గంటల్నించి ఒంటిగంటలోగా వస్తానంది.

పద్మావతి తొమ్మిదో తారీఖు ఉదయం పదిగంటల్నించి పన్నెండులోపు ఉద్యోగంలో జాయినవ్వాలి. పద్మావతి తీవ్రమైన ఆలోచనలో పడింది. తను ఉద్యోగంలో పదిగంటలకి జాయినయితే.. ప్రియాంక పదకొండు గంటలకో, ఆ తర్వాతో వస్తుంది. వస్తే.. తను ఉద్యోగంలో జాయినైనట్టుగా తెలుస్తుంది. తెలిస్తే.. ఓస్ దీని బతుకింతేనా? అనే న్యూనతాభావాన్ని వ్యక్తం చేస్తుంది. తనమీద జాలి పడుతుంది. ఆ జాలినే తను భరించలేదు. గతంలో తను చెప్పినవన్నీ డబ్బా కబుర్లని పసిగట్టేస్తుంది. ఇప్పుడెలా? కింకర్తవ్యం? ఇదే ఆలోచనతో ఆమె మనసు ఊగిసలాడుతోంది.

సాయంకాలం స్కూల్‌నించి రాయుడి కొడుకు శంభు ఆటోలో వచ్చి, యింట్లోకి పరుగెత్తుకుంటూ వచ్చి "డాడీ డాడీ.. మా క్లాస్‌లో నేనే నెంబర్ ఒన్! క్లాస్‌లోనే కాదు, స్కూల్ అంతటికీ నేనే నెంబర్ ఒన్" అన్నాడు మహదానందంగా.

పద్మ కూడా కొడుకు దగ్గరకొచ్చి "దేంట్లో నువ్వు ఫస్టొచ్చావ్‌రా? " అని అడిగింది.

శంభు తన ఆనందాన్ని తమాయించుకుంటూ చెప్పబోతుండగా స్కూల్లో పని చేసే ఆయమ్మ ఆయింటికొచ్చింది. ఆవిడ కూడా ఆ ప్రాంతంలోనే వుంటోంది. ఎప్పుడోగాని రాదు. అందుకే కొండమ్మ, కాంచనలతో సహా అందరూ ఆశ్చర్యపోయారు.

"ఏంటి ఆయమ్మా చాలారోజుల తర్వాత వచ్చావు? " అడిగింది పద్మావతి కాస్త ఆత్రంగా.

"మరేం లేదమ్మగారూ... యిందులో కంగారు పడాల్సిందేం లేదు. నేనూ యీ ఏరియాలోనే వుంటున్నానన్న సంగతి మా టీచరమ్మగారికి తెలుసు కాబట్టి, నన్ను మీ యింటికెళ్లి ఓ కబురు చెప్పమన్నారండి"

"ఏం.. ఏమిటది? ఏం చెప్పమన్నారు" పద్మావతే అడిగింది.

"వరద బాధితుల సహాయార్థం మా స్కూల్లోని స్టాఫ్ అంతా కలసి తలాకాస్త

## కొత్తగాలి...

నేను పుట్టక ముందు
పుట్టిన తర్వాత
నా మరణం తర్వాత
నీడలా అవినీతి
పర్సెంటేజీలోనే మార్పు

– జి.జి.కె. రావు, శ్రీకాకుళం

చందా వేసుకుని యిస్తున్నారు. అలాగే పిల్లల్నీ వాళ్ల పేరెంట్స్‌ని అడిగి పది రూపాయల్నించి, యాభైరూపాయల్లోపు తీసుకొస్తే బాగుంటుందని టీచర్ చెప్పారు. వెంటనే మీ శంభూ లేచి, నా చందా త్రీతౌ జండ్ రుపీస్ అని ప్రకటించాడండి"

అందరూ ఆ మాటకి నివ్వెరపోయారు. పద్మావతి ఆ మాట నమ్మలేనట్టుగా "నిజం గానా? " అని అడిగింది.

"నిజం కాకపోతే నన్నెందుకు పంపుతా రండి? అందరూ యిచ్చినట్టు నువ్వు ఓ పదో యిరవయ్యో తీసుకురారా అన్నారట. నలుగుర్లాగే యిస్తే నేనెలా నెంబర్ ఒన్ అవుతాను మేడమ్? మా డాడీ పెద్ద రీజినల్ మేనేజర్, మాకు కారుంది. మధురవాడలో పెద్ద బిల్డింగ్ కట్టిస్తున్నాం కాబట్టి, నేను త్రీతౌజండే యిస్తానని అన్నాడట"

ఆయమ్మ అలా చెప్తుంటే కొండమ్మ ఆశ్చర్యపోవడం మామూలే! కానీ ఆమె క్కూడా ఆశ్చర్యం కలిగేలా పద్మావతి ఆశ్చర్యపోయి "ఎందుకురా అలా చెప్పావ్? " అని శంభూని అడిగింది.

"నువ్వు అందరికీ అలాగేగా చెప్తుంటావ్? " శంభు ధైర్యంగానే జవాబు చెప్పాడు.

అందరూ ఒకర్నొకరు ఆశ్చర్యంగా చూసుకున్నారు. ఆయమ్మ చిన్నగా నవ్వుతూ "చూశారామ్మా! మీరైనా, మేం అయినా చోటామోటా ఉద్యోగస్థులం. నాది క్లాస్‌ఫోర్ ఉద్యోగం కావచ్చు మీ ఆయనగారిది క్లాస్ త్రీ ఉద్యోగం కావచ్చు పిట్టని కొట్టడం, పొయ్యిలో పెట్టడంలాగ, మనందరం నెలజీతాలమీద బతికే మనుషులం. మనకి బంగ్లాలున్నాయనీ, మానాన్న పేద్ద ఆఫీసరనే నీలుగుడు ఎందుకు నీలుగుతాం? మన బతుకు లేంటో మనకి తెలీదా? అలాంటప్పుడు కుర్రాడెందుకు అలాంటి మాటలు మాట్లాడుతున్నాడు? ఎవరో ఎదవలు కుర్రాడికి కావాలనే ఈ దిక్కుమాలిన కూతలు నేర్పిస్తున్నారు. అంచేత యిక మీదటయినా అలాంటి మనుషులకి దూరంగా వుంచండి. లేకపోతే రేపు పెద్దయ్యాక్కూడా యిదే ఫాల్స్ ప్రిస్టేజ్ అలవాటై పోద్ది. అలాంటి ఫాల్స్ ప్రిస్టేజ్‌కి పోయి నోడెవడూ జీవితంలో బాగుపడ్డని మీరైనా చెప్పండి.. యీ మాటలన్నీ రాజేశ్వరీ టీచర్ చెప్పమంది, చెప్పాను, వస్తానమ్మ" అన్చెప్పి ఆయమ్మ వెళ్లిపోయింది.

ఆయమ్మ వెళ్లిపోయాక కొండమ్మ ఓ ముఫ్పైనలభై వాక్యాలకి తగ్గకుండా పద్మావతికి ఓ లెక్చర్ యిద్దామనుకుంది. కానీ, ఆవిడ చెప్పిన ధోరణి కొండమ్మకి నచ్చింది. మెత్తని చెప్పుతో కొట్టినట్టుగా వున్నాయా మాటలు. ఆయమ్మ వెళ్లగానే పద్మావతి తన కొడుకు వీపుమీద నాలుగు దెబ్బలు కొట్టి "మళ్లీ అలాంటి కూతలు కూశావని తెలిసిందో చంపేస్తాన్" అంటూ వార్నింగ్ యిచ్చింది.

"మరి నువ్వలాగే చెప్తుంటావ్ కదా? " అన్నాడు.

"ఇకమీదట నేను చెప్పను. నువ్వూ చెప్పకు"

పద్మావతి మాటలు విని షాక్ అయింది ముగ్గురు. అందులో మొదటివ్యక్తి

## కొత్తగాలి...

**నువ్వు ఓ పూలవనం**
**నీ నవ్వు బృందావనం**
**నీ పరిచయం నాకు వరం**
**ఆ పరిమళం ఇక నాపరం**

– పట్ల యాదగిరి,
*గుండాల, నల్గొండ జిల్లా*

కొండమ్మ! రెండోవ్యక్తి రాయుడు. మూడో వ్యక్తి కాంచన!

పద్మావతి తన గదిలోకి వెళ్లిపోయి కాస్సేపు తలుపులు మూసి మంచంమీద వాలి ఆలోచనలో పడింది. మరోగంట తర్వాత గదిలోనించి బైటకి వచ్చి రాయుడితో "నేను జాబ్‌లో జాయినవుతున్నాను... రేపే" అని చెప్పింది.

రాయుడు ఆశ్చర్యపోయి "మంచిరోజు ఎల్లుండి కదా అనుకున్నాం?" అన్నాడు.

"ఓ మంచిరోజున చెడ్డపని చెయ్యడం కంటే, ఓ చెడ్డరోజున మంచిపని చెయ్యడం మంచిది. నేను ఉద్యోగం చెయ్యడం మంచిపని అని నాకనిపించింది. దానికి రోజులతో సంబంధం లేదు" పద్మావతి గతంలో తీసుకున్న తప్పుడు నిర్ణయాల గురించి ఎంత కచ్చితంగా చెప్పిందో.. యిప్పుడు యీ నిర్ణయం గురించి కూడా అంతే కచ్చితంగా చెప్పింది.

లేండ్‌ఫోన్ మోగింది. పద్మావతి రిసీవర్ ఎత్తింది. అవతల్నించి ప్రియాంక మాట్లాడుతోంది. ఆమె చెప్పబోయే విషయం వినకుండా, గతంలో తను చేసిన తప్పుని సరిదిద్దుకుంటూ పద్మావతే చెప్పింది. "మొన్నెప్పుడో నీకు చెప్పిన ఎడ్రస్‌లో నేను లేను. అడ్రస్ మారింది.." అంటుంటే ప్రియాంక పగలబడి నవ్వింది.

"ఓకే ఓకే! మీరు ఏ అడ్రస్‌లో వున్నా మీయింటికొచ్చి మిమ్మల్ని కలిసే అదృష్టాన్ని భగవంతుడు కలిగించలేదండి"

"అదేంటి? మా యింటికి రావడానికి దేవుడి సాయమెందుకు?"

"ఎందుకంటే మావారు పనిచేసే కంపెనీ బ్రాంచ్ ఒకటి బెంగుళూరులో వుంది. ఆ బ్రాంచ్‌లో వుండే జెనరల్ మేనేజరు సడన్‌గా చనిపోయారట. మా ఆయనగారు యిక్కణ్ణించి యిమ్మీడియట్‌గా బెంగుళూరు వెళ్లి చార్జ్ తీస్కోవాలని ఆర్డర్స్ వచ్చాయి. అంచేత మేం రేపే బెంగుళూరు వెళ్ళిపోతున్నాం. ఆ సంగతి చెప్పడానికే ఫోన్ చేసాను.." తర్వాత కొంతసేపు మాట్లాడింది. సంభాషణ ముగిసింది. పద్మావతి ఫోన్‌లో జరిగిన సంభాషణా సారాంశాన్ని అక్కడున్న వారికి చెప్పింది.

కాంచన నవ్వుతూ "చాలా చిత్రంగా వుంది వదినా! ఆ ప్రియాంక రాకపోవడం, ఆమె భర్త ట్రాన్స్‌ఫర్‌తో వారు ఈ వూర్నించి వెళ్లిపోవడం.. నువ్వు మారడం ఒకేసారి జరిగాయి" అంది.

పద్మావతి ఆ మాటకి ఎంత మాత్రం ఒప్పుకోలేదు. "నో! ప్రియాంక బదిలీ వార్త తెలీకముందే నేను నా పద్ధతిని మార్చుకున్నాను. ఆ విషయం నువ్వూ, మీ అమ్మా కూడా గ్రహించాలి" అన్చెప్పి పనిమనిషి అనుష్కని పిలిచింది. రేపట్నించి ఆమె పనిలోకి రానక్కర్లేదని చెప్పి, ఆమెకు రావలసిన జీతాన్ని యిచ్చేసి పంపించేసింది.

ఆ రాత్రి కొండమ్మ తన కూతురు గదిలో కూర్చుని నవ్వుతూ ఓ మాట చెప్పింది.

"నా రాక నీ కోసమేనంటూ ఆ ప్రియాంక సడన్‌గా వచ్చింది.. కొన్ని రోజుల తర్వాత వెళ్లిపోయింది! ఆవిడ రావడానికీ, పోవడానికీ మధ్య మీ వదిన చేత కొన్ని అబద్ధాలాడించింది.. కొన్ని లక్షల అప్పు చేయించింది. అంతేకాదు.. మరో గొప్పపని జరగడానిక్కూడా కారణమయింది"

"ఏంటాపని?"

"మీ వదిన నిన్నటివరకు ఖర్చులు చేయించడం తప్ప ఆదాయాన్ని పెంచుకోవడానికి ప్రయత్నించలేదు. కానీ, ఆ ప్రియాంక వల్ల ఏర్పడిన పరిస్థితులు మీ వదిన్ని ఉద్యోగస్థురాల్ని చేసింది.. శుభం"

©

# తరాల తప్వకం.. అంతరం


డా. దేవరాజు మహారాజు

తెలంగాణ ప్రజల భాషలో కవిత, కథ చెప్పి మెప్పించిన ప్రసిద్ధ కవి, రచయిత డా.దేవరాజు మహారాజు. తెలంగాణ ప్రజల భాషలో తొలి కథల సంపుటి వెలువరించింది వీరే. మూడు కథా సంపుటాలు, 'మంచి ముత్యం' నవలిక, ఆరు బాల సాహిత్య గ్రంథాలు, నాలుగు సాహిత్య విశ్లేషణా సంపుటాలు, సైన్సు గ్రంథాలు, ఇతరత్రా అనేక రచనలు చేశారు. వృత్తి పరంగా సైన్స్‌రీడర్ అయినప్పటికీ ప్రవృత్తి అంతా రచనా వ్యాసంగమే. సంగీత, చిత్ర కళల్లోనూ ప్రవేశముంది. జాతీయస్థాయిలో అనేక సాహితీ సత్కారాలూ పురస్కారాలందుకున్న బహుముఖ ప్రజ్ఞాశాలి..

ఒక తరానికి, మరో తరానికి మధ్య పొడసూపే విభేదాలను సునిశితంగా పరిశీలించే ఆయన, ఆణిముత్యంలాంటి 'అంతరం' కథను పాఠకులకు అందించారు. దీని కథ వెనుక కథను ఆయన మాటల్లోనే చదవండి!

**న**వతరం పాత తరాన్ని వెనక్కి నెట్టేస్తుంది. వచ్చే తరం ఈ తరంతో విభేదిస్తుంది. మనుషులు మారతారు, వారి మధ్య మమతలూ పలచ పడతాయి, ఆత్మీయానురాగాల్లో తేడా తొంగిచూస్తుంది. కాలంతో పాటు ఆ తరమూ మారుతుంది. అంతరం మనిషికీ మనిషికే కాదు మనిషికీ మనసుకీ వుంటుంది. ఈ అంతరాన్ని చిత్రించిన నా 'అంతరం' కథ మంచి ప్రాచుర్యం పొందింది.

విశ్వవ్యాప్తమైన అంతరాన్ని ఒక కుటుంబ నేపథ్యంలోంచి విశేషంగా చిత్రించిన కథ 'అంతరం'. ఈ కథ ప్రచురించిన కొద్ది రోజుల్లోనే విశేష పాఠకాదరణ పొందింది. ఇతర తెలుగు పత్రికలతో పాటు కన్నడ, పంజాబీ, హిందీ, ఇంగ్లిష్ భాషల పత్రికలలో, కేంద్ర సాహిత్య అకాడమీ 'ఒక తరం తెలుగు కథా సంపుటి'లో ముద్రితమై దేశ వ్యాప్తంగా పాఠకుల మన్ననలూ పొందింది.

తరాల అంతరం అంశం సున్నితమైందీ, క్లిష్టమైంది. దీని మీద కథ రాయడానికి

ధైర్యం చాలలేదు. దాదాపు పదిహేనేళ్ళ తరవాత మాత్రమే రాయగలిగానంటే ఈ సబ్జెక్టు ఎంతటి సంక్లిష్టమైందో అర్థం చేసుకోవచ్చు.

'అంతరం' కథ రాయడానికి మానసికంగా నన్ను సిద్ధం చేసింది. ఓ సినిమా మిత్రుడు. తను ఓ సినిమా ప్లాన్ చేస్తున్నానని దానికి ఓ కథ కావాలని వచ్చాడు.




తెలంగాణ జీవితం నేపథ్యంగా తరాల అంతరం మీద నాతో చాలారోజులు చర్చించాడు.

నేను 1986లో సుమారు రెండు వందల పేజీల స్క్రిప్ట్ సీన్ ప్రకారం రాసిచ్చాను. ఏవో ఇతర కారణాలవల్ల ఆ మిత్రుడు మళ్లీ కనిపించలేదు. రెండేళ్ళ తర్వాత ఆ స్క్రిప్టు సారాంశం వచ్చేవిధంగా 'అంతరం' కథ రాశాను




ప్రేరణ ఇదే..

బాల్యంలో గమనించిన కొన్ని సంఘటనలే ఈ 'అంతరం' కథా రచనకు ప్రేరేపించాయి. మాది వ్యవసాయక కుటుంబం, తాతగారు సేద్యం చేసేవారు. మా నాన్న ఆ ఊరు వదిలి, మరో ఊర్లో స్థిరపడ్డారు.

నేను పెరిగింది చదువుకుంది ఆ ఊర్లోనే. సెలవుల్లో తాతగారిని, నానమ్మను చూడడానికి స్వంతూరికి వెళుతున్నామంటే ఎంతో సంబరంగా ఉండేది. చిన్నాన్న, చిన్నమ్మ, అత్తయ్య, మామయ్యల ముద్దు మురిపాలు, పాలివాళ్ళ, ఊరివాళ్ళ పలకరింపులు. కచ్చడాలు, బండ్లు, పశువుల సందడి, చల్లని పల్లె వాతావరణంలో ప్రాణం లేచొచ్చేది.

వాగులు దాటి కత్వల మీదనుంచి నడిచి మా పొలం దగ్గరికి పోవడం, అక్కడి తోటలో బాదంకాయలు కొట్టుకుతినడం, వనభోజనాలు చేయడం ఆసక్తిగా ఉండేది.

పోలి, శిగం లాంటివి చూడడం చాలా వింతగా ఉండేది. భయంతో కూడిన ఉత్సాహం కలిగేది.

ఇంట్లో నా వయసు పిల్లలు ఎవరూ ఉండేవారు కాదు. అందరూ నన్ను ముద్దు చేసేవారు. ముఖ్యంగా మా చిన్నాన్న నన్నెంతో ముద్దు చేసేవాడు.

పండుగకు సొంతూరికి వెళ్ళడంలో ఉండే ఆనందాన్ని వర్ణించాలంటే నిజంగా మాటలు చాలవు.

తాతయ్య చనిపోయిన కొద్దిరోజులకే నాన్నకు మా

చిన్నాన్నకూ మనఃస్పర్థ లెక్కువయ్యాయి. పొలాలమీద వచ్చిన పంట డబ్బుకు సరైన లెక్కలు చూపడం లేదని నాన్న అనేవాడు. అసలు భూమంతా పడావే (బీడుపడి) ఉందని, ఏదో కొద్దిభాగం నాట్లేసినా అక్కడ పండిందేమీలేదని అనేవాడు చిన్నాన్న. "వేసిన విత్తనాలైనా రాకపోతే, వ్యవసాయం చేయడమెందుకూ? దాని కోసం ఎప్పుడంటే అప్పుడు నేను డబ్బు పంపడమెందుకూ" అనేవాడు నాన్న కోపంతో. తన తమ్ముడు తనను మోసం చేస్తున్నాడని భావించడానికి బహుశా అదే కారణమై ఉంటుంది.



'అంతరం' కథకు కన్నడ వారపత్రిక 'తరంగ'లో ప్రచురితమైన చిత్రం

ఒకసారి సెలవుల్లో ఊరికి వెళ్లినపుడు, నాన్న చిన్నాన్నల మధ్య చిన్న గొడవ ప్రారంభమైంది. అది చిలికి చిలికి చాలా పెద్దదయ్యింది. ఊళ్ళోని పెద్దలంతా వచ్చారు. ఇల్లూ, భూమీ వాటాలు వేశారు. మొదటి నుండి మా చిన్నాన్న ఉంటున్న ఇంటిని ఆయనకే వదిలేసి, మా నాన్న

## ప్రచురణల పరంపర

'జ్యోతి' మాస పత్రిక (1988)లో 'అంతరం' మొదటగా ప్రచురితమైంది. ఆతరువాత మలి ప్రచురణల పరంపర ప్రారంభమైంది. 'దేవ రాజు మహారాజు కథలు' సంపుటి (1993)లో, కేంద్ర సాహిత్య అకాడమీవారి సంకలనం 'ఒక తరం తెలుగు కథ' (1994)లో, అంతరం కథకు చోటు లభించింది. ఆంధ్రప్రదేశ్ మాసపత్రిక (మే 1995)లో పునర్ముద్రితమైంది. పంజాబీ అనువాదం 'యోజన' (1996)లో, కన్నడ అను వాదం 'తరంగ' (డిసెంబర్ 1997)లో ఢిల్లీ 'తెలుగువాణి' (1998)లో, ఇంగ్లీషు అనువాదం 'పయనీర్' (సెప్టెంబర్2001)లో ముద్రితమైంది.

పక్కనే ఖాళీగా ఉన్న ఇల్లు కోరుకున్నారు. ఇక ఆ ఇంట్లో పచ్చి మంచినీళ్ళయినా ముట్టనని నాన్న కోపంగా గడపదాటి వెళ్ళి పోయారు.

పక్కిల్లు శుభ్రం చేయించి, ఎవరితోనో వంట చేయించారు. ఆస్తుల విషయం నాకు తెలియదు. అసలెందుకు విడిపోవా లన్నది నా బాధ. నిన్న ముద్దు చేసిన వాళ్ళంతా నన్నీరోజు పరాయివాడిలాగా చూస్తున్నారెందుకూ? సెలవులున్నా ఇక ఆ ఊళ్లో ఉండాలనిపించలేదు. ఆ తరు వాత సెలవులు గడపడానికి ఆ ఊరికి వెళ్ళనేలేదు. ఇదే నా కథకు ప్రేరణ.

**ఇదీకథ**

రాములమ్మకు ఇద్దరు కొడుకులు పెద్దులు, యాదగిరి.

పెద్దులు చిన్న ఉద్యోగం చేసుకుంటూ తన భార్యా బిడ్డలతో పట్నంలో ఉన్నాడు. యాదగిరి వ్యవసాయం చేసుకుంటూ స్వంత ఊరిలో ఉన్నాడు.

పెద్దులు కుటుంబ సభ్యులు భార్య యాదమ్మ, కొడుకులు వెంకటేశ్, నర్సింహ, కూతురు సరోజ.

పెద్ద కొడుకు దగ్గర ఆరునెలలు, చిన్న కొడుకు దగ్గర ఆరునెలలు ఉండాలన్న ఒప్పందాన్ని బట్టి తల్లి రాములమ్మ పెద్దులు ఇంట్లోనే ఉంటుంది.(కథ ఇక్కడి

నుండే నడుస్తుంది).

భూమి తగాదా రేపిన గాయాల వల్ల అన్నదమ్ములిద్దరూ అపరిచిత వ్యక్తుల్లాగానో, ఆగర్భ శత్రువుల్లాగానో ఉంటారు. వాళ్ళు చాలా యేళ్ళ క్రితమే వేరుపడ్డారు.

పెద్దులు తన కూతురు సరోజ పెళ్ళికి స్వంత ఊర్లో ఉన్న పొలం అమ్ముతానని అందరికీ చెబుతాడు. కానీ, ఊళ్ళోనే ఉన్న తమ్ముడికి చెప్పడు.

తమ్ముడు యాదగిరి ఆ బాధ వెళ్ళగక్కుకోవడానికి, తరతరాలుగా వస్తున్న తాతల నాటి భూమి నలుగురు చెప్పిన ధరకు తానే కొనుక్కుంటానని చెప్పడానికి భూమిశిస్తు మిషతో అన్న పెద్దులు ఇంటికి వస్తాడు.

అతడు జన్మలో ఆ ఇంటి గుమ్మం తొక్కుతాడని ఎవరూ ఊహించరు. అందుకే అందరూ ఆశ్చర్యపోతారు.

రాములమ్మది ఒకతరం. పెద్దులు, యాదగిరిలది మరో తరం.

పెద్దులు కొడుకులు వెంకటేశ్, నర్సింహలది ఇంకో తరం.




ఈ మూడు తరాల్లోని అంతరాన్ని రూపు కట్టించడానికి కథలో ప్రయత్నించాను. ఎవరికి వారు జీవితాన్ని తమ దృక్కోణం లోంచి చూస్తూ, తామే సరైన పద్ధతిలో ఉన్నామనుకుంటూ ఉంటారు. కానీ కాలం బలమైంది. విలువల్ని, మనుషుల మనస్తత్వాల్ని మార్చేస్తుంది. ఒకప్పుడున్న అనుబంధాలు, ఆత్మీయతలు మరికొంత కాలానికి ఉండకపోవచ్చు.

భూమి నేపథ్యంగా ఛిద్రమైన కుటుంబంలో ఆర్థిక సమస్య ప్రేమల్ని, బాంధవ్యాల్ని ఎలా తొక్కి పెడుతుందో సంకేతాలతో వివరించిందీ కథ. బీటలు వారిన గుండెల నెర్రెల్ని సూత్రప్రాయంగా దర్శింపజేయడమే నా ధ్యేయం.

మనిషితో సంబంధం ఉన్న మట్టి, గాలి, వాతావరణం అన్నీ కలగలిసి, కథలో ప్రవేశించాయి. ఇతివృత్తం మనసులకు సంబంధించింది కాబట్టి, పాత్రలు వాటికవే సున్నితమైపోయ్యాయి. వాటి భాష అవే మాట్లాడాయి. మనుషుల మధ్య ఏర్పడ్డ అగాధం ఆ కొద్దిపాటి మాటల్లోనే రూపుదిద్దుకుంది. ఫలితంగా ఒక సరళమైన శైలి మైదానంలోని ప్రవాహం వలె నింపాదిగా, మెల్లగా కొనసాగింది. అందుకే ఈ కథను నేను రాశానని చెప్పుకోవడం కన్నా, దానికదే రూపుదిద్దుకుందనడం సబబు అంటూ ముగించారు డా. దేవరాజు మహారాజు. ©

## ప్రముఖుల ప్రశంసలు

మానవతా సంబంధాలు వట్టిపోయి, సమిష్టి కుటుంబాలు విచ్ఛిన్నమైపోతున్న పరిణామాన్ని వివరించిన ఈ కథలో తల్లిని చెట్టు కాండంతోనూ, కొడుకుల్ని, మనవల్ని కొమ్మలతోనూ, రెమ్మలతోనూ పోల్చి... కథ చివర కొమ్మల్ని నరుకుతున్న గొడ్డళ్ళ చప్పుళ్ళు వినిపించినట్టు సూచించడం కథకుని భావుకత్వానికి గుర్తు.

– *మధురాంతకం రాజారాం*

రచయితకు నవ్యమైన శిల్పం ఉంది. జీవితాన్ని సమాజాన్ని అర్థవంతం చేయాలనే గాఢమైన నిబద్ధత ఉంది. భాషలో పరిణతి, మంచి చొరవ, పలుకుబడి, పదునైన వ్యక్తీకరణ ఉన్నాయి. దేవరాజు మహారాజు కథలు చదివిన పాఠకుడు ఆనందిస్తాడు. ఆలోచిస్తాడు. నవ్య ప్రయోగానికి అబ్బురపడతాడు.

– *డా॥ వావిలాల సుబ్బారావు*

# కాలాతీతం

స్వీడన్‌కు దక్షిణాన బాల్టిక్ సముద్రతీరంలో డెన్మార్క్ ఆక్రమణలోని ద్వీపం బార్న్‌హోం. కూలీ పనులకూ పొలం పనులకూ స్వీడన్‌నుండి పేదలు ఇక్కడికి వస్తుంటారు. 1877లో ఇక్కడికి వచ్చిన ఒక స్వీడిష్ కార్మికుడు లాస్ కార్ల్‌సన్ కొడుకే కథానాయకుడు పెల్. భార్య మరణించటంతో కొడుకును కంటికిరెప్పలా చూసుకుంటాడు లాస్.

ఈ తండ్రీకొడుకులు పనిచేసే 'స్టోన్‌ఫాం' యజమాని క్రూరుడు. అతడి భార్య ఎప్పుడూ తాగిన మత్తులో కూలీలను నోటికొచ్చినట్లు తిడుతుంటుంది. రోజంతా రెక్కలుముక్కలు చేసుకున్నా తరగని పని. పోట్లాటలు, కీచులాటలు, తాగుడు, వ్యభిచారమే కూలీల వినోదం.

లాస్ పశువులకాపరి. తండ్రికి ఆ పనిలో సాయం చేస్తుంటాడు పెల్. ఒంటరిగా



మార్టిన్ ఆండర్సన్ నెక్సో

# పెల్, ది కాంకరర్




మైదానాలలో, ప్రకృతి ఒడిలో గడపటం పెల్‌కు ఇష్టం. ఇంటికి రాకుండా, ఎప్పుడూ అక్కడే వుండిపోతే బాగుండుననుకుంటాడు. ఒకనాడు మరో పశువులకాపరి కుర్రాడు 'రుడ్'తో పరిచయం అవుతుంది. తీరిక వేళల్లో పెల్ చదువుమీద దృష్టి కేంద్రీకరిస్తాడు. చదవటం, రాయటం నేర్చుకుంటాడు. పనిభారం పెరిగి తండ్రికి అకాల వార్ధక్యం వస్తుంది. ఒక ప్రమాదంలో తండ్రిని మదమెక్కిన దున్నల దాడి నుండి రక్షిస్తాడు పెల్.

పొలంలో కూలీలందరికీ స్త్రీలతో అక్రమ సంబంధాలుంటాయి. ఫలితంగా గర్భం దాల్చిన మహిళలు అనాథ శిశువులకు జన్మనిస్తూనే ఉంటారు. తండ్రి లాస్‌కు కూడా భర్తలేని ఒక స్త్రీతో సంబంధముంటుంది.

# మార్టిన్ ఆండర్సన్ నెక్సో ( 1869 - 1954)

కోపెన్ హాగెన్‌లోని రైతుకుటుంబంలో పుట్టాడు మార్టిన్ ఆండర్సన్ నెక్సో. తండ్రి ఒకప్పుడు బార్న్‌హోం ద్వీపంలో గని కార్మికుడు. అక్కడున్న ఓ గ్రామమైన నెక్సో పేరే ఇంటిపేరుగా మారింది. తల్లి పుట్టింటివాళ్లది కమ్మరి వృత్తి. పదకొండు మంది సంతానంలో నాలుగోవాడు మార్టిన్. తప్పతాగి ఇంటికొచ్చిన తండ్రి పిల్లల్ని హడలగొట్టేవాడు. 'పెల్'లోని ఒక ముఖ్యపాత్ర ఇతణ్ణి పోలివుంటుంది. మార్టిన్ స్కూలుకెళ్లాడుగాని అక్కడి పద్ధతులు నచ్చక మానేశాడు. వీధుల్లోని సైన్‌బోర్డులే అతని తొలి పాఠ్యగ్రంథాలు. కొంత కాలానికి బార్న్‌హోంకు తిరిగి వెళ్లింది కుటుంబం. అక్కడ పశువుల కాపరిగా పనిచేశాడు మార్టిన్. చెప్పులు కుట్టేవాళ్ల వద్ద అసిస్టెంటుగా చేరాడు. రాత్రిళ్లు వీధి దీపాల కింద చదువుకుని సామాజిక అవగాహన పెంచుకున్నాడు.

1892లో ఒక వితంతువు వద్ద ఆశ్రయం పొందాడు మార్టిన్. ఆమె భర్త ఒక దివంగత డేనిష్ కవి. ఆవిడే అతడికి బాగా చదువు చెప్పించి జీవితంలో స్థిరపడటానికి సహాయం చేసింది. 1898లో స్కూల్ టీచర్‌గా ఉద్యోగం చేశాడు. అప్పుడే రచనలు కూడా ప్రారంభించాడు. 1906-10 మధ్యన నాలుగు భాగాలుగా వచ్చిన 'పెల్, ది కాంకరర్' విశేష పాఠకాదరణ పొందింది. ఇది శ్రామికవర్గ దృక్పథంతో రాసిన నవల. 'పెల్' రాసేనాటికి మార్టిన్ సంస్కరణవాదే. రష్యన్ విప్లవం తర్వాత కమ్యూనిస్టుగా మారి, రష్యాలో విస్తృతంగా పర్యటించాడు. లెనిన్‌తో పరిచయం పెంచుకున్నాడు. ఇతర సమకాలీన రచయితల్లా కమ్యూనిజాన్ని ఎప్పుడూ విమర్శించలేదు. 1940లో జర్మనీ నాజీలు డెన్మార్క్‌ను ఆక్రమించుకున్నప్పుడు ఆయనను కాన్‌సెంట్రేషన్ కేంప్‌లో నిర్బంధించారు. 1949లో ఆయన జన్మదినాన్ని జాతీయ సెలవు దినంగా ప్రకటించింది డేనిష్ ప్రభుత్వం. 1951 తర్వాత తూర్పు జర్మనీలోని డ్రెస్డెన్ నగరంలో చివరిరోజులు గడిపాడు

అయితే ఒకనాడు ఆమెభర్త తిరిగి రావటంతో ఈ ప్రేమ వ్యవహారం ముగుస్తుంది. కూలీ అయిన కాంగ్‌స్ట్రప్ రౌడీలా ప్రవర్తిస్తూ, అందర్నీ బెదరగొడుతుంటాడు. అతడి భార్య, తాగి, శోకాలు పెడుతూ, భర్తను దూషిస్తూ ఉన్మాదిలా తిరుగుతుంటుంది. కొందరికిది వినోదం. కొందరు జాలి పడతారు. ఒకసారి కాంగ్‌స్ట్రప్ బంధువైన ఒక బాలిక మీద అత్యాచారం చేశాడని తెలిసి, భార్య అతడి మర్మాంగం కోసి పగదీర్చుకుంటుంది. 'స్టోన్‌ఫాం'లో పరిస్థితులనూ, వివిధ వ్యక్తుల ప్రవర్తననూ ప్రతిభావంతంగా మొదటి భాగంలో చిత్రించాడు నెక్సో.




రైతుకూలీగా జీవితం కొనసాగించటం ఇష్టం లేని పెల్, పట్నం వెళ్లి తన అదృష్టం పరీక్షించుకోవాలనుకుంటాడు.

గ్రామీణ జీవితంతో పోల్చితే నగరంలో హడావిడి ఎక్కువ. ఆ 'బిజీ' పద్ధతులకు అలవాటుపడటం కష్టమే. ఓ చర్మకారుని వద్ద అసిస్టెంటుగా చేరతాడు పెల్. తోటి పనివాళ్లు మొదట అతణ్ణి గేలి చేసినా, తరువాత తమలో ఒకడిగా అంగీకరిస్తారు. వృత్తిలోని మెళకువలు నేర్చుకుంటాడు. వ్యాపారం గురించిన అవగాహన పెంచుకుంటాడు. నగరంలో రకరకాల వ్యక్తులు తారసపడతారు. ఎవడి తిక్క వాడిది. ఒకడు క్షయతో చచ్చిపోతున్నా

జోకులేసి అందర్నీ నవ్విస్తుంటాడు. కొత్త రకం గడియారం తయారు చెయ్యాలని కలలు కంటాడు ఇంకొకడు. మరొకడికి చావుమేళంతో ఊరేగటమంటే సరదా. పెళ్లి చేసుకుంటాడుగాని పిల్లలు కనటానికి భయపడతాడొకడు. లోకాన్ని అర్థం చేసుకోవటమంటే ఇతరుల జీవితాల్ని పరిశీలించటమే.

సమాజగతిని శాసిస్తున్న సామాజిక, ఆర్థిక, ఉత్పత్తి సంబంధాలను అధ్యయనం చేస్తాడు పెల్. పేదరికాన్ని, యజమానుల అధికారాన్ని ప్రకృతి సహజమన్నంత గుడ్డిగా గ్రామాల్లోని ప్రజలు అంగీకరిస్తారు. కాని నగరంలోని కార్మికుల దీనస్థితికి కారణాలు వేరు. వీళ్ల శ్రమశక్తిని దోచుకుంటున్న వర్గ స్వభావాన్ని అర్థం చేసుకోవాలి. ఫాక్టరీల ఆవిర్భావంతో చిన్న వ్యాపారులు, వృత్తిపనివాళ్లు పెట్టుబడిదార్లతో పోటీపడలేక మరింత పేదరికంలోకి కుంగిపోతున్నారు. ఇక్కడ సంపన్న పెట్టుబడిదారీ వర్గం స్పష్టంగా కనిపిస్తుంది. సమాజంలో వాళ్లకు ప్రత్యేక అధికారాలు ఉన్నాయి. ఒకనాడు ఒక కోటీశ్వరుడి కొడుకు మీద చేయి చేసుకున్నందుకు టౌన్ హాల్ వద్ద కొరడా దెబ్బల శిక్ష అనుభవిస్తాడు పెల్. కార్మికుల శ్రమను దోచుకోకపోతే వీళ్లకింత సంపద ఎలా వచ్చింది? అప్పుడప్పుడు పేదలతో ధనికులు పెళ్లి సంబంధాలు కూడా కుదుర్చుకుంటారు. కాని వెంటనే ఆ పేదవాళ్లను తమ వర్గంలో కలుపుకుని పేదలశత్రువుగా మార్చేస్తారు.

గ్రామంలో పొలం కౌలుకు తీసుకుంటాడు తండ్రి లాస్. చీడపీడలతో పంట చేతికి రాదు. శిస్తు కట్టలేక తిరిగి కూలీగా మారతాడు. కాని వృద్ధాప్యం మీద పడింది. కూలీగా కూడా పని చెయ్యలేడు.

సమాజంలో ఈ దోపిడీ, ఈ అసమానతలు ఇలాగే ఉండాలా? దీనికి పరిష్కారం ఉందని గ్రహిస్తాడు పెల్. ఒక విప్లవకారుని ఉపన్యాసాలు విని 'కార్మికులు పని గంటలు తగ్గించుకోవాలి. అందుకోసం అవసరమైతే సమ్మె చేయాలి' అని తెలుసుకుంటాడు. కాని 'సమ్మె' అంటే ఏమిటో అర్థం కాదు. సోషల్ డెమోక్రాట్లు కోపెన్‌హాగెన్‌లో రాజకీయ ఉద్యమం, ఆందోళనలు చేపడతారు. అయితే వాళ్ల డిమాండ్లేమిటో ప్రజలకు స్పష్టంగా చెప్పరు.

ఫ్యాక్టరీ యజమాని మరొకరికి తన వ్యాపారం అమ్మటంతో పెల్ ఉద్యోగం ఊడుతుంది. ఇప్పుడుంటున్నది చిన్న నగరం. ఇక మిగిలింది రాజధాని ఒక్కటే.

కోపెన్‌హాగెన్‌లో పెట్టుబడీదారీ వ్యవస్థ విరాట్ స్వరూపం వికృతంగా దర్శనమిస్తుంది. బూట్లు, పాదరక్షల పరిశ్రమ పూర్తిగా పెద్దవాళ్ల చేతుల్లోనే వుంది. కార్మికులనూ, చిన్న చిన్న పోటీదార్లను కూడా నిర్దాక్షిణ్యంగా దోచుకుంటారు బడా పెట్టుబడిదార్లు. గ్రామసీమల్లో ఉండే పేదరికానికి, ఇక్కడి పేదరికానికి తేడా వుందని గ్రహిస్తాడు పెల్. అక్కడ ఎవరి దగ్గరా డబ్బుండదు. కాని ఆకలిచావులు కూడా ఉండవు. ఇక్కడ అందరూ ఎంతో కొంత సంపాదిస్తారు. అయినా అర్ధాకలి బతుకులే. కొన్నిసార్లు ఉపవాసాలు కూడా. కోడిగూళ్లలాంటి అపార్టుమెంటు గదుల్లో కాపురాలు. తల్లీ, తండ్రీ, ముసలివాళ్లూ, పిల్లలూ -అందరూ ఒకే గదిలోనే! నాచుపట్టి మురికిగా వున్న గోడలు, పొయ్యిలు వెలిగించే స్థితి లేక చలికి గడ్డకట్టుకు పోతారు. వంటచెరకు దొరకదు. ఏ ఆధారమూ లేని నిర్భాగ్యులు చెత్తకుప్పల మీద ఎంగిలి మెతుకులకోసం పోటీపడతారు. అందరూ స్వర్గాన్ని గురించి కలలు కంటారు కాని బతికేది నరకంలో. ఎటు చూసినా తాగుబోతులు, కుటుంబ పోషణకు ఒళ్లమ్ముకునే యువతులే.

కార్మిక సంఘమంటే ఏమిటో తెలియని దశలోనే షూ మేకర్స్ యూనియన్‌లో





పెల్ సభ్యత్వం తీసుకుంటాడు. వేదిక మీద మాట్లాడటం అలవాటు చేసుకుంటాడు. త్వరలోనే నాయకత్వ బాధ్యతలు కూడా స్వీకరిస్తాడు. మరో సీనియర్ నాయకుని కూతురితో ఏర్పడిన పరిచయం ప్రేమగా మారుతుంది. ఆమెను పెళ్లిచేసుకుని, ఇద్దరు పిల్లల తర్వాత జీవితం సజావుగా సాగుతుందనుకున్నప్పుడు గ్రామం నుండి నిస్సహాయస్థితిలో వస్తాడు తండ్రి.

యూనియన్ అధ్యక్షుడిగా పెల్ కార్మికులతో సమ్మె చేయించడంతో ఒక పెట్టుబడిదారుడు దివాళా తీస్తాడు. కార్మిక సంఘాల జాతీయ సమాఖ్యను ఏర్పాటు చేసి ఇతర నాయకులతో సంబంధాలు పెంచుకుంటాడు. తను ఒకప్పుడు పనిచేసిన కంపెనీ యజమాని తనకు డ్రాఫ్ట్‌మన్ ఉద్యోగం ఇస్తాననటంతో సుఖజీవితం వైపు మొగ్గు చూపుతాడు. భార్యకు కూడా ఇదే ఇష్టం. చక్కటి ఉద్యోగం, మంచి జీతం కావాలి గాని, జీవితానికెలాంటి భద్రతలేని ఉద్యమకారుణ్ణి ఏ భార్యమాత్రం ఇష్టపడుతుంది? ప్రమోషన్లు కూడా వస్తే దుస్తులు, నగలు కొనుక్కోవచ్చు, పిల్లల్ని మంచి స్కూళ్లకు పంపవచ్చు. కాని యాజమాన్యాలు తమ వైట్ కాలర్ ఉద్యోగులతో పనిమాత్రమే ఆశించవు. కార్మికుల సమ్మె విచ్ఛిన్నం చెయ్యటానికి వాళ్లు కృషి చెయ్యాలని కూడా ఆదేశిస్తాయి. కార్మిక సోదరులకు ద్రోహం చెయ్యటం కన్న ఉద్యోగం వదులుకోవటానికే ఇష్టపడతాడు పెల్.

సమ్మెలో ఎప్పుడూ కార్మికులదే కింది చెయ్యి. యాజమాన్యం వద్ద వున్న ధనం, బలం వీళ్లకు ఉండవు. జీతాల్లేకపోతే కుటుంబాలు ఆకలికి మలమల మాడిపోతాయి. అందరూ రోడ్డున పడతారు. చలికాలంలో తలదాచుకునేందుకు ఓ గదికూడా

లేకపోతే ఎంత కష్టమో! ఇదే అదనుగా ఫ్యాక్టరీ యజమానులు మూకుమ్మడిగా వాకౌట్ ప్రకటిస్తారు. పెల్ ఇంట్లో ఎవరికీ తిండి లేదు. అతని తండ్రి లాస్ ముష్టెత్తుకుంటాడు. సుఖజీవితం గురించి కలలు గన్న భార్య తన పిల్లలకు ఒక్కపూట తిండి కోసం ఒళ్లమ్ముకుంటుంది. ఇది ద్రోహం కాదు, దిక్కులేని పరిస్థితి. పెట్టుబడిదారులతో యుద్ధం ప్రారంభమైంది. ఉద్యమంతో మమేకమై, తన సర్వశక్తులూ ఒడ్డి పోరాడతాడు పెల్. మున్సిపల్ పారిశుద్ధ్య కార్మికులు కూడా సమ్మెలో చేరటంతో ఫ్యాక్టరీ యజమానులు దిగివస్తారు. సమ్మె విజయవంతమైందని తెలియకుండానే మరణిస్తాడు లాస్. యూనియన్లు నగరంలో విజయయాత్ర నిర్వహిస్తాయి. ఇల్లులేని పెల్, తన పాత మిత్రురాలు మేరీతో ఒక రాత్రి గడపుతాడు. వెంటనే పెట్టుబడిదారుల కుట్రల మూ లంగా పెల్‌ను దొంగ అభియోగాలతో అ రెస్టు చేస్తారు. సమ్మె విజయవంతమైంది. కాని నాయకుడు జైలు గోడల వెనక బందీ.

సంవత్సరాలు గడిచాయి. విడుదల నాటికి పెల్ మొహం ముడతలు పడింది. జుత్తు నెరిసింది. ఆశయ సాధనపట్ల నిబద్ధత మాత్రం తగ్గలేదు. భార్యకోసం గాలిస్తాడు. మిత్రుల సహకారంతో ఆమె చిరునామా తెలుసుకుంటాడు. అప్పటికామెకు ముగ్గురు పిల్లలు. పెద్దకొడుకు పేరు లాస్ ఫ్రెడెరిక్. ఒకమ్మాయి అన్నా. మరో కూతురు మేరీ శిశువుకు జన్మనిచ్చేటప్పుడు మరణించటం వల్ల, ఆమెకు పుట్టిన పిల్లను కూడా పెంచుతుంటుంది భార్య. లోకం చాలా మారిపోయినట్టుగా గ్రహిస్తాడు పెల్. పెద్దజీతాలు తీసుకునే ఉన్నతోద్యోగులు బూర్జువా సుఖాలకూ, ఆ భావజాలానికీ అలవాటు పడ్డారు. అంటే ఒకరకంగా పెట్టుబడిదారీ వ్యవస్థ బలపడింది. అయితే అసంఘటిత కార్మికులు, నిరుద్యోగుల పరిస్థితి మాత్రం మరింత దిగజారింది. వాళ్లకు జీవిత భద్రత లేదు. ప్రతిరోజూ జీవన్మరణ సమస్యే. యూనియన్లు కూడా వీళ్లను విస్మరించాయి. వ్యవస్థ బహిష్కృతులే అనార్కిస్టులుగా మారుతున్నారు.

పెల్, భార్యతో కలిసి బోర్డింగ్‌హౌస్ నిర్వహించటానికి ప్రయత్నిస్తాడు. ఒక ఫ్యాక్టరీ యాజమాన్యం అతడికి మళ్లీ ఉద్యోగం ఇస్తామని ఆశ పెడుతుంది. కాని ఇలాంటి ప్రలోభాలకు లొంగి, ఆత్మద్రోహం చేసుకోగూడదనుకుంటాడు పెల్. బోర్డింగ్ హౌస్ నిర్వహణ కష్టతరమవుతుంది. సంసారం గడవటం ఎలా అన్నదే తక్షణ సమస్య. ఆ దశలో సోషలిస్టు భావాలున్న సంపన్నుడొకడు తారసపడతాడు. ఈ అవకాశాన్ని అందిపుచ్చుకుని తన కలలోని సమసమాజాన్ని సాకారం చేసుకునే దిశగా తొలి అడుగులేస్తాడు పెల్. సహకార పరిశ్రమల వల్ల మాత్రమే ఇది సాధ్యం. అందరికీ సమాన ప్రతిఫలం ముడుతుంది. ఐచ్ఛికంగా శ్రమిస్తారు కార్మికులు. ఖాయిలాపడ్డ ఒక పరిశ్రమను కొనుగోలు చేసి, తన ప్రణాళికను అమలు చేస్తాడు పెల్. అనేక ఆటుపోట్ల తర్వాత పరిశ్రమ నిలదొక్కుకుని లాభాలార్జిస్తుంది. పెట్టుబడిదారీ వ్యవస్థకు వ్యతిరేకంగా ఏర్పాటైన సహకార రంగంలోని తొలి విజయం అది.

నూతన సమాజ నిర్మాణానికి ఇదే సరైన మార్గమనే నిర్ణయానికి వస్తాడు పెల్. మొదట అనార్కిస్టులు పెల్‌ను 'సంస్కరణవాది' అని ఎద్దేవా చేస్తారు. కాని పెల్ ఓపికగా వాళ్ల దుందుడుకు విధానాలను ఎత్తిచూపుతాడు. మానసిక పరివర్తన, సహకార విధానం- వీటి ద్వారా మాత్రమే నూతన సమాజం ఆవిర్భవిస్తుందని నిరూపించిన పెల్ నిజమైన విజేత.

–ఎం.వసంత

# ఆదివాసీ కవితా భగీరథుడు


డా. సీతాకాంత్ మహాపాత్ర

ఆయన ఉన్నతోన్నత పదవులు సమర్థంగా నిర్వహిస్తూనే గ్రామీణుల స్థితిగతులకు, ప్రత్యేకించి ఆదివాసీ ప్రజల జీవన రీతులకు దర్పణాలుగా నిలిచే కవితలు, వ్యాసాలు, పరిశోధన గ్రంథాలు అనేకం రచించారు. అంతేకాదు, అనితర సాధ్యమైన రీతిలో ఆదివాసీ మౌఖిక సాహిత్యాన్ని సంకలనం చేసి అంతర్జాతీయ ఖ్యాతి గడించారు. కవిత్వాన్ని ముక్తిదాయక పరావిద్యగా భావించిన సాహితీ తపస్వి ఆయన. తన సృజనాత్మకతతో ఒరియా సాహితీ క్షేత్రంలో అతి విశిష్ట స్థానాన్ని సముపార్జించుకున్న ఆయనే డా.సీతాకాంత్ మహాపాత్ర . 1973-92 మధ్య భారతీయ భాషల్లో చేసిన అత్యుత్తమ రచనలకుగాను 1993లో జ్ఞానపీఠ పురస్కారం ఆయనను వరించింది.

డా. సీతాకాంత్ మహాపాత్ర 1937 సెప్టెంబరు 17న ఒరిస్సా రాష్ట్రం మహంగలో జన్మించారు. తండ్రి భగవాన్ మహాపాత్ర. తల్లి ఇందుమతి మహాపాత్ర. మహానదికి ఉపనది అయిన చిత్రోత్పలా తీరాన వున్న మహంగ గ్రామం ప్రకృతి సౌందర్యానికి ఆటపట్టు. మహాపాత్ర ప్రతిభావ్యుత్పత్తులు బాల్యంలోనే బహిర్గతమయ్యాయి. చదువుల్లో దిట్ట. విద్యార్థి దశలోనే కవితారచన ప్రారంభించారు. స్వగ్రామంలో హైస్కూలు విద్య పూర్తిచేసి, కటక్‌లోని రావెన్షా కళాశాలలో చేరి పట్టభద్రుడయ్యారు. రాజనీతి శాస్త్రంలో అలహాబాదు విశ్వవిద్యాలయం నుంచి 1959లో ఎంఏలో సర్వ ప్రథముడిగా ఉత్తీర్ణుడయ్యారు. ఆ సంవత్సరమే ఉత్కళ విశ్వవిద్యాలయంలో అధ్యాపక పదవి చేపట్టారు. 1961లో ఐ.ఎ.ఎస్.లో ప్రథమస్థానంలో నిలిచి, తర్వాత ఎన్నో ఉన్నత పదవులు అలంకరించారు. ఒరిస్సా ప్రభుత్వంలో హోం, విద్య, సంస్కృతితో సహా పది శాఖలకు కార్యదర్శిగా, కేంద్రంలో సంస్కృతి, అధికారభాషా వ్యవహారాల శాఖలతో సహా నాలుగు శాఖల కార్యదర్శిగా సేవలందించారు. ఎన్ని బాధ్యతలు నిర్వహిస్తున్నా సాహిత్యాభిలాష ఆయనలో పెంపొందుతూనేవుంది. జగన్నాథ దాస్, అంధ ఆదివాసీ కవి భీమభోయి, ఇంకా గోపీనాథ మొహంతి రచనలపై మహాపాత్రకు విశేషాభిమానం. ఆయనకు సంథాలి భాష బాగావచ్చు. సుందర్‌గఢ్, మయూర్ భంజ్ జిల్లాల్లో లెక్చరర్‌గా పనిచేసినప్పుడు పెక్కు ఆదివాసీ భాషలతో సన్నిహిత పరిచయం ఏర్పరచుకున్నారు. ఆదివాసీ సమాజాల ఆధునికీకరణ అధ్యయనం కోస హోమీబాబా ఫెల్లోషిప్,




కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయంలో కొలంబో ప్రణాళిక కింద ఫెల్లోషిప్, హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో ఫోర్డ్ ఫౌండేషన్ కింద ఫెల్లోషిప్ అందుకున్నారు. సోషల్ ఆంత్రోపాలజీలో పిహెచ్.డి. చేశారు. యునెస్కో సంస్థవారి ప్రపంచ సాంస్కృతికాభివృద్ధి దశాబ్దం సందర్భంగా 1994-96 మధ్య

దానికి అధ్యక్షపీఠం వహించారు. రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియాకు అంబుడ్స్‌మన్‌గా వ్యవహరించారు. నేషనల్ బుక్ ట్రస్ట్‌కు అధ్యక్షులుగా పని చేశారు. ఎన్నో విదేశీ విశ్వవిద్యాలయాలు నిర్వహించిన సదస్సుల్లో పాల్గొని ఆంత్రోపాలజీపై ప్రసంగించారు. సదస్సులు కొన్నింటికి అధ్యక్షత వహించారు.

ప్రాక్పశ్చిమ సాహిత్యాన్ని అధ్యయనం చేయడంతోపాటు, సమాజాన్ని లోతుగా పరిశీలించిన విస్తృత అనుభవంతో మహాపాత్ర ఉత్తమ రచనలు అందించారు. ఒరియా, ఇంగ్లిష్ భాషల్లో ఆయన రచనలు వస్తువు, శిల్పం, అభివ్యక్తి, భాష, శైలీపరంగా ఎంతో వైశిష్ట్యాన్ని చేకూర్చుకున్నాయి. పాఠశాల స్థాయిలోని స్కూలు పత్రికలో 1950 లోనే కవితలు వెలువరించారు. రావెన్షా కళాశాల పత్రికలో 1953-59 మధ్య మహాపాత్ర రచనలు విరివిగా ప్రచురితమయ్యాయి. స్పష్టమైన, ఉదాత్తమైన భావనలతో కవితారచనకు ఉపక్రమించారు. 'కవిత్వం నాగరికతకు ఆత్మవంటిది. అది కాలంతో మన పోరాటగరిమకు నికషోపలం' అంటారాయన. 1963లో ఆయన తొలి కవితాసంపుటి 'దీప్తి ఓ ద్యుతి' వెలువడింది. అది నూతనస్వరం వినిపించింది. తాత్వికత, సంప్రదాయం, పదసౌందర్యం మేళవించుకున్న కవితలివి. భావుకత, సహజ సుందరశైలిని నింపుకున్నాయి. ఒక కవితలోని కొన్ని పంక్తులు: 'అంతా అంతర్ధానం/ లుప్తమవుతున్నాయి బ్రహ్మాండపు దొంతరులు/ విలీనమవుతున్నాయి/ ఆద్యదేహం ఇంకిపోతుంది/ తత్వాలనరాల నుంచి/ ఉన్నవన్నీ సర్దుకుంటున్నాయి/ సూర్యుని ఆఖరి కిరణాలు'.

రెండవ సంపుటి 'అష్టపది' 1967లో వెలువడింది. ఇందులో ఎనిమిది కవితలున్నాయి. ఆధునిక ఒరియా కవితారచనకు శక్తిమంతంగా ఈ కవితలు దిశానిర్దేశం చేస్తున్నాయని విమర్శకులు భావిస్తున్నారు. శూన్యవాదానికి స్వస్తి చెప్పి ఆశావాదంవైపు సాగించే ప్రస్థానం కనిపిస్తుంది. మహాపాత్ర వీటిలో అద్భుతంగా పురారూపాలు, భావచిత్రాలు, ప్రతీకలు వాడుకున్నారు. అంతే కాదు, పురాణాల్ని, జానపద నుడికారాన్ని ఆధునిక అభివ్యక్తికి అనుగుణంగా అన్వయించుకోవడం ఈ కవితల్లోని మంచి విశేషం. మూడో సంపుటి 'శబ్దర్ ఆకాశ్' చాలా విలక్షణ కవితా సంపుటి. నిజస్మృతిగా ఉండే వ్యక్తిస్మృతిని, సామూహిక స్మృతిగా వుండే జాతీయ స్మృతిని రెండు పార్శ్వాలుగా చూపి, జాతీయ స్మృతిని అగ్రపీఠంపై అధిష్ఠింపజేశారు. మహాపాత్ర సృజించిన భావచిత్రాలు అత్యంత గంభీరంగా దర్శనమిస్తాయి. ఒక కవితలోని భావచిత్రం, 'నా పదాలు వసంతం చివర/ ఆకస్మికంగా ముగిసే గందరగోళపు కోకిలగానం/ నా భాష దేవతల అజ్ఞాతపు నిలయాలవైపు/ సూర్యుడి వల్ల మాడిపోయిన భూమి ముఖంవైపు/ అనునిత్యం చేతులు చాపే మూగశిశువు రోదన'. మహాపాత్ర సముద్ర, చిత్రానది సమయర్ రోష్‌నామ్, వర్ష సకాల్ మొదలైన పద్దెనిమిది ఒరియా కవితా సంపుటాలు అందించారు. 'భిన్న ఆకాశ్ భిన్న దీప్తి', 'నిస్సంగ మణిష', 'శబ్దస్వప్న ఓ నిర్భీకత', 'అంధారర్ ఝోటి చిట'- వ్యాస సంపుటాలు, 'అనేక శరత్' అనే యాత్రాచరిత్ర, నాలుగు అనువాదాలు అందించారు. ఆదివాసీ కవితలపరంగా మహాపాత్ర కృషి అనన్యసామాన్యం. 1972-92 మధ్య పది సంకలనాలను ప్రచురించారు. మహాపాత్ర సంకలనాలు, ఆంగ్ల రచనలు అంతర్జాతీయంగా ప్రశంసలందుకున్నాయి. కవితలు, వ్యాసాలు, అనువాదాలు తదితర నలభైకిపైగా గ్రంథాలను ఆంగ్లంలో వెలువరించారు. ఒక ఆంగ్ల కవితలో ఇలా చమత్కరించారు: 'పిల్లవాడి వేసవి సెలవులు/ ముగిశాయి/ కేరింతల కాలం చెల్లిందని/ ఇక గుర్తించాలి'

భారతదేశ ఆదివాసీ మౌఖిక కవితల విషయంలో మహాపాత్రను సాటిలేని ప్రజ్ఞాశాలిగా ప్రపంచం గుర్తించింది. ఆయన రచనలు హిందీ, బెంగాలీ, పంజాబీ, తెలుగు, మళయాళం, స్పానిష్, హీబ్రూ, రష్యన్, చైనీస్, అరబిక్ మొదలైన భాషల్లో అనువాదమయ్యాయి. కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు, కుమారన్ ఆసాన్ అవార్డు, సోవియట్ ల్యాండ్ నెహ్రూ అవార్డు, ఒరిస్సా సాహిత్య అకాడమీ పురస్కారం రెండుసార్లు, జాషువా పురస్కారం, మొదలైనవి ఆయన అందుకున్నారు. టోక్యోలోని సోక విశ్వవిద్యాలయం ప్రత్యేక స్నాతకోత్సవంలో ఆయనకు విశ్వవిద్యాలయ అత్యున్నత గౌరవం ప్రదానం చేసింది.

సాహితీ వ్యాసంగంలో సృజనాత్మక రచనలతోపాటు ఆదివాసీ కవితా సంకలనాల ద్వారా కొత్త వాకిళ్లు తెరిచిన సాహితీవతంసుడు సీతాకాంత్ మహాపాత్ర. ఆయన ప్రస్తుతం ఒరిస్సా రాజధాని భువనేశ్వర్‌లో నివసిస్తూ తన రచనా వ్యాసంగాన్ని కొనసాగిస్తున్నారు.

– గోవిందరాజు రామకృష్ణారావు

# మనసున ఉన్నదీ...



★ జులై నవల 'పుట్టుమచ్చ' చాలా బాగుంది. కథనం హాయిగా, ఆలోచింపజేసే విధంగా సాగింది. ఆద్యంతం ఆసక్తిగా చదివించే సన్నివేశాలు, సంభాషణలు ఉన్నాయి. పాత్రల్ని తీర్చిదిద్దిన తీరు బాగుంది. బోయ జంగయ్య ఓ మంచి ఆణిముత్యంలాంటి నవలను అందించారు.

–మల్లేశ్వరరావు, శ్రీకాకుళం

★ సింగపూర్ బర్డ్స్ పార్కులోని ఓ ఆటవి కుడి విగ్రహాన్ని 'చతుర' బ్యాక్ కవర్ పేజీలో ఇవ్వడం కొత్త తరహాలో ఆకట్టుకుంది.

– జి.శ్రీ, పెద్దచెల్మెడ

★ జులై 'చతుర' నవలలో ప్రధాన పాత్రధారిణి గంగను రచయిత బాగా ఫోకస్ చేశారు. తన కూతురు సాగరిని కలిసేందుకు గంగ వెళ్లినప్పుడు, సొంత కూతురే తల్లిని గుర్తుపట్టకపోవడం కంటతడి పెట్టించేలా ఉంది. ఇక కొత్తగాలి కవితలు నిజంగా సేద తీర్చే చెలమల్లా ఉన్నాయి.

– జి.జి.కె. రావు, శ్రీకాకుళం

★ ఆడబతుకు పీడ బతుకని, పరిపక్వానికి రాకముందే కన్నెబతుకు కడగండ్లపాలాయె ముప్పు ఉందని, సరిచేసుకుందామంటే ఎక్కడ చూసినా ముళ్లబాటేననే స్ఫురింపజేసిన బోయ జంగయ్య 'పుట్టుమచ్చ' నవల ఆద్యంతం ఏకబిగిన చదివించింది.

–మార్తాలాజరస్, అత్వెల్లీ, మేడ్చల్

★ జులై 'చతుర' సర్వాంగ సుందరంగా రూపుదిద్దుకుంది. 'చిరి' ముఖచిత్రం ఈ సంచికకు అందాలు విరజిమ్మింది. కొత్తగాలిలో కవితా సంబరం అంబరాన్ని తాకింది. 'పుట్టుమచ్చ' నవల కథాంశం మనసుకు హత్తుకుంది. ఇందులో ముఖ్యంగా గంగ, జమున, మోతి పాత్రలు ఆప్యాయతకు, మానవతకు అద్దం పట్టాయి. జీవన చిత్రంలో వివిధ రంగులతో కూడిన సంఘటనలన్నీ ఓ ఆకృతి ధరించిన తర్వాత ఎదురు నిలిచిన సజీవ చిత్రాలుగా నవలలోని పాత్రలు రూపుదిద్దుకున్నాయి. నరేశ్ మెహతా జీవిత విశేషాల్ని జ్ఞానపీఠాలులో చదివి ఆనందించాం.

– టి.వి.డి.ఎన్. సీతారామారావు, విజయవాడ

★ చతుర నవలలు చాలా మంచివి ప్రచురిస్తున్నారు. జులై నవల 'పుట్టుమచ్చ' చాలా బాగుంది. రచయిత బోయ జంగయ్య శైలి అపూర్వం. ఇంత ఆధునిక కాలంలోనూ అలాంటి కులాలు ఉన్నాయా అని ఆశ్చర్యానికి గురయ్యాను. టాంక్‌బండ్ కథల్ని మిస్ అవుతున్నాం. మళ్లీ నెలలో వస్తుందేమోనని ఎదురు చూస్తున్నాం.

–ఉమాసుభా ప్రసూన, విశాఖపట్నం

★ జులై చతుర నవలా రచయిత అధిక ప్రాధాన్యం సెక్స్ వర్ణనకు, చౌకబారు శృంగారానికి ఇచ్చారు. సంఘంలోని ఓ కులం తమ కులవృత్తిని మానుకోవడానికి, మార్చుకునేందుకు కృషి చేయడమే కథా ప్రాధాన్యం. దీన్ని సాధించేందుకు అంత శృంగారం, వర్ణనా అవసరమా? స్త్రీలను మరి ఇంత దిగజారుడుగా చిత్రించకపోతే కథకేమైనా నష్టమా?

– ముండూరు అప్పల నరసింహం, హైదరాబాద్

★ జులై నవల 'పుట్టుమచ్చ' హృదయాన్ని కదిల్చింది. గంగ పాత్ర జీవనదిలో ప్రవహించుకు వచ్చే కాలుష్యాలను పవిత్రపరుస్తూ పోయినట్లే సాగింది. ఇది సరికొత్త సామాజికాభ్యుదయ నవల అన్పించింది. 'ముఖచిత్రంగా మీ ముఖారవిందం' ఆహ్వానింపదగినది. దీన్ని ప్రవేశపెట్టిన 'చతుర'కు అభినందనలు.

– పెరంబుదూరు కమలాదేవి, హైదరాబాద్

చిరునామా : మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్–500 082

ఈ మెయిల్ :
vipula.chatura@eenadu.net




# శాడిజం

అర్ధరాత్రి 12గంటలు! ఆగకుండా సెల్ మోగుతుంటే గాఢనిద్రలో ఉన్న సంగీత ఉలిక్కిపడి లేచింది. నిద్రమత్తులోనే "హలో" అంది.

"ఏమే అప్పుడే నిద్రపోనిచ్చేడేంటే నీ మొగుడు? ఆడంత పనోడు కాడేంటే?"

నిద్రమత్తు దెబ్బకు వదిలిపోయింది సంగీతకు.

"ఏయ్ ఎవర్నువ్వు? డోంటాక్ రబ్బిష్" అంటూ ఫోన్ కసిగా కట్ చేసింది.

ఐదునిముషాల తర్వాత మళ్లీ సెల్ రింగయింది అదే నెంబరు నుంచి. బాధ

గా, భయంగా చూసింది. ఈ సెల్‌మోత కు గోపీ ఎక్కడ లేస్తాడో అనే భయం మరోపక్క. అందుకే మోగుతున్న సెల్‌ను చటుక్కున స్విచాఫ్‌చేసి ఊపిరి పీల్చుకుంది.

ఇక ఈ రాత్రికీ నిద్రలేనట్టే అనుకుందామె. గత ఇరవైరోజులుగా ఇదే నరకం అనుభవిస్తోంది. ఎవరెవరో తన సెల్‌కు ఫోన్ చేస్తున్నారు.. బ్రా సైజెంత అనో ఎలాంటి మగాళ్లంటే ఇష్టమనో అడుగుతున్నారు. అసభ్యంగా, పచ్చిగా మాట్లాడుతున్నారు.. నవ్వుతున్నారు.. తర్వాత ఆ ఫోన్ నెంబర్లకు ఫోన్‌చేస్తే అవన్నీ పబ్లిక్ బూత్‌లనుంచి వచ్చేవే అని తెలుస్తోంది. ఎవరికి చెప్పుకోవడానికీ లేదు.. భర్తకు చెబుదామా అంటే అతను మొదటే అనుమాన పిశాచి! వికారంగా ఉండే తనకు అందమైన భార్య దొరికినందుకు ఆనందిస్తూనే, మరోపక్క తను ఎవడి మోజులో పడి చెక్కేస్తుందో అన్న భయంతో బతికే శాల్తీ. గ్యాస్‌వాడితో మాట్లాడినా, పాలవాడితో మాట్లాడినా కూడా అనుమానమే.

పండులా ముద్దుగా బొద్దుగా ఉండే బిడ్డల్ని చూసిన ఏ కన్నతండ్రయినా గర్వంతో పొంగిపోతాడు. గోపీ అలా కాదు.. వీళ్లు నిజంగా తనబిడ్డలేనా అనే సందేహంతో భార్యను కాల్చుకుతినే రకం!

అందుకే అతనితో చెప్పలేదు. అమ్మానాన్నలకు చెబుదామంటే వృద్ధాప్యంలో ఉన్నారు. ఈ వయసులో వారికి మనోవేదన కల్పించడం అవసరమా? అనుకునేది. ఈ బాధ భరించలేక ఈ ఇరవైరోజుల్లో ఎన్నోసార్లు ఆత్మహత్య చేసుకోవాలనుకుంది. కానీ బిడ్డలిద్దరూ అనాథలైపోతారని ఆగింది. మనుషులు ఇంత పచ్చిగా మాట్లాడతారని ఆడదాన్ని ఇంత చిత్రవధ చేస్తారనీ ఇంతవరకూ ఆమెకు తెలియదు.. కట్టుకున్నవాడిది ఓ తీరైతే వీళ్లదోతీరు! తన దుస్థితికి తనమీదే తనకే జాలివేసిందామెకు.

ఫోన్ ఆఫ్‌చేసి పెడితే 'ఎవడితో తిరుగు

# చతుర ప్రవేశిక

## ఆగస్టు చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాయగలరేమో చూడండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. కొండమ్మ కొడుకు పేరేంటి?
జ.
2. ప్రియాంక అసలు పేరు?
జ.
3. శంభూ తల్లి ఎవరు?
జ.
4. కవితలు రాసే జీయమ్ ఎవరు?
జ.
5. పద్మావతి ఇంట్లో పనిమనిషి?
జ.
6. 'అంతరం' కథా రచయిత?
జ.
7. 'దీప్తి ఓ ద్యుతి' ఎవరి రచన?
జ.
8. 'పెల్, ది కాంకరర్' రచయిత?
జ.
9. పింగళివారితో జంటకవిత్వం చెప్పింది?
జ.
10. సంగీత భర్త?
జ.

పంపినవారి పేరు: ---------------

-----------------వయసు (   )

చిరునామా: -----------------

-------------------------

-------------------------

పిన్‌కోడ్:                ఫోన్ నెం:

చిరునామా : సంపాదకుడు, విపుల, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

చివరి తేదీ 18

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

విపుల వినోదిని, చతుర ప్రవేశిక ఒకే కవరులో పంపవచ్చు.

# నరకానికే పోతా!

అప్పటి నిజం

చెళ్లపిళ్ల వెంకట శాస్త్రి చెప్పినట్టుగా మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రి స్వయం వ్యక్తుడు. ఆధునికాంధ్ర సాహిత్యానికి లభించిన గొప్పకవి. హరిజనోద్యమంలో 'అంటరాని వారెవరో కారు- మావెంట రానివారే..' అని పాడేవారాయన. తెనాలిపైన అభిమానం ఉన్న వ్యక్తి. అందుకే 'రసజగన్నాథ నటరాజ రంజమాన, మంజుతారాళి అద్దియె మాతెనాలి' అని చాటారు. మాధవపెద్దివారు కవిత్వాన్ని నమ్ముకుని హతాశుడైన వ్యక్తి. కవిత్వం మీద విశ్వాసం పోగానే ఆయనకి దేశంమీదా, దేహంమీదా విరక్తి పుట్టింది. దారిద్ర్యాన్ని, రోగాల్నీ ఆకర్షించారు. గుంటూరులో ఒకసభలో 'నేను స్వర్గాన్ని కాంక్షించను. స్వర్గం ఎలాగుంటుందో తెలీదు. నరకానికే పోతాను. నాకు నరకమంటే ఏమిటో తెలుసు. ఈ లోకంలో స్వానుభవంవల్ల తెలుసు' అన్నారు. అనారోగ్యం వల్లా, విరక్తి వల్లా 'తెనాలి నుండి మరేచోటికైనా వెళితే ప్రశాంతత దొరుకుతుందేమో? అయితే తెనాలిని ఈ జన్మలో వదలడం కష్టమోయ్' అనేవారు.



ఒకసారి తెనాలి కాలువ పక్కనుంచి అబ్బూరి వరదరాజేశ్వరరావు, మాధవపెద్ది నడుస్తున్నారు. అప్పుడు మాధవపెద్దివారికి కనీసం చెప్పులు కూడా లేవు. నేలమీద రెండు, మూడు బొమికల్ని చూసి ఆయనను ఆపుతూ కింద చూసుకుంటూ జాగ్రత్తగా నడువమని చెప్పారు వరద. ఆయన ఓసారి కిందికి చూసి వరద భుజంపై చేయివేసి ఆకాశం వంక చూస్తూ 'చూడంజూడ ఓ మహాశ్మశాన మనిపించున్ నాకు నీ లోకం..' అని తన పద్యాన్నే ఆలపించారు. తర్వాత గట్టిగా నవ్వుతూ 'వెనక్కి పోదాం పద.. జీవితంలో ఎప్పుడూ ముందుకు పోలేం' అన్నారు. ఆయనలోని వైరాగ్యంలోతు మృత్యుంజయునికే తెలియాలి.

తున్నావ్?' అని భర్తగారి తిట్లు. అత్యవసరమై పిల్లలు చేస్తే అందుబాటులో లేకుండాపోతానేమో అనే భయం. అందుకే స్విచాఫ్ చేయలేని పరిస్థితి.

ఫోన్ రింగయితే చాలు ఆమె వణికిపోతోంది.. పిచ్చిగా చూస్తోంది.. ఆ కోపాన్ని పిల్లలపై చూపిస్తోంది. మళ్లీ అంతలోనే తనకు చావొస్తే బాగుణ్ను అనుకుంటోంది. తల్లి అకారణంగా తిడుతుంటే ఆ పసిబిడ్డలు అల్లాడిపోతున్నారు..

ఆమెకు మొదట తన కొలీగ్ అశీష్ మీద అనుమానం వచ్చింది.

'వావ్.. సంగీతాజీ! యూ ఆర్ రాకింగ్..' అనో 'మేడమ్ యూ ఆర్ టూ బ్రిలియంట్' అనో అయినదానికీ కానిదానికీ ఆకాశానికెత్తేస్తాడతను. పదే పదే కాఫీ అంటూ క్యాంటిన్‌కి ఆహ్వానిస్తూంటాడు. అతని ఫ్రెండ్లీనేచర్ గురించి, హెల్పింగ్‌నేచర్ గురించి ఇతర కొలీగ్స్‌ద్వారా తెలిశాకే ఇటీవల కాస్తంత స్నేహంగా మసలుకుంటోంది సంగీత.

★ ★ ★

"చెప్పండి మేడమ్.. క్యాంటిన్‌కి పిల్చి మౌనవ్రతం పట్టారేం?" కాఫీ సిప్‌చేస్తూనే నవ్వుతూ ప్రశ్నించాడు అశీష్.

కప్పును గుండ్రంగా తిప్పుతూ తలొంచుకు కూర్చున్న సంగీత, ఒక్కసారిగా కన్నీటిపర్యంతం అయింది.

అశీష్ కంగారు పడ్డాడు. తర్వాత తనను తాను సంబాళించుకుని ఆమె విషయమంతా చెప్పి మరోసారి కొంగుతో కళ్లొత్తుకుంది.

అశీష్ కాసేపు ఆలోచించి "మీ సెల్ నెంబరు ఈమధ్య ఎవరికైనా ఇచ్చారా?"

"లేదు"

"అలాకాదు. గుర్తుచేసుకుని చెప్పండి.. ఈ ఫోన్‌లు ఎప్పటి నుంచి వస్తున్నాయో జస్ట్ ఒకటి రెండు రోజులు అటూ ఇటూగా.."

సంగీత కాసేపు సీరియస్‌గా ఆలోచిం

చింది. తర్వాత-

"య్యా.. గుర్తొచ్చింది అశీష్! సుమారు నెలరోజులక్రితం పిల్లల్ని స్కూలుకు స్కూటీమీద తీసుకువెళ్తుంటే ట్యాంక్‌బండ్‌పై ట్రాఫిక్ చెకింగ్ జరుగుతోంది. ఓ కానిస్టేబుల్ లైసెన్స్ చూపమని అడిగాడు. దురదృష్టవశాత్తూ ఆ రోజే లైసెన్స్ మర్చిపోయాను. అదేవిషయం చెప్పి వదిలెయ్యమని బతిమాలాను. కుదరదన్నాడు. పెనాల్టీ కట్టమన్నాడు. నా ఖర్మకొద్దీ పెనాల్టీ కట్టడానికీ చాలినంత డబ్బు దగ్గర లేదు.. ఓ పక్క పిల్లలకు పరీక్ష టైమైపోతోంది. ఏమీతోచక టెన్షన్ పడుతూంటే చాటుగా నా నుంచి ఓ వంద నొక్కేసి 'ఓకే మేడమ్ మీ సెల్‌ఫోన్ నెంబరుచెప్పి వెళ్లండి.. మా సార్ అడిగితే చెప్పాలి. అవసరమైతే మీ ఇంటికొచ్చి పెనాల్టీ వసూలు చేసుకెళ్తాం' అన్నాడు. హమ్మయ్య బయటపడ్డాన్రా భగవంతుడా అని నెంబరు చెప్పి వెళ్లిపోయాను. అయినా పోలీసులు ఈ పనిచేస్తున్నారంటే నమ్మను.." అంది ఆమె.

అశీష్ గంభీరంగా విన్నాడు. "ఇఫ్ యూ డోంట్ మైండ్, మీ సిమ్ ఓ రెండురోజుల పాటు నాకివ్వగలరా?"

మరోమాట లేకుండా సంగీత తన సిమ్ తీసి అతనిచేతిలో పెట్టింది. సుమారుగా ఏ టైమ్‌లో ఆ కాల్స్ వస్తాయో కూడా చెప్పింది.

★ ★ ★

"సంగీతగారూ.. గుడ్‌న్యూస్ ఆ వెధవలు దొరికారు.."

"ఈజిట్? మెనీమెనీ థ్యాంక్స్ టూ యూ అశీష్" సంబరంగా లేచివచ్చి అతని చేతులు పట్టుకుని ఊపేసింది సంగీత.

"ఒక్క రిక్వెస్ట్! మీరు సాయంత్రం సైబర్‌క్రైమ్ స్టేషన్‌కివస్తే నేరుగా కేసుఫైల్ చేయొచ్చు. వాళ్లు మీకు తెలిసినవాళ్లేమో కూడా చూడొచ్చు"

ఒక్క నిముషం గంభీరంగా ఆలోచించి "ఓకే డన్" అంది సంగీత.

ఆ సాయంత్రం అశీష్ సంగీత సైబర్ క్రైమ్ స్టేషన్‌కు వెళ్లారు.

ఇన్‌స్పెక్టర్ ఇద్దర్నీ సాదరంగా కూర్చోబెట్టి లాకప్‌లో ఉన్నవాళ్లను తీసుకురమ్మని కానిస్టేబుల్‌కు చెప్పాడు.

కానిస్టేబుల్‌తోపాటు వచ్చిన ముగ్గురిలో ఒకడ్ని చూసి సంగీత ఖంగుతింది.

అతను ఆరోజు తన నెంబర్ తీసుకున్న ట్రాఫిక్ కానిస్టేబుల్!

మిగిలిన ఇద్దరూ అతని దోస్తులని ఇన్‌స్పెక్టర్ చెప్పాడు. అమ్మాయిల నెంబర్లు సేకరించి వేధించడం వారి హాబీ అన్నాడు. వీళ్ల వేధింపులు తాళలేక మూడునెలల క్రితం ఓ అమ్మాయి ఆత్మహత్యాయత్నం చేసిందని చెప్పాడు. వీళ్లపై అనుమానం వచ్చి నిఘాపెట్టామని, అశీష్ వచ్చి ఆమె తరపున ఫిర్యాదు చేయడమే కాక, సిమ్ ఇవ్వడంతో రెడ్‌హ్యాండెడ్‌గా పట్టుకోవడానికి వీలైందని చెప్పాడు.

★ ★ ★

క్యాంటిన్‌లో మర్నాడు-

"అశీష్ పబ్లిక్ బూత్‌లనుంచి ఫోన్‌చేసే వాళ్లను పోలీసులు ఎలా పట్టుకున్నారు?" ఆసక్తిగా అడిగింది సంగీత.

"వెరీ సింపుల్! వాళ్లు కాల్‌చేసినప్పుడు మీరు భయంతో, జుగుప్సతో సెల్ కట్ చేసేవారు. పోలీసులు అలా చేయలేదు. మీరు మాట్లాడుతున్నట్టే ఓ లేడీకానిస్టేబుల్‌తో మాట్లాడించారు. అలా వాళ్లను పావుగంటపాటు మాటల్లోపెట్టి ఆ ఫోన్‌లు ఎక్కడినుంచి వస్తున్నాయో టెలికంవారి సాయంతో ట్రేస్ చేశారు. సమీపంలోని పోలీస్‌స్టేషన్లకు ఆ సమాచారం ఇవ్వడంతో వాళ్లు అక్కడికి వెళ్లి ఆ రోగ్స్‌ను రెడ్‌హ్యాండెడ్‌గా పట్టేశారు.."

రిలీఫ్‌గా నిట్టూర్చింది సంగీత.

-చంద్రప్రతాప్

# హా హా.. అమెరికా 5

## పాఠశాలల్లనూ పోలీసుల నిఘా!

అమెరికా పాఠశాల విద్యార్థుల విషయంలో పోలీసుల దాష్టీకానికి అనేక ఉదాహరణలు ఉన్నాయి. ఇటీవల ఓ భారతీయ అధికారి టీనేజ్ కూతురు కృత్తిక విశ్వాస్ (18) గురించి వార్తల్లో వచ్చింది. న్యూయార్క్‌లోని జాన్‌బ్రూనై హైస్కూల్‌లో చదివే ఆమెని పోలీసులు ఫిబ్రవరి 8, 2011న అరెస్ట్ చేసి, బేడీలు వేసి తీసుకెళ్లారు. ఒకరోజు లాకప్‌లో ఉంచారు. బ్రిటిష్ వైస్‌కౌన్సిల్ కూతురు అయినప్పటికీ, ఆమెకు డిప్లొమేటిక్ ఇమ్యూనిటీ ఉన్నప్పటికీ పోలీసులు దాన్ని ఏమాత్రం పట్టించుకోలేదు. ఆమె తన స్కూల్ టీచర్‌కు సెల్‌ఫోన్‌లో అసభ్య ఎస్ఎంఎస్‌లను పంపిందనే ఆరోపణ రుజువు కాకపోవడంతో పోలీసులు విడుదల చేశారు. నష్టపరిహారానికి ఆమె న్యూయార్క్ నగర పాలక సంస్థమీద 150 లక్షల డాలర్లకు కేసు వేసింది. అమెరికాలోని ప్రభుత్వ పాఠశాలల్లోని పరిస్థితులు ఎంత అధ్వాన్నంగా ఉన్నాయో తెలియజేస్తున్నాయి. అలాంటివే మరికొన్ని ఉదాహరణలు ఇవిగో..

అమెరికాలోని పబ్లిక్ స్కూల్స్‌లో పిల్లలు చదువుకుంటే ముఖ్యంగా పోలీసుల పాలనలో నివసించే పౌరులు ఎలా గడుపుతారోననే విషయాన్ని స్వానుభవం ద్వారా గ్రహిస్తున్నారు. ఎందుకంటే అక్కడి స్కూల్స్‌లోని పరిస్థితులు దాదాపుగా జైళ్లను తలపిస్తున్నాయి. పోలీసులు స్కూళ్లలోకి రావడం మనం ఎరగం. ఇక్కడ పబ్లిక్ పరీక్షల్లో విద్యార్థులు కాపీ కొట్టకుండా స్క్వాడ్స్ అకస్మాత్తుగా తనిఖీకోసం వస్తుంటాయి. మన పాఠశాలల బయట పరీక్షలప్పుడు కొన్నిసార్లు పోలీసుల పహరా ఉంటుందంతే. కానీ అమెరికన్ స్కూళ్లలోకి పోలీసులు నిత్యం వెళ్తుండటం విచారకరం. గతంలో ఎన్నడూ జరగని విధంగా విద్యార్థులను అక్కడ సోదా చేస్తున్నారు. అంతేకాదు.. వారిని రహస్యంగా గమనిస్తారు. సర్వైలెన్స్ కెమెరాల ద్వారా వారి ప్రతికదలికనూ రికార్డ్ చేస్తారు. వారిమీద ఆధిపత్యాన్ని చెలాయిస్తారు. అక్కడ విరివిగా మానవ హక్కుల ఉల్లంఘన జరుగుతోంది. ఇది తెలిసి కూడా బాధ్యతాయుతమైన తల్లిదండ్రులు తమ పిల్లల్ని విధిలేక పబ్లిక్ స్కూళ్లకి పంపిస్తున్నారు.

స్కూళ్లలోని వాతావరణం అధ్వాన్నంగా ఉందనడానికి పత్రికల్లో వచ్చిన కథనాలే సాక్ష్యం.

★ వర్జీనియా రాష్ట్రానికి చెందిన అటార్నీ జనరల్ కన్‌కుక్కునెల్లి ఓసారి ఇలా ప్రకటించారు-

'పబ్లిక్ స్కూల్ అధికారులు విద్యార్థుల సెల్‌ఫోన్లని, లాప్‌ట్యాప్‌లని సెర్చ్ చేయవచ్చు. దీని వల్ల ఆ విద్యార్థి స్కూల్ నియమాలని ఉల్లంఘిస్తున్నాడనే సాక్ష్యం దొరికే అవకాశం ఉందని అధికారులు భావిస్తే.. అది చాలు సోదాకు'

★ పెన్సిల్వేనియాలోని కొన్ని స్కూళ్లలో విద్యార్థులకి ఇచ్చిన లాప్‌ట్యాప్‌లలో రహస్యంగా కెమెరాలు అమర్చారు. దీంతో వారు ఇళ్లదగ్గర ఉన్నప్పుడు 66వేల ఫొటోలు తీశారు. ఇలా వారేం

చేస్తున్నారో తెలుసుకోవడానికి మూడోకంటికి తెలియకుండా ఈ పని చేశారు. ఇది ఓ కోర్టు కేసులో బయటపడ్డ నిజం.

★ కెంటకీలోని ఓ ఎలిమెంటరీ స్కూల్లో పోగొట్టుకుపోయిన ఐదుడాలర్ల నోటుకోసం మూడో గ్రేడ్ విద్యార్థులందరినీ టీచర్లంతా కలిసి సాక్స్, బూట్లని విప్పదీయించి వెదికారు.

★ షికాగోలోని ఓ స్కూలుకి విద్యార్థులు ఇంటినుంచి టిఫిన్ బాక్సులు తెచ్చుకోవడాన్ని నిషేధించారు. విద్యార్థులు తప్పనిసరిగా స్కూల్ కేంటీన్‌లోని ఆహార పదార్థాలనే కొనుక్కోవాలనే నియమం పెట్టారు. వారి తల్లిదండ్రులు పేదవారని తెలిసీ ఇలా చేశారు. ఫలితంగా చాలామంది విద్యార్థులు ఆకలితో నకనకలాడారు.

★ అమెరికా అగ్రికల్చర్ డిపార్టుమెంటువాళ్లు చాలా పాఠశాలల్లో విద్యార్థులేం తింటున్నారో అధ్యయనం చేయడానికి కెమెరాలు అమర్చారు. విద్యార్థులు తప్పనిసరిగా ఆ కెమెరాల పరిధిలోనే తినాలనే నియమమూ పెట్టారు.




★ డల్లాస్‌లోని ఓ పబ్లిక్ స్కూల్లో చదివే టీనేజ్ విద్యార్థికి 340 డాలర్ల ఫైన్ వేశారు. దీనికి కారణం అతను చెడ్డభాషను ఉపయోగించడమేనట. దాంతో అంతవరకూ అతనికి విధించిన ఫైన్‌ల మొత్తం 637 డాలర్లు అయింది. ఇది కట్టేందుకు అతను పార్ట్‌టైమ్ జాబ్ చేయాల్సివచ్చింది.

★ టెక్సాస్‌లోని ప్రాథమిక పాఠశాలా విద్యార్థులపై పోలీసులు గత ఆరేళ్లల్లో వెయ్యి జరిమానాలు వేశారు. అన్నం తిన్నచోటుని శుభ్రం చేయకపోతే చాలు.. వచ్చి తనిఖీ చేసి ఫైన్ వేస్తారు.

★ నార్త్‌కరోలినాలోని ఓ స్కూల్లో చదివే అమ్మాయి పక్షిస్మిత్‌విన్ పొరపాటున తన లంచ్ బాక్స్‌కు బదులు, తన తండ్రి బాక్స్‌ను స్కూలుకి తీసుకెళ్లింది. అందులో ఆపిల్ పండుని కోసే కత్తి ఉందన్న నేరానికి ఆమెను ఆ ఏడాది స్కూలు నుంచి బహిష్కరించారు. పోలీసుకేసు పెట్టారు.

★ ఉపాధ్యాయుల మాట విననందుకు ఫ్లోరిడాలోని ఓ విద్యార్థినిని పోలీసులు సంకెళ్లు వేసి పిచ్చాసుపత్రికి పరీక్షలకోసం తరలించారు.

★ 2010లో న్యూయార్క్‌లోని ఓ పబ్లిక్ స్కూల్లో పన్నెండేళ్ల విద్యార్థిని డెస్క్‌మీద బాల్‌పెన్‌తో గీతలు గీసినందుకే పోలీసులు అరెస్టు చేసి, సంకెళ్లు వేశారు.

★ అమెరికాలో చాలా పబ్లిక్ స్కూళ్ల బాత్‌రూంలలో రహస్య కెమేరాల్ని ఏర్పాటు చేశారు.

ఫ్లోరిడాలోని కొందరు విద్యార్థులని పోలీసులు అరెస్ట్ చేయడానికి కారణాలు రబ్బర్‌ను టీచర్ మీదకి విసరడం, తుపాకి బొమ్మని బ్లాక్‌బోర్డ్ మీద గీయడం, ప్లాస్టిక్ బటర్‌నైఫ్‌ను తేవడం.

★ చాలా పబ్లిక్ స్కూళ్లకి పోలీసులు చేతుల్లో తుపాకులతో కుక్కల్ని వెంటబట్టుకుని వచ్చి తనిఖీలు నిర్వహిస్తుంటారు. ఆ సమయంలో స్కూలు విద్యార్థులంతా ఖైదీల్లాగే గోడవైపు చూస్తూ పక్కపక్కనే నిలబడ్డారని కోర్టులో ప్రవేశపెట్టిన ఓ వీడియోటేప్ వెల్లడించింది.

★ మస్సాచుసెట్స్ రాష్ట్రానికి చెందిన ఓ విద్యార్థి క్రాస్‌మీద ఉన్న జీసస్ చిత్రాన్ని తన పుస్తకంలో గీసినందుకు బలవంతంగా సైకియాట్రిస్ట్ ట్రీట్‌మెంట్ ఇప్పించారు.

★ సౌత్ కరోలినాలోని డంకన్‌కు చెందిన 13 మంది విద్యార్థుల తల్లిదండ్రులని పోలీసులు అరెస్ట్ చేశారు. వారు చేసిన నేరం- హైస్కూల్ గ్రాడ్యుయేషన్ సెరమనీలో తమ పిల్లల్ని చూసి ఆనందంతో అరవడమే!

అమెరికాలో క్రమశిక్షణకి పెద్ద పీట వేస్తారు. కొన్ని సందర్భాల్లో అది వ్యక్తిగత స్వేచ్ఛని, స్వాతంత్ర్యాన్ని హరించేలా ఉంటుంది. అమెరికన్స్ సాధారణంగా క్రమశిక్షణతోనే జీవిస్తుంటారు. అయితే క్రమశిక్షణ పేరుతో చాలామంది తమ పరిధులను దాటుతుంటారు. మనదేశంలో అవినీతిపరులను చూసీచూడనట్లు ఎలా వదిలేస్తారో, అక్కడ క్రమశిక్షణ విషయంలో పరిధులని దాటినవారిని ప్రభుత్వోద్యోగులు చూసీచూడనట్లు వదిలేస్తుంటారు. దాని ఫలితమే ఇది. అయితే విద్యార్థుల తల్లిదండ్రులు తమ పిల్లలకు స్కూల్లో జరుగుతున్న అన్యాయాల గురించి కోర్టుకి వెళ్లడం, మీడియా దృష్టికి తీసుకురావడం వల్లే పై విషయాలు బయటకు పొక్కాయి. ఇంతకంటే చాలా ఘోరమైన అన్యాయాలు ఎన్నో అమెరికన్ పబ్లిక్ స్కూళ్లలో నిత్యం సంభవిస్తుంటాయని ఇటీవల జరిగిన ఓ వెబ్‌సైట్‌లోని ఓటింగ్‌లో అమెరికా ప్రజలు తేల్చి చెప్పారు.

*–డి. పద్మజ*

గతనెల పజిల్ పూరించి, అన్నీ సరైన సమాధానాలు రాసినవారిలో డ్రా ద్వారా ఎంపికైన విజేత

**పి. సుబ్బారావు**

ఇంటి నెం. 3-4-21,
యూకోబ్యాంక్,
మెయిన్ పిడబ్ల్యూడి రోడ్,
సంగారెడ్డి,
మెదక్ జిల్లా

వీరికి రూ.150/- త్వరలోనే అందుతాయి.

# చతురంగం -4 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 వి | పు | 2 ల | | 3 తు | 4 ల | | 5 పో | త | 6 న |
| న | | వ | | 7 కా | యం | | కి | | గ |
| 8 త | 9 మి | స | | 10 రాం | వి | | 11 రి | 12 పు | లు |
| | ధీ | | 13 ఓం | | | 14 ద | | కా | |
| 15 అ | ల | 16 కా | పు | రి | | 17 శ | 18 కా | రు | 19 డు |
| మ్మ | | 20 లా | రి | | | 21 కం | చు | | టు |
| | 22 బం | తీ | | | 23 శ | రు | డు | | రా |
| 24 స్వ | గ | తం | | 25 కు | బ | డు | | 26 భా | వి |
| 27 జ | రు | | 28 త | లా | రి | | 29 వీ | ర | |
| నం | | 30 గ | రం | సా | | 31 రు | డు | వి | దు |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. ఎ. కాళేశ్వరరావు, హైదరాబాద్ 2. డా. కూచి వెంకట నరసింహారావు, కుంచనపల్లి, ప.గో. జిల్లా 3. కె. సుధాకర్‌రెడ్డి, కోట 4. కోనే నాగ వెంకట ఆంజనేయులు, విశాఖ 5. వాణి నేమాని, విశాఖ 6. భారతుల అరుణ, సికింద్రాబాద్ 7. కె. సత్యనారాయణ, ఆమందూరు 8. జి. సూర్యనారాయణ, బందలాయి చెరువు 9. సిహెచ్. హర్ష, విజయవాడ 10. అవధానం రంగనాథం, అనంతపురం 11. వి.వి. సత్యనారాయణ శెట్టి, తిరుపతి 12. ఉపద్రష్ట నరసింహమూర్తి, సికింద్రాబాద్ 13. డి. విజయ కృష్ణ, హైదరాబాద్ 14. వి. సీతామహాలక్ష్మి, తిరుపతి 15. పారేపల్లి గోపాలరావు, కేసరపల్లి 16. డా.చక్రపాణి యిమ్మిడి శెట్టి, అనకాపల్లి 17. వి. అనూరాధ, దిల్‌సుఖ్‌నగర్ 18. యు.విజయశేఖర రెడ్డి, కూకట్‌పల్లి, 19. దేసూళ నిర్మలాదేవి, ఎర్రగడ్డ, 20. టి.ఆర్. బాలకృష్ణారావు, రాజమండ్రి 21. చుండూరు అప్పల నరసింహం, హైదారాబాద్ 22. వానపల్లి వెంకట సత్యవతి, సీతమ్మపేట 23. వి.గంగరాజు, విశాఖ 24. బోడపాటి కృష్ణవేణి, టి.నగర్, చెన్నై 25. యు.యు.యు., ఎమ్మిగనూరు 26. సి. విజయ భాస్కర్ రెడ్డి, ప్రొద్దుటూరు 27. జి. బ్రహ్మానందము, హైదరాబాద్ 28. యమ్. అలమేలు, హైదరాబాద్ 29. రామకూరు నాగేశ్వరరావు, శ్రీకాకుళం 30. జి.పద్మావతి, చెన్నై 31. అయ్యగారి శ్రీనివాసరావు, విజయనగరం 32. బి. నిర్మల్‌రావు, బ్రహ్మపూర్, ఒడిషా 33. ఎస్.అబ్దుల్ అజీజ్, పెద్దమండడి 34. కాకర్లమూడి బాలకష్ణ ప్రసాదు, తణుకు 35. పి. కుశకుమార్, రామంతపూర్ 36. ఎన్.వి. గిరి, తిరుపతి 37. గురజాల వరలక్ష్మి, ఉచ్చిలి 38. వేమూరి విశాలాక్షి, గుంటూరు 39. ఐ.ఎన్. మూర్తి, కాకినాడ 40. కస్తూరి భారతి, విజయవాడ 41. ఎన్. విజయలక్ష్మి, ఒంగోలు 42. వి.ఆర్. అల్లమరాజు, కాత్రేనికోన 43. టి. శశికళ, గుంతకల్లు 44. లలిత దేవులపల్లి, ఉయ్యూరు 45. ఎం. వసంత, బోరబండ 46. ఎస్. నాగవర్ధని, నూజివీడు 47. ఎన్. జగన్మోహనరావు, కరీంనగర్ 48. కె. శ్రీరాములు, షేక్‌పేట్ 49. ఎస్. జ్యోతి, అక్కయపాలెం 50. పేరి సత్యసాయి కృతి, సికింద్రాబాద్

---

*గమనిక :* చతురంగం-4లో నిలువు 26 'భారవి' కి ఆధారాలలో 'కాదంబరి రచించిన సంస్కృత కవి' అని వచ్చింది. దాన్ని 'కిరాతార్జునీయం రచించిన సంస్కృత కవి' అని చదువుకోవల్సిందిగా మనవి. ఈ అసౌకర్యానికి క్షంతవ్యులం.

# చతురంగం - 5 ఆధారాలు

## అడ్డం

1. సినారె తొలిపాట 'నన్ను దోచుకుందువటె' ఈ సినిమాలోనిదే (8)
6. మేకులాంటిదే (2)
7. 'సుత్తి' జంటలోని నటుడికి కొమ్ము విరిగింది (2)
8. శృంగారగీతం లాంటిదే (3)
10. భూమి (3)
12. తీయనైన నామం.. అటు నుంచి (2)
13 గారె, వేసవిలో మాత్రం దీని దెబ్బకు జనం హడల్(2)
15. ముస్లింల ప్రార్థన గజిబిజి (3)
16. కత్తే కాస్త గంభీరంగా (4)
19. సమయం (2)
20. పైరులో ఉండేవి, శ్రీపాదవారి గొప్పకథ (6)
23. బ్రహ్మ పుట్టింది విష్ణువు — లో (3)
24. కుచేలుడు కృష్ణునకు ఇచ్చినవి సగమయ్యాయి (2)
25. కంగారు కంగారుపడి గజిబిజి (3)
27. 'తలుస్తాం' కు వ్యతిరేకం (3)
29. మంట ఎక్కువై అడుగంటు .. అటునుంచి (2)
30. పడిపోవడం.. దిగజారడం (3)
31. నందుడి భార్య అటునుంచి (3)
32. నువ్వులు అటునుంచి (3)
33. నిలువు ఇరవై ఏడే సరిగా (3)

## నిలువు

1. 'కన్యాశుల్కం' నాటక కర్త (4)
2. సుప్రసిద్ధ శివక్షేత్రం (2)
3. ప్రేమ (3)
4. ... లేములు కావడి కుండలు (3)
5. చందమామ (4)
7. ఇప్పటికీ జనం నాలుకలమీద బతుకుతున్న ఈకవి యోగి కూడా (3)
9. పెళ్లిసందడి నాయిక తలకిందులు (3)
11. అమ్మాయిలు ముచ్చటగా అల్లుకునేది తలకిందులు (2)
14. ఊరుతో ఉండే జంట పదం కింది నుంచి (2)
16. తెలుగులో ఆర్ట్ (2)
17. రావణుడు సీతను ఉంచింది (3)
18. వర్షానికి నెమలి ఇది విప్పి ఆడుతుంది.. కింది నుంచి (2)
19. 'ఆకుచాటు పిందె తడిసె' అంటూ సీనియర్ ఎన్టీఆర్ నటించిన సినిమా (4)
21. సోదరి తలకిందులు (2)
22. ఆయువు మూడాక వచ్చేవారు తడబడ్డారు (5)
23. స్వర్గం (2)
26. కర్చీఫ్, దస్తీ.. తెలుగులో (3)
27. జీతమే గందరగోళం (3)
28. నమస్కారం (3)
30. భర్త (2)

**నిబంధనలు**

1. చతురంగాన్ని అదేపేజీలో పూర్తిచేసి పంపాలి. 2. తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. 3. గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలింపబడవు. 4. ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. 5. ఒక్కొక్కరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చు. 6. ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

**చతురంగం పంపాల్సిన చిరునామా :**

**చతురంగం** చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ -082

★ ఒకే కవరులో చతురంగం కూపన్లు ఎన్నయినా పంపవచ్చు ★ చతురంగం, చతురప్రవేశిక, కాప్షన్ మీదే, విపుల వినోదిని ఒకే కవరులో పంపినా పరిశీలిస్తాం

# చతురంగం - 5

**రూ.150/- బహుమతి**

**గడువు తేది : ఆగస్టు 18**

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | | 2 | 3 | | 4 | | ■ | 5 |
| | ■ | ■ | 6 | | ■ | | ■ | 7 | |
| 8 | | 9 ళ్ళి | ■ | 10 | 11 | | ■ | 12 | |
| | ■ | 13 | 14 | ■ | | ■ | 15 | | జు |
| ■ | 16 | | | 17 | ■ | 18 | ■ | ■ | ■ |
| 19 | | ■ | ■ | 20 | | పు | | 21 | 22 |
| | ■ | 23 | | లో | ■ | ■ | ■ | 24 | |
| 25 | 26 | | ■ | ■ | 27 | | 28 | ■ | |
| 29 | | ■ | 30 | | | ■ | 31 | | |
| ■ | 32 | | | ■ | 33 | | | ■ | |

పంపినవారి పేరు: ----------------------------------------

వయసు (    ) చిరునామా : ----------------------------------

--------------------------------------------------------

---------------- పిన్ : ---------- ఫోన్ : --------------

ఆధారాలు, నిబంధనలు 129 పేజీలో...

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, Plot No. 95 & 96, Gandhinagar, Quthubullapur Village & Mandal, R. R. District., Hyderabad-500 037. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore: 25583804. & www.eenadu.net.

# ముఖచిత్రంగా మీ ముఖారవిందం!




క్యూట్ క్యూట్ బేబీస్, యూత్‌ఫుల్ లేడీస్‌కు ప్రాధాన్యం
అందం, ఆకర్షణ, తగిన డ్రస్‌సెన్స్ ఉంటే చాలు..
మీ అభిమాన విపుల / చతురకు
మీరే ముఖచిత్రం అవుతారు
చేయాల్సిందల్లా- పోస్ట్‌కార్డ్ సైజ్ క్లోజప్పులు రెండు,
అదే సైజ్ 3/4 ఫొటో ఒకటి వెంటనే మాకు పంపండి.
ఫొటోలు మెయిల్ కూడా చేయొచ్చు

**నోట్ : ఫొటోల ఎంపికలో తుది నిర్ణయం సంపాదకులదే.**
**ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు, వాదవివాదాలకు చోటేలేదు.**

★ ఫొటోలు పంపేవారు విధిగా తమ మరియు తమ తల్లిదండ్రుల అంగీకార పత్రంతోనే ఫొటోలు పంపాలి.

★ మీరు బాగున్నా, ఫొటోలు క్వాలిటీగా లేకుంటే మేమే ఫొటోగ్రాఫర్‌ను పంపుతాం.

★ ప్రచురణ తర్వాత ఫొటోలు తిరిగి కావాలనుకునేవారు తగిన పోస్టేజి స్టాంప్‌లంటించిన స్వంత చిరునామాగల కవరును జతపరచాలి.

చిరునామా : సంపాదకులు, చతుర/విపుల, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్- 500082 ఈ మెయిల్ : vipula.chatura@eenadu.net
vipula.chatura@gmail.com









